# ఈ సంచికలో



ముఖచిత్రం : **రాకుమారి రక్షణ**

చిత్రకారుడు : **వడ్డాది పాపయ్య**


యువ సాలుచందా రూ. 24-00

దీపావళి సంచికతో రూ. 30-00

యువ, హైదరాబాదు - 500001




"విశ్వాసనోదరుని" ముఖచిత్రంతో వెలువడిన మేనెల మాసపత్రిక అత్యంత ఆకర్షణీయంగా వుంది.

'కురుక్షేత్ర మహాసంగ్రామమునకు కారకురాలు ద్రౌపది, అంటే ఒకఆడది. నిష్ఠాగరిష్ఠుడైన విశ్వామిత్రుని తపస్సును క్షణంలో భంగం చేయగలిగిన మేనక ఆడది. ఆడది తలచుకుంటే చపల చిత్తులైన పురుషులు క్షణంలో పతనమవుతారు.' ఈ జీవిత సత్యాన్ని వన్‌పూల్ గారు తమ కథ 'నిపుణిక' లో ప్రతిబింబింపచేశారు. ఆడదానిని "అబల" అనే వారికిది కనువిప్పు. ఈనాడు మన దేశంలోనున్న నిరుద్యోగ సమస్యకు 'తక్కిన ఇద్దరు' కథ అద్దం పట్టింది. 'వాళ్లు నలుగురు; 'మూర్ఖుడు' కథలు నా హృదయాన్ని ఆకర్షించాయి.

ఆనందారామం గారి నవల "నీరజ" కమనీయంగా వుంది. 'యువ' మాస పత్రిక ధర పెరిగినా కొంటున్నామంటే దానికి కారణం పత్రికలోని రచనలే.

—యు. బి. కె. ప్రమీల,
గుంటూరు-1

# రచయితలకు మనవి

మాకు నెలనెలా వందలకొద్దీ కథలు వస్తూన్నదృష్ట్యా, వాటిని పరిశీలించి, రచనలు పంపిన వారిని నిరీక్షింపజేయడం అంత సబబుగా ఉండదు కాబట్టి, కొంతకాలంపాటు రచయితలను/రచయిత్రులను కథలు పంపవద్దని సవినయంగా మనవి చేస్తున్నాము.

— సంపాదకుడు

మే నెల యువ ఎంతో చక్కని కథలతో ముస్తాబై ఎంతో బాగుంది. యీ సంచికలో వెలువడిన 'నీరజ' నవల ఎంతో చక్కగా వుంది. వన్‌పూల్ గారు రచించిన 'నిపుణిక' కథ చిన్నదయినా స్వదేశంపై ఆ నర్సుకున్న మమకారం రచయిత చాలాచక్కగా చిత్రీకరించారు. 'నలుగురు ఫకీర్లు' సీరియల్ మాంచి సస్పెన్స్‌లో ముంచెత్తుతూసాగిపోయింది. యిది యువకే హైలైట్. సెంటిమెంటల్ ఫూల్స్ 'నాతోపాటునలుగురు'' తక్కినయిద్దరు' కథలు చాలాయింట్రెస్టుగావున్నవి. మిగతా సీరియల్స్ కూడా కొత్త పుంతలు తొక్కుతూ చక్కగా సాగిపోతున్నాయి. ప్రతి సంచికలో ప్రచురించే కథలు సీరియల్స్ మాలో చెరగనిముద్రలు వేస్తున్నాయంటే మీఎడిటోరియల్ చాలాగొప్పది. అందుకు నా అభినందనలు—

—లగడపాటి వెంకటేశ్వర్లు.

విశ్వాస సోదరుడు ముఖచిత్రంతో వెలువడిన సంచికలో సి. ఆనందారామం గారి 'నీరజ' నవల చాలా బాగున్నది. ముద్దంశెట్టి హనుమంతరావుగారి 'పాపం పార్వతమ్మ' వలన చాలామంది పార్వతమ్మలకు కనువిప్పు కలుగుతుంది. "నిపుణిక" చాలాకాలంవరకు మరువలేని కథ. ప్రతినెలా మంచి మంచికథలు అందిస్తున్న మీకు నా హృదయపూర్వక ధన్యవాదములు.

—సుంకర భారతీరాం, యలమంచిలి.

అపురూపంగా,

అనన్య సాధ్యంగా,

అద్భుత వర్ణదృశ్య కావ్యంగా

సినిమా స్కోప్‌లో

రూపొందించిన

ఆంధ్ర విప్లవవీరుని

అమరగాథ.

అన్ని కేంద్రాలలోనూ దిగ్విజయంగా నడుస్తున్న చిత్రం:



# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 29 జూన్-1974 సంచిక 5


జూలై నెల

## భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

జూన్ నెల

# భావపరిచయ పోటీ

## బహుమతి పొందిన వ్యాఖ్య



తల్లి పోలీసు అయిన
పిల్ల లూరకుందురే ధరణిలోన
లైటులేని సైకిలెక్కి వచ్చు
తండ్రినే పట్టింప ఫిర్యాదు చేయవచ్చు.

— సి. శోభ, హైదరాబాదు.




# చట్టం

## వనఫూల్

జీవన్ పక్కస్టేషన్లో దిగాడు. దుస్తులు మార్చుకొని.

'డాక్టరు వద్దనుంచి ఓ సర్టిఫికెట్ సంపాయించగలిగితే గండం గడిచిపో తుంది చాలమటుకు' అనుకున్నాడు బాగా ఆలోచించినమీదట.

దగ్గరలో ఉన్న గవర్నమెంట్ హాస్పిటల్ పెద్ద డాక్టరును సమయం సందర్భం కనిపెట్టి ఏకాంతంగా కలుసు కున్నాడు జీవన్.

ఆ డాక్టరు ఆ ఉద్యోగంలో చాల కాలంనుంచి ఉంటున్నాడు. ఈ వ్యవ హారాలు ఆయనకు కొత్తకాదు. ఆరితేరిన ఘటం! అయినా, అడగ్గానే సర్టిఫికేట్ గీసిపారేయలేదు. జీవన్ కూడా అట్లా అనుకోలేదు. ఓపిగ్గా మాట్లాడేందుకు సంసిద్ధుడైనాడు.

"కావాలంటే ఇవాళ్టి తేదీ వేసి సర్టి ఫికెట్ ఇస్తాను. పాత తేదీవేసి సర్టిఫికెట్ ఇవ్వాలంటే అంత తేలికవిషయంకాదు. ఎంతో రిస్కు ఉంది. మిమ్మల్ని నేను ఎరగను. మీగురించి ఎప్పుడూ వినను కూడా లేదు. ఇంతవరకూ మీరు ఎక్క డున్నారో, ఏంచేసేవారో నాకు రవ్వంత

తెలీదు! వరినే ఓ సర్టిఫికేట్ ఇవ్వమంటే ఎట్లా?''

అయినా జీవన్ నిరాశతో నీలుక్కు పోలేదు. అతనికి అవశ్యంగా కావల్సిందల్లా పాతతేదీవేసివున్న దొంగ సర్టిఫికెట్. అందులో మొన్నటినుంచీ డాక్టరు టి.సి. పాలేవద్ద మెడికల్ ట్రీట్‌మెంట్ పొందుతూన్నట్టు ఉండాలి. దానికి ఫీజుగా డాక్టరు ఎంత అడిగినా ఇచ్చుకొనేందుకు అతను ఆజేతగా ఉన్నాడు.

"మీరు కోరినట్లు సర్టిఫికెట్ ఇవ్వడం గొప్ప డేంజర్!"

"నేను మహా ఇబ్బందుల్లో ఉన్నాను సార్! నాపై దయవుంచి సర్టిఫికెట్ ఇవ్వాలి సార్!"

పది, ఇరవై, యాభై, వంద, రెండొందలు, ఐదువందలు—కొసకు వెయ్యి దాకా బేరాన్ని పొడిగించాడు జీవన్. తాతముత్తాతల పుణ్యమా అని డబ్బును గురించి అతనికి బెంగలేదు.

డాక్టరు మెల్లిగా గొంతుసవరించుకొని, కోరమీసాన్ని మృదువుగా దువ్వుకో సాగాడు.

డాక్టరు పాల్ మనస్సు మెత్తబడిందని గ్రహించాడు జీవన్.

"మీకేమైనా రోగాలున్నాయా?"

''రెండేళ్ళ క్రితం కామెర్లు, ఒకసారి ఎపిండీసైటెస్ వొచ్చింది.''

"ఆపరేషన్ జరిగిందా?''

"ఊహూ!"

"అయితే సరి మంచిది. ఎపెండిక్స్ తీసేస్తాను.''

"అందువల్ల నాకొచ్చేలాభమేమిటి?''

"తప్పకుండా వుంటుంది! కనీసం ఆ రోగమైనా కుదురుతుంది."

"ప్రస్తుతం నాకు కావల్సింది సర్టిఫికెట్ డాక్టరుగారూ!"

"నే చెప్పేది మీకు బోధపడటం లేదు. నేను చేసేది కట్టుదిట్టంగా ఉండాలి. పొల్లు వచ్చిందా పీకకు చుట్టుకుంటుంది. మిమ్మల్ని హాస్పిటల్లో చేర్చుకుంటే రిజిస్టర్‌లో వ్రాయాలి, మీ పొట్టమీద ఆనవాలు కూడా ఉంటుంది. అందువల్ల ఏ ఇబ్బందీ ఉండదు.''

జీవన్‌కు అంతా అయోమయంగా ఉంది. విడమర్చి చెప్పాడు డాక్టరు.

''మొన్ననే చేరినట్లు మిమ్మల్ని హాస్పిటల్లో చేర్చుకుంటాను. అయితే, అందునిమిత్తం హాస్పిటల్ అడ్మిషన్ రిజిష్టర్ మార్చాల్సి వుంటుంది. అంటే ఏమిటన్నమాట- నా అసిస్టెంట్ డాక్టరుకూ, కాంపౌండరుకూ కూడా కొద్దో గొప్పో సొమ్ము ముట్టజెప్పడానికి మీరు సంసిద్ధులు కావాలి. ఆ పని ఒక్కరివల్ల కాదు. పైగా ఇది అత్యంత ప్రమాదకరమైన విషయమని మీరు గ్రహించాలి. చట్టాన్ని అతిక్రమించడం అపాయకరం.

మళ్ళీ కోరమీసాన్ని మృదువుగా దువ్వసాగాడు డాక్టర్.




"మొత్తంమీద ఎంత డబ్బు కావాల్సి ఉంటుంది?"

"రెండువేలదాకా!"

జీవన్ దీర్ఘంగా ఆలోచించాడు. తన జీవితంకన్నా రెండువేలరూపాయలు అమూల్యమైనవేమీకాదు. అంతేకాకుండా డాక్టర్ ప్లాన్ పకడబందీగా ఉంది. జీవన్ అంగీకరించాడు.

ఆ డాక్టరు సర్జరీలో ఆరితేరినవాడు. సునాయాసంగా ఆపరేషన్ చేశాడు. అంతేకాకుండా జీవన్ హాస్పిటల్‌లో ఉన్నంతకాలమూ ఆప్యాయంగా, అతి జాగ్రత్తగా చూసుకొన్నాడు. దానికి జీవన్ పొంగిపోయాడు. అసిస్టెంట్ డాక్టరూ, కాంపౌండరూ కూడా చాల మంచివాళ్ళుగా కనిపించారు. జీవన్‌కు ఏమాత్రం అసౌకర్యం జరుగకుండా బహుతాపత్రయ పడేవాళ్ళు. ధనికుల బిడ్డ అయిన జీవన్ ఇలాంటి రెండువేల రూపాయలసొమ్ము ఎన్నోమార్లు ఖర్చు చేశాడుగానీ, ఇట్లాంటి సుఖప్రదమైన పరిచర్యల్ని ఎప్పుడూ పొందిఉండలేదు.

హాస్పిటల్‌నుంచి డిస్చార్జి అయిన రోజు ఉదయం డాక్టరు ఇంటికి వెళ్ళాడు జీవన్. లోపలకు తీసుకెళ్ళి కూర్చోబెట్టాడు డాక్టరు. మాంచి శైలిలో, గట్టిగా ఒక సర్టిఫికెట్ వ్రాసాడు డాక్టరు. చిరుదరహాసం వెలువరించి ఇట్లా అన్నాడు.

''నేను చాల కట్టుదిట్టంగా వ్యవహరించాను. ప్రపంచంలో ఏ చట్టమూ మిమ్మల్ని పట్టుకోలేదు.''

జీవన్ కృతజ్ఞత తెలియజేశాడు.

"ఇప్పుడైనా మీరు నిజం చెబుతారా? ఒక దొంగసర్టిఫికేట్ కోసం మీరింత డబ్బు ఎందుకు ఖర్చుచేశారు? మీరు చేసిన నేరమేమిటి?"

ఈ ప్రశ్న డాక్టరు వద్దనుంచి వస్తుందని జీవన్ ఏ మాత్రం ఊహించ లేదు.

"ఇప్పుడు చెప్పటానికి మీకేం అభ్యంతరం?" అన్నాడు డాక్టరు.

జీవన్ కొన్ని క్షణాలపాటు తటపటాయించాడు "మిమ్మల్ని నమ్మవచ్చునా ?" అన్నాడు.

"నిస్సందేహంగా."

'హత్య చేశాను."

"హత్యా ?...ఎవరిని ?"

తాను ఎవడ్ని చంపిందీ జీవన్‌కు తెలుసు. కాని బయటపెట్టదల్చుకో లేదు. నెత్తురు మడుగులో వున్న ఆ మనిషి మొహాన్ని ఒక్క క్షణంపాటు గుర్తుకు తెచ్చుకొన్నాడు. అతని పేరు రమేష్. చేతిమీద రమేష్' అనే పచ్చ పొడిచి ఉంది. తాను హత్యచేసిన వ్యక్తి పేరును జీవన్ బయటపెట్టలేదు.

"హత్య ఎందుకు చేశారు ?" అన్నాడు డాక్టరు కలవరంగా.

జీవన్ నిర్లిప్తంగా నవ్వాడు.

"స్త్రీని గురించి. ఒక స్త్రీ ప్రేమ విషయంలో అతను నాకు ప్రత్యర్థి."

"ఎక్కడ హత్య చేశారు ?"

"రైల్లో."

అప్పుడే పోస్ట్‌మన్ వచ్చి ఒక కవరును డాక్టరుకు ఇచ్చాడు.

జీవన్ లేచి నిలబడ్డాడు.

"నేను వస్తాను డాక్టరుగారూ! మీకు చాల కృతజ్ఞుణ్ణి."

సర్టిఫికెట్‌ను భద్రంగా జేబులో పెట్టుకొని గబగబా వెళ్లిపోయాడు జీవన్.

కవరు చించి ఉత్తరాన్ని చదవసాగాడు డాక్టరు. అది పోలీసు డిపార్ట్‌మెంట్ నుంచి వచ్చిన ఉత్తరం. దాన్ని చదువుతూండగా అతని మొహం వెలవెలపోసాగింది.

"సుమారు ఒక మాసంరోజుల క్రితం ఒక రైలుపెట్టెలో ఒక శవాన్ని కనుక్కోవడం జరిగింది. ఆ వ్యక్తి కత్తిపోట్లవల్ల మరణించినట్టు శవపరీక్షలో తేలింది. అది హత్య. అతని ఎడంచేతి మీద 'రమేష్' అనే పచ్చ పొడిచి ఉంది. అంతకు తప్ప అతన్ని గుర్తించటానికి శరీరంమీద ఏమీ గుర్తులేదు. ఆచూకీ తీయగా అతను డాక్టర్ టి. సి. పాల్ పెద్దకొడుకనీ కలకత్తాలో కమీషన్ వ్యాపారం చేసేవాడనీ తెలియవచ్చింది. ఇది ఎంతవరకు నిజమో డాక్టరు టి.సి. పాల్ పోలీసువారికి తెలియబర్చాలి నిజమైతే, రమేష్‌ను గురించి ఇంకా వివరాలు తెలిపి, చట్టరీత్యా నేరస్థుడైన వ్యక్తిని పట్టుకోవడంలో పోలీసువారికి తోడ్పడాలి."



# కులం లేని మనిషి

కొడవటిగంటి కుటుంబరావు

తల్లిపోయిన రోజునుంచీ శాంతకష్టాలు ప్రారంభమయినై. కాని ఆ సంగతి శాంతకు తెలీదు. ఆమె తల్లికోసం ఎక్కువ దిగులుపడలేదు. ఆమె మొదటి నించీ తండ్రి మాలిమి పిల్ల. అదివరకల్లా ఆయన్ను తనతోపాటు తల్లికూడా పంచుకుంటూ వచ్చింది. ఇప్పుడాయనకు తను తప్ప ఇంకెవరూ లేరు. వైధవ్యం ప్రాప్తించిన మనిషి పిల్లల్ని సంరక్షించటంలో భర్తను మరచినట్టు శాంత తండ్రిని సంరక్షించటంలో తల్లిని మరచింది.

శాంతలో కలిగిన మార్పు సీతారామశాస్త్రిగారికి నచ్చలేదు. మొదటి సంగతి, ఫిఫ్తుఫారం చదువుకుంటూ, చదువుమీద ఎంతో ఉత్సాహం ప్రకటిస్తూ వచ్చిన శాంత, అకస్మాత్తుగా బడి మానేసి ఇంటో కూర్చుని, తన కొద్దిమంది స్నేహితులతోనూ సంబంధం పోగొట్టుకుని, ఇంటిపనుల్లో నిమగ్నం కావటం మంచిది కాదని ఆయనకు తోచింది.

తను ఉన్నంతకాలమూ శాంతకు ఏదోవిధంగా వెళ్ళిపోదని కాదు. కావలసినంత డబ్బుంది, దైవకృపవల్ల. పదివేలు చేసే ఇల్లుంది. కాని తను పోయిన మరుక్షణం శాంత గతి ఏమిటి ? భార్య పోయినప్పటినించీ అసలే బలహీనంగా

ఉంటూవస్తున్న శాస్త్రిగారిగుండె రకరకాల ఆటలాడుతున్నది. ఆ జబ్బు సంగతి శాంత దగ్గిర దాచిపెట్టడంకూడా ఆయనకు సాధ్యం కావటంలేదు. అటువంటి జబ్బు పెట్టుకొని రేపటిరోజు మన దనుకునేటందు కుందా ?

ఈపాటికి శాంత వివాహం అయికానీ, కాబోతూ కానీ, ఉంటే ! అప్పుడు తనకు చావుభయంగాని, పిల్లనుగురించిన దిగులుగాని ఉండదు.

శాంత చదువుకుంటూనన్నా ఉంటే, నలుగురితోనూ పరిచయమైఉండి ఎవరో ఒకరు ఆమెను పెండ్లాడటానికి ... ఆమె ఇల్లు కదిలి రెండేళ్ల కావచ్చింది. ఆమె కివ్వాడు ఉత్తరంరాసే స్నేహితురాలైనా లేదు

మామూలు పిల్లలకు పెళ్ళికావటమే ఎంతోకష్టం కదా ! పైపెచ్చు కులంలేని పిల్ల ... !

నిజానికి శాంతకు అటూ ఇటూ ఎవరూ లేరు. ఆమెతల్లి భోగంమనిషి, తండ్రి బ్రాహ్మడు. శాంతది, ఏ కులం ? డబ్బులేకుండా జీవించటంకన్న కూడా కష్టం కులంలేకుండా జీవించటం - ఈ 1939 లో కూడా ! ఏమంటే డబ్బులేక వీధిలో నిలబడ్డమనిషిని కులంవాళ్లు దగ్గిరికి చేరదీసి కొంతకాలం ఆదరించినా ఆదరించవచ్చును. కాని కులంలేని మనిషిని పలకరించే దెవరు ... ?

తను సంఘాన్ని ధిక్కరించి భోగంపిల్లను పెళ్ళాడి, తండ్రిచేత విసర్జించబడి కూడా ఏదోవిధంగా బతకటమేగాక, చేసిన ప్రయత్నాలు కలసివచ్చి నాలుగు రాళ్ళు వెనుక వేసుకునే పరిస్థితి ఏర్పడిన తర్వాత, 'నిజంగా మనని భగవంతుడు కనిపెట్టి ఉండాలి గాని ఈ సంఘమేమిటి ? వీళ్ళు మనకు చెయ్యగలిగిందేమిటి?' అని అనేకసార్లు గర్వంగా చెప్పుకున్నాడు శాస్త్రి. ఇవాళ శాంత భావిగతి ఏమిటా అని ఆలోచిస్తే సంఘం అంత తృణీకరించ దగినదిగా కనిపించ లేదు. అది తలుచుకుంటే శాంతకు చెయ్యగల సహకారం చాలా ఉంది. కాని సంఘం శాంతను దగ్గరికి తీయదు. తను ఎన్నడో ఇరవై ఏళ్ళనాడు చేసిన పాపానికి రేపు సంఘం తన కూతుర్ని శిక్షిస్తుంది.

"ఇది అన్యాయం, అన్యాయం !" అనుకున్నాడు శాస్త్రి. కాని తను న్యాయ మనుకునేదానికి జీవితంలో ఎక్కువ ఉన్నతమైన స్థానం ఉన్నట్టు కనిపించ లేదు.

తను 20 ఏళ్ళక్రితం చేసినపని నిజంగా తప్పేనా అని శాస్త్రి ఆత్మవిమర్శ చేసుకోవటం మొదలుపెట్టాడు. ఇంతకాలమూ అది తప్పని ఆయన ఒప్పుకోదలచ లేదు. ఈ సందిగ్ధస్థితిలో ఆయనకు మతిచెడి, అది నిజంగా తప్పయితే తప్పని

ఒప్పుకుని పశ్చాత్తాపమైనా పొందుదామని చూశాడు. కాని అట్లా అనుకున్నా తను ఆనాడు ఆ భోగంపిల్లను పెళ్ళాడటం తప్పుగా కనిపించలేదు.

స్థూలంగా చూస్తే తనుచేసిన మహాపచారం ఏమిటి ? వేశ్యావృత్తిలో ప్రవేశించ టానికి సిద్ధంగాఉన్న ఒకప్రాణిని పెళ్ళాడి ఆమెను నరకకూపంలోనించి లేవ నెత్తాడు. దానికా సంఘం తనమీద ఆగ్రహించింది ? వేశ్యజాతిని ఉద్ధరించాలని సంస్కర్తలంతా వాగిన వాగుడూ, వారి వాగుడును నలుగురూ మెచ్చిన మెప్పూ - అంతా బూటకమేనా ? ఈమాట ఎవరినన్నా నిలదీసి అడిగేటందు కుంటే బాగుండును ? కాని ఎవరి నడుగుతాడు ? ఎవరు సమాధానం చెబు తారు ? ... లాభంలేదు. జీవితం అర్థహీనమయిందని అనుకుని భరించ వలసిందే ! ...

అయితే నరకకూపంలో దిగబోతున్న ఒక వేశ్యను ఉద్ధరింతామనే సదు ద్దేశంతో శాస్త్రిగారు శాంత తల్లిని పెళ్ళాడలేదు. ఆవిడా తనూ ఒకరి నొకరు ప్రేమించుకున్నారు. ఒకరోజు రాత్రి పదకొండు గంటల వేళ ఆమె ఎంతో సాహసంతో తాను ఉంటున్న గదిదగ్గిరికి వచ్చి తలుపుతట్టింది. తను తలుపుతీసి ఆమెను చూసి ఆశ్చర్యపడి "ఎందు కొచ్చావు ఈ వేళప్పుడు ?" అని అడి గాడు. అప్పటివరకూ తను ఆమెని మోహించాడేకాని ఆమెకు తనమీద ఏ భావం ఉన్నదీ ఎరగడు. ఆమె తల వంచుకుని నేలకేసి చూస్తూ "ఎట్లాగో రేపీపాటికి నేను అపవిత్రమై పోతాను. నేను మీ కివ్వగలిగిందేమీ లేదు - నా ఒళ్ళు తప్ప" అనే అర్థం వచ్చేటట్టు ఏదో అన్నది.

కథల్లోమల్లే, కలల్లో వచ్చినట్టుగా, తను వెర్రిగా కాంక్షించి నిరాశచేసుకున్న మనిషి తనదగ్గిరికివస్తే తను నిగ్రహించుకోలేకపోయినాడు అదితప్పా ? ఆ స్థితిలో ఎంతమంది ఆత్మనిగ్రహం ప్రకటించిఉండేవాళ్లు ? ...

ఒకసారి ఆమెను స్పృశించిన తరవాత, ఏమీ జరగనట్టు మర్నాటినుంచీ ఆమెను వేశ్యావృత్తిలో దిగనివ్వటం తనవల్ల కాలేదు. ఆమె తనకు శరీరం ఇచ్చింది. మనసిచ్చింది. అన్నిటికన్నా ఎక్కువైన ఆత్మనే ఇచ్చింది. తను కాదు - ఆ స్థితిలో ఆమెను విసర్జించిన వాడెవడూ మానవు డనిపించుకోవటానికి అర్హుడుకాడు. ఆమెతప్పు లేదు. తనదారిన తనను వెళ్ళనివ్వ మన్నది. అప్పు డామె మాట తను విని ఉంటే ఈ సంఘం దృష్టిలో తను చాలా బుద్ధిమంతుడుగా ఉండేవాడే !

ఒకప్రాణిని ఉద్ధరించినందుకు, ఒకస్త్రీని అంత గాఢంగా ప్రేమించి

నందుకు, తనలో మానవత్వం ఉంది ఆమెను విసర్జించనందుకు, లోకం తన మీద ఎంత కత్తికట్టింది! తను ఎంతో అసహాయస్థితిలో ఉంటే తన తండ్రి కానీ పంపకపోతే, 'ఇక తెలిసి వస్తుందిలే, అయ్యకు!' అన్నవాళ్ళున్నారు. 'పాపం ఎట్లా గడుస్తుందో?' అని అతన్ని చూసి ఎవరైనా అమాయకులు జాలి పడ్తే, 'ఫరవాలేదులే మొగుడు పెళ్ళానికి సంపాయించి పెట్టకపోతే పెళ్ళామైనా మొగుడికి సంపాయించి పెట్టలేకపోతుందా?' అన్నవాళ్ళున్నారు. వాళ్ళకేశిక్షా లేదు. ఎటొచ్చీ తనకూతురికే శిక్ష!

మధ్యమధ్య శాస్త్రిగారికి అకస్మాత్తుగా వెర్రిధైర్యం వచ్చి తన భయాలకు తనే నవ్వుకునేవాడు.

"శాంతకేమీ భయంలేదు. ఈ ఇరవై సంవత్సరాల కాలంలోనూ ప్రపంచం ఎంత మారింది! చదువుకుని విజ్ఞానవంతులైన కుర్రవాళ్లెంతమంది తయారైనారు! శాంతవంటిది భార్యకావటానికి ముందుకు దూకే వాళ్లూ ఆమె గుణానికీ, తెలివికీ ప్రేమించేవాళ్ళూ, ఆమెకోసం అయిన వాళ్ళ అభిప్రాయాన్ని ఖాతరు చెయ్యటం మానేవాళ్లూ ఎంతమంది వచ్చినా రావచ్చును. వెనుక విధవా వివాహమంటే ఎంత ఎబ్బెట్టుగా ఉండేది? ఇప్పుడు చూడరాదూ? అటువంటి పెళ్ళిళ్ళు చేసుకోవటం ఘనత. వాళ్ళ ఫొటోలు పత్రికల్లోకూడా పడతై! శాంత కేమీ ఫరవాలేదు. పొద్దస్తమానమూ శాంత ఇంటో పాతేసుకోకుండా ఉంటే బాగు! ను...ఆఖరుకు శాంతకున్న డబ్బు చూసైనా ఎవరో ఒకరు పడరా? ... ఛీం అసలంత కక్కుర్తి ఏంఖర్మం? శాంతను ప్రాణంతో సమానంగా ప్రేమించేవాడెవడో రాకపోడు!"

ఈ విధంగా శాస్త్రిగారు తన్ను తాను సమాధానపర్చుకునేవాడు తన మనస్సులో తిరిగే ఆలోచనలన్నీ కుమార్తెతో అందామనుకుంటే శాస్త్రిగారికేదో జంకు కలిగేది. తనభార్య పోయి శాంత తనకు మాతృస్థానంగా పరిణమించి నప్పటినించీ ఆయన తన కూతుర్ని తనకన్న ముప్పైఏళ్ళు పెద్దదన్నట్టు చూడటం అలవాటు చేశాడు అప్రయత్నంగా. ఇప్పుడు తనభార్య బతికి ఉంటే అటువంటి విషయాలు చర్చించేటందు కెంత ఉసులు!...

అప్పటికీ ఒకటి రెండుసార్లు అతి జాగర్తగా శాస్త్రిగారు కూతురితో ఆమె పెళ్ళిగురించి హెచ్చరించాడు.

"నాకు పెళ్ళేమిటి, నాన్నా? నేనసలు పెళ్ళే చేసుకోను!" అనేది శాంత.

"ఎందుకంత పట్టుదల?" అనేవాడు తను.

"పెళ్ళిచేసుకుంటే ఆ పెళ్ళి ఆదర్శప్రాయంగా ఉంటుందని తెలిస్తేనే చేసుకోవాలి. నువ్వూ అమ్మా చూడు. ఎంత అన్యోన్యంగా ఉండేవాళ్లో. మిమ్మల్ని ద్దర్నీ చిన్నతనంనించీ చూసి, అందరూ చేసుకునే కక్కుర్తి పెళ్ళి ఎట్లా నాన్నా, చేసుకోవటం ?"

"కక్కుర్తి పెళ్ళెందుకమ్మా ! మంచిపెళ్ళే చేసుకోవచ్చుగా !"

"ముందుగా ఎట్లా తెలుస్తుంది, నాన్నా ? ఎవరినో నమ్మి పెళ్లిచేసుకుంటే, ఆ తరవాత మేమిద్దరమూ మీరిద్దరూ ఉన్నంత ఆదర్శప్రాయంగా ఉండలేక పోతే నేను సహించలేను నాన్నా !"

శాంత కుర్రతనంగా మాట్లాడుతున్నదనీ, ఆమెకు చదువెక్కువై అనుభవం తక్కువయిందనీ అనుకున్నాడు తండ్రి.

"ఎంత పిచ్చిదానివే, అమ్మా ! నేనూ మీ అమ్మా అంత ఆదర్శదంపతులమని ఎందుకనుకున్నావు ? మేమూ అందరివంటి వాళ్ళమే "

"అందరూ తమ పెళ్లాలకోసం నువ్వు చేసినంత త్యాగం చేస్తారా ?"

"ఏమిటే పిచ్చిపిల్లా ? ఏమిటా త్యాగం ?" అన్నాడు శాస్త్రి నవ్వుతో.

"ఇంకేం కావాలి ? నువు అమ్మకోసం కులం వదిలావు. అయిన వాళ్ళని వదిలావు !"

"ఆ మాత్రం త్యాగం మీ అమ్మ చెయ్యలేదా ? మీ అమ్మ గడపలో అడుగు పెడితే కాళ్ళు విరగేస్తానని శపథం పట్టింది మీ అమ్మమ్మ, తెలుసా ? ఏడుగురు ప్రాణాలు మీ అమ్మమీద ఆశలన్నీ పెట్టుకున్న స్థితిలో అది నాతో వచ్చేసి అందరినోటా మట్టికొట్టింది."

"ఆవిడ నీమాదిరిగా కులమేమీ త్యాగం చెయ్యలేదుగా !"

"పిచ్చిదానా, నాకులం నాకెంత ఎక్కువో, మీ అమ్మ కులం మీ అమ్మకంత ఎక్కువ. డబ్బు లేకుండానన్నా బతకవచ్చుగాని కులంలేకుండా బతకలేం ! మీ అమ్మ నాకన్న చిన్నమెత్తుకూడా తక్కువత్యాగం చెయ్యలేదు !" అన్నాడు శాస్త్రి ఉద్రేకంతో.

"ఇంకేం ? మీరిద్దరూ ఆదర్శదంపతులు కారంటావెందుకూ ?"

"నీ విషయంలోనైనా అంతే అనుకోరాదూ ? నిన్ను పెళ్ళాడతానని వచ్చేవాడెవడో వాడు త్యాగం చెయ్యటానికి వస్తున్నట్టేగా ?"

"ఎంత పిచ్చివాడివి, నాన్నా ? ఈ రోజుల్లో కుర్రాళ్ళకి మీ తరం వాళ్ళ

మాదిరిగా కులం పట్టిందా ఏం? నన్ను పెళ్ళాడతానని వచ్చేవాడు నా డబ్బు కోసం రావటంలేదని నాకెట్లా రుజువవుతుందీ!"

"అందుకని అసలు పెళ్ళాడకుండా మానతావుటే!"

"అవును నాన్నా! ఒక ఆదర్శాన్ని ఆరాధించేవాళ్ళు ఏదో త్యాగం చేసితీరాలి. నా త్యాగం ఇదీ! నేను బ్రతికినన్నాళ్లూ పెళ్ళీ పెటాకులూ లేకుండా ఉండిపోతాను!"

"అది సులభ మనుకుంటున్నావు. సులభం కాదే, అమ్మా! ఒంటరిగా ఉండటం దాదాపు అసంభవం!"

"అంత అసంభవమని తోస్తే పోనీ అప్పుడే పెళ్ళాడేస్తానూ! ఇప్పుడు పెళ్లాడటం అసంభవమనేకదా మానేస్తానంటున్నది? చాతకాని పని చెయ్యాలని నా కెన్నడూలేదు.. అప్పుడైనా ఏంచేస్తానో తెలుసా? నాలో ఆశరేపెట్టె పెళ్లి మాత్రం చేసుకోను. ఎవరో నలభై దాటిన బట్టతల మనిషిని, నన్ను దయతో చూసేవాణ్ణిగాచూసి, పెళ్ళాడేస్తాను. సరేనా?" అన్నది శాంత. సగం హాస్య ధోరణిలోకి దిగి.

''ఎంత పిచ్చితల్లివే," అన్నాడు శాస్త్రి మారుమాటాడలేక.

* * *

తన తండ్రి గుండెవిషయం శాంత ఎక్కువగా భయపడక పోవటానికి రెండు కారణాలున్నై. శాస్త్రిగారు తన జబ్బు చాలవరకు కూతురి దగ్గర దాచిపెట్టాడు. డాక్టరు దగ్గిరికి పోయినట్టు తెలిసినా శాంత గాభరా పడుతుందేమోననే భయంతో ఆయన జబ్బు పెరగనిచ్చాడు. రెండోకారణం ఏమిటంటే శాంతకు తన తండ్రి పోతాడనే ఆలోచన రావటమే ఇష్టంలేదు. అందుచేత ఆయన జబ్బును గురించిన భయంకరమైన ఆలోచనలు ఆమెలో అప్రయత్నంగా అణగదొక్కబడినై. అందుచేత శాంత తన తండ్రితో ఒకనాడు "నువ్వు మరీ ఇంత అశ్రద్ధ చెయ్యటం బాగాలేదు నాన్నా, ఒకసారి డాక్టరు దగ్గిరికివెళ్లి పరీక్ష చేయించుకుని మందేదైనా తీసుకోరాదూ? ముందే జాగర్తపడటం మంచిదిగా!" అన్నది.

శాంతే ఆమాట అన్నదికనక శాస్త్రిగారు చప్పున డాక్టరు దగ్గిరికి వెళ్లాడు. ఇటీవల ఆయనకు గుండెదడ రోజురోజూ వస్తున్నది. నాలుగడుగులు గబగబా వేస్తే గుండెచేత్తో అదిమి పట్టుకోవలసి వస్తున్నది.

డాక్టరు శాస్త్రిగారిని పరీక్షించి, "జబ్బు చాలా ముదిరింది. ఇది ఎంత కాలం నించీ ఉంది?" అని అడిగాడు.




"నా చిన్నతనంనించీ ఉంది. మాఅమ్మగారు ఇటువంటి జబ్బుతోనే పోయింది నాకిది పుట్టుకతోనే వచ్చిందేమో అనుకుంటాను. చాలా పసితనంలోనే నాకు రక్తహీనత కలిగి బాధపడ్డాను అటుతరువాత ఇట్లా గుండెదడ వస్తూనే ఉంది అదపా దడపా."

"ఏమైనా వైద్యం చేశారా ఇదివరలో?"

"లేదు, నాకు ఆరోగ్యం గురించి చాలా నిర్లక్ష్యం."

"ఇంకానయం, ఇప్పటికన్నా జాగ్రత్త పడ్డారు. మీకు లేనిపోని ఆశలు ఇవ్వటం నాకిష్టంలేదుగాని మీ జబ్బు నయమయ్యే అవకాశం లేకపోలేదు-మీరూ నేనూ, భగవంతుడూ కలిసికట్టుగా పనిచేస్తే."

శాస్త్రిగారు తెల్లబోయినారు. తన స్థితి అంత ప్రమాదంగా ఉందని ఆరా నిజంగా విశ్వాసం లేదు. ఎటుపోయి ఎటువచ్చినా, కీడెంచి మేలెంచటం దని, తనజబ్బు తీవ్రంగా ఉన్నట్టు భావించుకుని శాంతవిషయం దిగులుపడ్డ గాని, అంత దిగులూ పడదగిన పరిస్థితేనని తెలుసుకోవటం శాస్త్రిగారికి భయం వేసింది. "ఎక్కువ భాగం మీ జాగ్రత్తమీదే ఆధారపడిఉంది. సంపూర్ణంగా విశ్రాంతి తీసుకోండి. ఎటువంటి కంగారూ పడవద్దు. ఉద్రేకం కలిగించే ఆలో చనలు రానీయవద్దు. మీకిష్టంలేనివాళ్లను దగ్గిరికి రానీయవద్దు తేలికగా భోంచెయ్యండి. కావలసినంత నిద్రపోండి. ఆపైన భగవంతుడే ఉన్నాడు" అని డాక్టరుగారు సలహాఇచ్చారు.

* * *

శాస్త్రిగారు డాక్టరు దగ్గిర ఉన్న సమయంలో "శాంతాదేవిగారున్నారా!" అంటూ ఇరవై రెండేళ్ళ వయసుగల కుర్రవాడొకడు, కళ్ళజోడు పెట్టుకుని శాస్త్రిగారింటికి వచ్చాడు.

చదువుతున్న పేపరు చేతపట్టుకుని ఆశ్చర్యంతో శాంత బయటికి వచ్చి ఈ కుర్రవాణ్ణిచూసి, "దయచేసి లోపలికి రండి," అని ఇంగ్లీషులో ఆహ్వానించింది. తనకోసం అపరిచితులు ఈవిధంగా రావటం ఆమెకు జ్ఞాపకంలేదు.

"నేను మన స్కూలు పూర్వ విద్యార్థిసంఘ కార్యదర్శిని. నాపేరు భాస్కర్రావు. మీరు 1934 లో స్కూలు వదిలిపెట్టారు. పూర్వవిద్యార్థి సంఘంలో మీ పేరుకూడా ఉంది. కిందటి సంవత్సరం మీరు చందా ఇచ్చినట్టుగాని, పూర్వ విద్యార్థి సమావేశానికి వచ్చినట్టుగానిలేదు. మీ తప్పయి ఉండదు. ఈసారి మీరు పూర్వవిద్యార్థిసంఘ సమావేశంలో పాల్గొనకపోతే ఆతప్పు నాదవుతుంది. కనక మీరు దయఉంచి మీ చందా ఇచ్చి 19వ తేదీన స్కూలు ఆవరణలో జరిగే సమావేశానికి తప్పక దయచెయ్యాలని నాప్రార్థన."

ఈ కుర్రవాణ్ణిచూస్తే శాంతకు ఏదో సంతోషమయింది. రెండేళ్ల క్రితం తను విడిచిపెట్టిన సంఘం తరపున తిరిగి తనను సంఘంలోకి ఆహ్వానించటానికి వచ్చిన దూతమాదిరిగా కనిపించాడు భాస్కర్రావు.

శాంత తన చందాడబ్బులు భాస్కర్రావు చేతిలో పెట్టి ''ఆరోజుకు రావటానికి వీలయితే తప్పక వస్తాను'' అన్నది.

"అట్లాకాదు, వీలు లేకపోయినా వీలుచేసుకు రావాలి ... క్షమించండి ఆ
వ రావటం కాదు. మీవల్ల ఇంకో చిన్నసహాయం కూడా అపేక్షించాను. ఈ
ర్వవిద్యార్థి సంఘ సమావేశం సందర్భంలో మనం కన్యాశుల్కంలోనించి
న్ని రంగాలు ప్రదర్శిస్తున్నాం. అందులో మీరు మధురవాణిపాత్ర ధరించాలని నా ప్రార్థన" అన్నాడు భాస్కర్రావు.

ఒక్కక్షణంపాటు శాంత భాస్కర్రావును అనుమానించింది. తనను అతను అవమానించటానికి ప్రయత్నిస్తున్నాడా-తను వేశ్యకు పుట్టిందని?

మరుక్షణమే శాంత అనుమానం రహితమయింది. తన తల్లిఎవరో అతనికి, పాపం, తెలీదేమో కూడానూ! తన కెందు కీవుచ్చకాయల దొంగబుద్ధి?

"క్షమించండి! నేనెప్పుడూ నలుగురి ఎదట లేచిమాట్లాడినదాన్నన్నా కాదు. వేషాలు వెయ్యటం మాట అటుంచి!" అన్నది శాంత నవ్వుతూ.



"ఏమీ ఫరవాలేదు. మన విశ్వం ఎంత కొత్తవాళ్ళనన్నా నిమిషంలో తరిఫీదు చేస్తాడు," అన్నాడు భాస్కరం.

"ఆయ నెవరు?"

"అన్నట్టు మీరు విశ్వాన్నెరగరు. వాడు 1930 లోనే స్కూలు చదువు పూర్తిచేశాడు. వాడిప్పుడు మన నాటకంలో గిరీశం వేస్తున్నాడు. వాడు కాలాంతకుడు లెండి. ఏదిపడితే అది చేస్తాడు. ఏమంటారు? మీరు నటించను కూడా వద్దు. మీరువచ్చి స్టేజిమీద నిలబడితే చాలు, చూచేవాళ్లు దిమ్మరపోతారని నేను రాసిస్తాను," అన్నాడు భాస్కరం ఉత్సాహంతో.

శాంత చెక్కులు కొద్దిగా ఎర్రబడినై. తన అందం గురించి తనతో పరాయి వాళ్లు అభినందన పూర్వకంగా మాట్లాడటం ఆమె కలవాటు లేదు. ఈభాస్కరం ఎవరోగాని, వచ్చి అయిదు నిమిషాలు కాలేదు. ఎన్నో కొత్త అనుభవాలు కలిగిస్తున్నాడు.

"అదీకాక రిహార్సల్సూ అవీ ఉంటయ్యేమో, నేను రోజూ ఇల్లు వదిలిరావటానికి లేదు. మా నాన్నగారికి ఒంటో సరిగా లేదు కూడాను!" అన్నది శాంత.

"అరెరే! ఏరీ మీనాన్నగారు? ఇంటో ఉన్నారా?"

"డాక్టరు దగ్గిరికి వెళ్ళారు."

"మీరు రిహార్సల్సు కోసం ఎంతో శ్రమ పడవద్దు. రోజుకొక గంటచాలు మీనాన్నగారి నడిగి ఎట్లాగైనా ఒప్పిస్తాను. మీరా మధురవాణి పాత్ర ధరించి తీరాలి. నాకోసమైనా! మీ మాత్రం మనిషిని ఆవేషం వెయ్యటానికి సంపాదించ లేకపోతే అపఖ్యాతిపాలై పోతాను."

"ఆమాట అని అంత పెద్దవేషంవేసి నేను మాత్రం అపఖ్యాతిపాలుకానా? పోనీ, ఇంకేదన్నా చిన్నపాత్ర ఇవ్వండి. వెంకమ్మవేషం వేస్తాను మీకభ్యంతరం లేకపోతే!" అన్నది శాంత. తప్పించుకు బయటపడేందుకు, భాస్కరం ఒక విధాన వదిలేటట్టు లేడు.

"ఛీఛీ! వెంకమ్మవేషం నేను వేసినా వెయ్యవచ్చు. పోనీ బుచ్చమ్మ వేషం వేయండి! అది చాలా బాగుంటుంది. పెద్ద రిహార్సల్సు అవసరంలేదు"

"ఆ పని చేస్తాను. అట్లాగే కానివ్వండి."

భాస్కర్రావు లేచాడు.

"మీ పోర్షన్ ఇవాళ సాయంకాలమే పంపుతాను. రిహార్సల్సు ప్రారంభించ గానే మీకు కబురు చేస్తాను. ఇంకా విశ్వంగాడు దిగలేదు. వస్తాడివాళో రేపో."

భాస్కరం బయటికి పోతూంటే వరండాలో శాస్త్రిగారు డాక్టరు దగ్గిర్నించి వస్తూ ఎదురుపడ్డాడు.

"తమరేనా శాస్త్రిగారు? మీ అమ్మాయిగారిని పూర్వవిద్యార్థి సంఘ సమావే శానికి ఆహ్వానించటానికి వచ్చాను. ఆవిడ మేమాడే నాటకంలో చిన్నవేషం వెయ్యటానికూడా ఒప్పుకున్నారు. తమ ఒంటో సుస్తీగా ఉందట. వీలుచేసు కుని రిహార్సల్సుకు మాత్రం రమ్మన్నాను. తమ అనుజ్ఞకూడా ఇవ్వండి. పందొమ్మిదో తారీకున తమరుకూడా మా ఫంక్షనుకు రావాలి తప్పకుండా!" అని గుక్కతిప్పుకోకుండా అనేశాడు భాస్కరం.

"అవశ్యం!" అన్నాడు శాస్త్రిగారు

నలుగురిలోనూ తిరగడానికి శాంత కీమాత్రం అవకాశం దొరికినందుకు శాస్త్రిగారికి సంతోషం కలిగింది. ఈ రెండు సంవత్సరాలూ ఇట్లాగే గడిపితే శాంత కీపాటికి డజనుమంది స్నేహితులు - అందులో అరడజనుమందయినా వివాహయోగ్యులు-ఉండేవాళ్లు కద!...ఈకుర్రవాడికి వివాహం అయిందేమో!...

"డాక్టరుగా రేమన్నారు, నాన్నా?" అన్నది శాంత.

"మందిస్తానన్నాడు. రెస్టు తీసుకోమన్నాడు. జబ్బు నయమవుతుందన్నాడు. అయితే ఈ కుర్రవాణ్ణి అదివర కెరుగుదువా?"

"ఎరగను నాన్నా!"

"బుద్ధిమంతు డల్లేనే ఉన్నాడు."

"మంచివాడే-పట్టుకుంటే వదలడన్నమాటే గాని, మంచినీళ్లు తాగినట్టుగా మాట్లాడేస్తాడు. కొత్తాపాతా లేదు. నన్ను చిన్నతనంనించీ ఎరిగినట్టు మాట్లాడాడు."

"ఏదో వేషం వేస్తానన్నావుట కాదూ?"

"అన్నాను. అప్పటి వీలునుబట్టి చూస్తాను."

"అదేమిటే, అమ్మా! వేషం తప్పకుండా వెయ్యి. వీలేమిటి?''

ఆరోజు సాయంకాలమే భాస్కరం శాంతకు ఆమె బుచ్చమ్మ పాత్రతాలూకు రంగాలు రెండూ రాసి తీసుకొచ్చాడు. రాత్రికి విశ్వం వస్తున్నాడనీ, రేపు ఉదయం ఎనిమిదింటికి తన ఇంట్లోనే రిహార్సు లుంటుందని చెప్పి తన ఇంటి గుర్తు చెప్పాడు.

పడుకోబొయ్యే టప్పుడు శాంత తన పోర్షను అయిదారుసార్లు చదువుకుంది. ఆరాత్రి యావత్తూ మధురవాణీ బుచ్చమ్మా పోట్లాడుకున్నట్టూ తనమీద రాళ్లు రువ్వినట్టూ కలలుకన్నది శాంత.

*　　　*　　　*

భాస్కరంగారింటో బృందమంతా తయారైంది. విశ్వనాథం ఒక్కొక్కరి పరిచయమే చేసుకుంటున్నాడు. భాస్కరం ఒక వరస మనుషులందర్నీ పరిచయం చేసింతరవాత, విశ్వనాథం పాత్రల విషయం కనుక్కుంటూ "అగ్నిహోత్రావధాన్లెవరు? నువ్వా నాయనా? అగ్నిహోత్రావ ధాన్లంటే నిప్పులుకక్కాలి. నువు జలసూత్రావధానల్లే ఉంటే లాభంలేదు. కరటకశాస్త్రి ఎవరు? రైట్! అట్లా ఉండాలి కరటక శాస్తుర్లంటే, మధురవాణి ఎక్కడ ? Where is my Madhuram?" అని పేలేస్తున్నాడు.

భాస్కరం, మధురవాణి వేషం వెయ్యటానికి సాహసించిన కుర్రవాణ్ని విశ్వానికి చూపించాడు. విశ్వం ఆ కుర్రవాణ్ణి సమీపించి, "నువ్వా మధురవాణి? డామిట్, కథ అడ్డంగా తిరిగింది." అన్నాడు.

భాస్కరం విశ్వాన్ని మందలిస్తూ అన్నాడు ''ఒరే జాగ్రత్తసుమా, శాంతా దేవిగారితోగాని ఇట్లా మాట్లాడావంటే నిన్ను చెప్పుతీసుకొట్టుతుంది!"

అప్పుడే లోపలికి అడుగుపెట్టిన శాంత తనకే ఆశ్చర్యం కలిగించే సాహసంతో "మెత్తని చెప్పులే వేసుకొచ్చాను లెండి!" అన్నది.

విశ్వం ప్రశ్నార్థకంగా భాస్కరంకేసి చూశాడు. భాస్కరం ఇద్దరికీ పరిచయంచేస్తూ, "ఈవిడే శాంతాదేవి, బుచ్చమ్మ వేషం వేస్తున్నది. మన ఓల్డ్ గరల్!" అన్నాడు.

విశ్వం ఆశ్చర్యంగా శాంతకేసి చూస్తూ "How beautiful! Quite unexpected!" అని మరుక్షణమే "ఆ చెప్పులు నిజంగా మెత్తనివేకదా!" అన్నాడు. అంతా ఒక్కసారి గొల్లుమని నవ్వారు.

మొత్తంమీద ఎవరూ సహజంగా లేరు అందర్నీ అదోవిధమైన ఉద్రేకం ఆవేశించింది. అసలే పూర్వవిద్యార్థి సమావేశపు అడావుడి. అందులో వేషాలువేసి నాటకం ఆడటం. దానికితోడు గుంపులో శాంతవంటి అందకత్తె అందరితోనూ స్వేచ్ఛగా మాట్లాడుతూ ఉండటం! ఎవరూ అసభ్యంగా ప్రవర్తించ నప్పటికీ ప్రతివాడూ కాస్తోకూస్తో నిషామీద ఉన్నట్టే ప్రవర్తించాడు.

ఈ నిషా ఏమాత్రమో శాంతకుకూడా ఎక్కింది. ఆమె ప్రకృతి ఏకాంతాన్ని కోరే ప్రకృతి కాదు. ఆమాట అని సంఘంలో ఉన్న మంచి చెడ్డలన్నిటినీ వేదాంతంతో స్వీకరించి ఆ సంఘంలోనే బతికిని నాలుగు రోజులూ గడుపుదామనే ప్రకృతికాదు. ఆమె కిటువంటి సంఘం కావాలి-ఏదో ఒకపని పెట్టుకుని, దాని కోసం నలుగురూ కలిసిపాటు బడుతూ, పనిపూర్తి అయేవరకూ ఏవిధమైన మన స్పర్థలూ లేకుండా, ఒకరినొకరు సంతోష పెట్టటానికి ప్రయత్నిస్తూ, చేస్తున్న పని పూర్తిగా మరవటంకాని, అనుక్షణం అదే స్మరించటంకాని చేయకుండా గడిపిన నాల్గురోజులు సర్దాగా గడిపే సంఘం!

ఈ పూర్వవిద్యార్థి సమావేశం మూలంగా శాంతలో ఎంత నూతన వికాసం కలిగిందీ శాస్త్రిగారు గమనించారు. ఆయన మనస్సుకూడా చాలా తేలికఇచ్చింది. పంథొమ్మిదో తారీకు దగ్గిరి కొచ్చింది. ఆనాడల్లా శాంత ఇంటో ఉండకపోవడం ఆధారం చేసుకుని ఒక్క చిన్నకార్యం చక్కబెడితే తనకు మరీ నిశ్చింతగా ఉంటుందని భావించి శాస్త్రిగారు తన తమ్ముడికి ఒక ఉత్తరం రాశారు.

శాస్త్రిగారు పురుషోత్తాన్నిచూసి చాలా ఏళ్లైంది. ఆయనకు ఉత్తరం రాసి ఇంకా ఎక్కువ కాలమయింది. నిజానికి శాస్త్రిగారికి పురుషోత్తంమీద భ్రాతృ భావం పోయికూడా చాలాకాలమయింది. శాస్త్రిగారు చేసుకున్న పెళ్ళినిగురించి పురుషోత్తం చాలా అసహ్యంగా ప్రవర్తించాడు. ప్రపంచమంతా కలిసి వెయ్యని

అల్లరి పురుషోత్తం ఒక్కడే చేశాడు. నిర్లిప్తులుగా ఉండిన వాళ్లనుకూడా రెచ్చగొట్టి అన్నగారిమీద దుష్ప్రచారం చేశాడు. లోకమంతా ఈ పెళ్లిని గురించి మరిచిపోయిన తరువాతకూడా పురుషోత్తం అన్నగారిని మరవలేదు. క్షమించలేదు. తన తమ్ముడి ప్రకృతిలో ఏమాత్రమో నైచ్యం ఉన్నందుకు శాస్త్రిగారు చాలా బాధపడ్డారు. తను చేసుకున్న పెళ్లిని ఆమోదించమని శాస్త్రిగారెప్పుడూ తమ్ముణ్ని అడగలేదు. అటువంటి విషయాల్లో ఎవరి నమ్మకాలు వారివి. కాని తను గౌరవించి పెళ్ళాడిన స్త్రీని పురుషోత్తం 'అది-ఇదీ' అనటమేకాక అనరాని మాటలు కూడా అన్నట్టు విని శాస్త్రిగారు చాలా నొచ్చుకున్నారు. అటు తరవాత పురుషోత్తం ఒకసారి అన్నగారి ఎదుటపడి అనదలిచిన మాటలు, కొంచమైనా నిగ్రహం లేకుండా, ఒక్కమాట మీరుపోకుండా, కొన్ని మాటలు ఒకటికి నాలుగుసార్లు మళ్ళీ మళ్ళీ అని తనదారిని తాను వెళ్ళిపోయినాడు. అంతే అటు పిమ్మట ఆ ఇద్ద రన్నదమ్ములకూ ఎటువంటి సంపర్కమూ లేకుండా పోయింది.

ఇది జరిగి పన్నెండేళ్ళ చిల్లర అయి ఉంటుంది. శాస్త్రిగారి కిప్పుడు తమ్ముడు జ్ఞాపకం వచ్చాడు. ఈనాడు శాస్త్రిగారి హృదయంలో తమ్ముడిమీద ఎటువంటి కార్పణ్యమూ లేదు. ఏదో ఉద్రేకం వచ్చి ఏమేమో అప్పుడన్నాడు. ఆ అన్నమాటలకు పురుషోత్తం ఎప్పుడో పశ్చాత్తాప పడి ఉంటాడని శాస్త్రిగారు నూడిచేసుకున్నారు. పుష్కరం క్రిందటి తన ప్రవర్తనను సరిఅయిన దృష్టితో విమర్శించుకో లేనంతటి మందమతా, పురుషోత్తం? కాదు. తనుచేసిన పని తప్పని ఇంకా పురుషోత్తం నమ్మినప్పటికీ, ఆ తప్పుచేసిన తన దౌర్బల్యాన్ని ఎప్పుడో క్షమించి ఉంటాడు! శాంతమీద పురుషోత్తానికి ఉండదగిన వాత్సల్యంలో ఒక పీసమయినా ఉండకపోదు! కాలకర్మ గతి సరిగా ఉండక తనకు విపత్తే సంభవిస్తే శాంతను దగ్గరకు తీయడానికి పురుషోత్తంకంటె అర్హుడెవడు?

తనకు పురుషోత్తంవల్ల పొందదగిన ఈ ఉపకారం అట్లా ఉండగా పురుషోత్తం కూడా తనవల్ల పొందదగిన ఉపకారం ఉంది. అతను ఆర్థికంగా, పాపం, చితికి పోయినాడు. బండెడు సంసారమూ, ఎక్కువమంది ఆడపిల్లలూనూ. ఇద్దరాడపిల్లల పెళ్లిళ్లు అప్పుడే చేసేశాడు; అప్పుడే కాపరం అధోగతికి వచ్చింది. ఇంకా ఇద్దరాడపిల్లలున్నారు. ఇల్లూవాకిలీ ఉన్నప్పటికీ అప్పుకూడా ఉన్నట్టుంది. అకారణంగా పోట్లాటలు పెట్టుకుని ఆ కాస్త ఉద్యోగం పోగొట్టుకుని ఆ పల్లెటూళ్లో పడుండి పొలాలు చూసుకుంటున్నాడు. ముష్టి ఆ ఆరెకరాల పొలంమీద జీవితం

ఎట్లా వెళ్లుతుంది? కుర్రవాడొకడున్నాడు. వాడి చదువు సంధ్యలకు డబ్బు కావాలి. వీటన్నిటికీ తను కనిపెట్టి ఉండవచ్చు పురుషోత్తాన్ని.

ఈ ఆలోచనతో శాస్త్రిగారు పురుషోత్తానికి ఉత్తరం రాశారు. పంధొమ్మిదవ తారీకు ఉదయం బండికి తప్పక వచ్చి తనను కలుసుకొని అర్జంటు విషయాలు కొన్ని మాట్లాడిపోవలసిందని; 'నాకు నీ దగ్గరకు వచ్చే యోగ్యతే ఉంటే నీ క్షేమ ఇచ్చి ఉండను' అని ఉత్తరం చివర ఒక ముక్కకూడా చేర్చారు శాస్త్రి గారు. ఆమాట పురుషోత్తానికి ఉపశాంతి కలిగిస్తుందనే ఆశతో. ఉత్తరం పోస్టులో వేసింతరువాత శాస్త్రిగారికి రకరకాల ఆలోచనలు పోయినై. ఆ ఉత్తరం రాయటం అనవసరమేమో? అకారణంగా పురుషోత్తాన్ని కెలకటం అవుతుందేమో? అన్నాళ్లూ తనకెవరు సహాయపడ్డారు భగవంతుకు తప్ప! తమ కష్టాలను ఎట్లా ఎదుర్కొన్నాడో. శాంత కూడా తన కష్టాలను అట్లా ఎదుర్కోలేదా? డాక్టరుగారు మందిస్తున్నప్పటి నుంచీ గుండెనొప్పి చాలా తగ్గి వస్తున్నది. క్రమంగా అదే నయమవుతుంది...అంతగా పురుషోత్తంవస్తే శాంత సంగతి ఏమీ ఎత్తకుండా ధనసహాయంచేసి పంపవచ్చును. దానికూడా పురుషోత్తం ఆగ్రహం తెచ్చుకొని, 'నన్నింత అర్జంటుగా పిలిపించింది ముష్టిపెట్టి అవమానించటానికా?' అంటాడేమో? అప్పుడు పురుషోత్తం తత్వం ఎట్లా ఉన్నట్టు కనిపిస్తే అట్లా ప్రవర్తించవచ్చునని నిర్ధారణ చేసుకున్నారు శాస్త్రిగారు చివరకు.

అయితే పద్దెనిమిదో తేదీరాత్రి శాస్త్రిగారికి గుండెదడ తీవ్రంగా వచ్చింది. పదిగంటలే అయింది. కాని, శాంత అప్పుడే గాఢనిద్రలో ఉంది పాపం. వారం రోజులనుంచీ రిహార్సల్సుతో మధనపడుతున్నది. రేపు విరామమే ఉండదు. అందుకని శాస్త్రిగారు కూతుర్ని లేపలేదు.

బాధ అంతకంతకూ జాస్తి అవుతున్నది. మూలగక తప్పలేదు. శాస్త్రిగారు మెల్లిగా వరండాలోకి వెళ్ళి మూలగసాగారు. ఒక నిమిషంపాటు ప్రాణంపోతున్నదనిపించింది. ఆ తరువాత క్రమంగా దానంతట అదే సర్దుకుంది బాధ. శాస్త్రిగారికి నిద్రపట్టేటప్పటికి పన్నెండు గంటలు కావచ్చింది

శాంత మర్నాడుదయనే లేచి స్నానమూ అదీచేసి, ఎనిమిదిన్నర కల్లా బయలుదేరింది. వెళ్ళేటప్పుడు తండ్రితో, భోజనానికి అక్కడికే రమ్మనీ హోటలుకు వెళ్ళి ఆ దిక్కుమాలిన తిండి తినవద్దనీ హెచ్చరించింది.

తొమ్మిదిగంటల బండితో పురుషోత్తం వస్తాడు అతడు వచ్చేసమయానికి

శాంత ఇంట్లో వుండకూడదనే ఆదుర్దాతో శాస్త్రిగారు కూతురు చెప్పినదానికల్లా సరేనని ఆమెను తొందరచేసి పంపేశాడు. కాని శాంత వెళ్ళినప్పటి నుంచీ శాస్త్రి గారికి పురుషోత్తం రాడేమోననే భయం జాస్తి అయింది. రాత్రి అడావుడి చూసిన తరవాత శాస్త్రిగారికి పురుషోత్తానికి ఉత్తరంరాయడం చాలా తెలివయిన పనే ననిపించింది.

ఒకవేళ గానీ పురుషోత్తం తన వుత్తరాన్ని తృణీకరించి ఉంటే కర్తవ్యం ఏమిటా అని ఆలోచిస్తూ శాస్త్రిగారు హాలులో పచారుచేస్తుండగా వరండామెట్లెక్కి పురుషోత్తం వచ్చాడు.

తమ్ముణ్ణి చూడగానే తనలో ఏదో భ్రాతృప్రేమ పొర్లుకొస్తుందని ఆశపడు తున్న శాస్త్రిగారికి ఆశాభంగమయింది. పురుషోత్తం ఎవరో పరాయి వాడల్లే కనిపించాడు. అతని మొహంచూస్తే శాస్త్రిగారికి అర్థంకాని నిస్పృహ ఏదో కలిగింది.

"ఆ ఉత్తరంలోనే ఆ విషయమేదో రాస్తే సరిపొయ్యేదిగా," అన్నాడు పురు షోత్తం వస్తూనే.

''కూర్చో! మాట్లాడాలిసింది చాలా ఉంది అందుకని రాయలేదు" అని అన్నాడు శాస్త్రిగారు

"ఇవాళే రమ్మన్నావు. మరి రెండులోజు లున్నతరువాత నయితే నాకు పని చెడకుండా ఉండేది సంగతేమిటో త్వరగాచెప్పు. నేనుమళ్ళీతిరుగు బండిలో వెళ్ళాలి. ఇంటిదగ్గర నా కోసం భోంచెయ్యకుండా కనిపెట్టుకొని ఉంటారు!"

'"అంత చెప్పుల్లో కాళ్లు పెట్టుకొస్తావని అనుకోలేదు, ఫరవాలేదు? ముఖ్యవిష యం మూడు మాటల్లో చెప్పేస్తాను. నాకు గుండెదడ వస్తున్నది. ఏ క్షణాన అది నన్ను ముంచేస్తుందో తెలీదు. నేను కాస్తా ఈ జబ్బువాతపడితే నా బిడ్డ దిక్కులేనిదవుతుంది. దాన్ని నీవు కాస్త కనిపెట్టి ఉండమని చెప్పటానికి పిలి చాను. అది బొత్తిగా నిరాధారంగా లేదు. దానిపేర కాస్తోకూస్తో ఆస్తి ఉంది. ఆ ఆస్తి చూస్తూ దాన్ని రెండు రోజులపాటు కనిపెట్టి ఉంటే ఆపైన అదిపెద్దదై నానిదారి అది చూసుకుంటుంది. నా తరవాత దానికి నీకన్న ఎవరున్నారు?" అని శాస్త్రిగారు ఆశగా తమ్ముడివంక చూశారు. పురుషోత్తం వెంటనే సమాధానం ఇవ్వక అటూ ఇటు పచారుచేశాడు. అన్న కోరినదానికి ఆమోదింతామని వెంటనే నిశ్చయించుకున్నాడు. కాని వెంటనే ఆ సంగతి బయట పెట్టదలచుకోలేదు. అన్నగారికి తను ఇవ్వదలచిన ఉపన్యాసమంతా ఇచ్చికాని తన అభిప్రాయం

బయటపెట్టకూడ దనుకున్నాడు. ఇంతకాలమూ ఆయన తన చేతికి ఇంతబాగా చిక్కలేదు. ఈ అవకాశం పోగొట్టుకుంటే ఎట్లా?

"నీ పిల్లకు అండగా ఉంచమని నన్నెందు కడుగుతావు? నీ మరదలు-అ అనసూయ నెందు కడగవు?" అన్నాడు పురుషోత్తం. అనసూయ శాంత పిన తల్లి. వాళ్ళ ఊళ్లో ఉండి వృత్తి చేసుకుంటున్నది.

"అనసూయ నడగ దలచుకుంటే నీకోసం ఎందుకు కబురు పంపతాను?" అన్నారు శాస్త్రిగారు కాస్త వేడెక్కి.

మళ్ళీ కాస్సేపు పచారుచేసి పురుషోత్తం. "నన్ను అకారణంగా పిలిచావని అనుకుంటూనే ఉన్నాను. ఈ పని చెయ్యటానికి నేను ఒప్పుకుంటానని ఎట్లా అనుకున్నావు?" అన్నాడు.

"ఒకప్పుడైతే ఒప్పుకోవని నే నెరుగుదును. ఈ లోపల కాస్తయినా మారి ఉంటావనుకొని పిలిపించాను" అన్నాడు శాస్త్రిగారు రోషంగా.

ఆ మాటతో పురుషోత్తం నిప్పులు తొక్కిన కోతి అయిపోయినాడు.

"నీ దృష్టిలో మారటమంటే పాపిష్టి పనులకు సుముఖం కావటమన్న మాట? అట్లా వెయ్యిజన్మలెత్తినా మారను. నలుగురూ ఆమోదించిన బాటని వెళ్ళటం నా ధర్మం. నేను దానికి భిన్నంగా వెళ్ళను. నీ పిల్లకు దిక్కుండదంటున్నావు. ఎందుకుండాలి? నువు చేసినదానికి ఏమనుభవించావు? భోగం ముండలను తెచ్చి పెళ్ళిచేసికొని పిల్లల్ని కన్నందుకు ప్రపంచంలో శిక్షేలేకపోతే, మేమంతా సంసారపక్షంగా పెళ్ళాలతో కాపరం చెయ్యవలసిన ఖర్మమేం? మంచి మంచి అందగత్తెల్ని తెచ్చుకుని వాళ్ళతో మేం మటుకు ఊరేగలేమూ?... భోగందానికి పుట్టినదాన్ని— సమర్తాడి పెళ్ళి పెటాకులూ లేనిదాన్ని - నీ కూతుర్ని నే నింట్లో అట్టే పెట్టుకునేందుకు వీలుంటే, నా కూతురెక్కడ సమర్తాడి పోతుందో అని దడుచుకు చచ్చి, సమర్తాడకముందే దానికి మూడుముళ్ళూ వేయించటానికి నేను నాయాస్తి యావత్తూ ధారపొయ్యవలసిన గతెందుకు పట్టింది? పైగా నేను మారా ననుకుంటున్నావా? చిన్నప్పుడు కళ్లు కనిపించక ఏంచేశావో చేశావు. ఇంత కాలానికూ్కడా నీకు ప్రపంచధోరణి అర్థంకాక పోగా, నువు మారనందుకు నన్ను తప్పుపడుతున్నావా? నీ కూతుర్ని నాయింటో పెట్టి పెంచమంటావే, సంఘం ఏమిటో నీకేం తెలిసిందని అడుగుతున్నాను. నాలుగు డబ్బులు సంపాదించగానే పరిసిపోయిందనుకున్నావు కాదూ? ఎంత

కలియుగమైనా, ధర్మానికి మూడుకాళ్లు దబ్బయినా నాలుగో కాలింకా పడిపో లేదు. రేపు నీ కూతురి కాసంగతి తెలిసివస్తుంది!"

శాస్త్రిగా రీకొరడా దెబ్బలు భరించలేకపోయినారు. ఆయన ముఖం ఎర్ర బడ్డది. శరీరమంతా కంపించింది. తనకు యాభైగజాల్లో నిలబడటానికి తగిన సంస్కారంలేని అప్రయోజకుడు, దిక్కుమాలిన సంఘాన్ని, వాటంతట అవి ఏర్పడ్డ సంప్రదాయాలనూ వెనకేసుకొచ్చి, తన అసహాయతస్థితిని బట్టి తన నింత అవమానించడం ఆయనకు దుర్భర మనిపించింది. ముందు నా ఇంటో నుంచి బయటికి పొమ్మందామనే ఉద్దేశంతో శాస్త్రిగారు కుర్చీలోనుంచి సగం లేచారు. కాని అంతలోనే ఆయన ముఖం నల్లగా మారింది. ఒక చెయ్యి గుండెకు అదిమిపట్టి అట్లాగే కుర్చీలో కూలబడిపోయినాడు. ఆయన ముఖం వాలిపోయి గడ్డం రొమ్ము నానుకుంది. ఆయన నోటివెంట నురుగు రాసా గింది.

పురుషోత్తం అన్నలో కలిగిన ఈ మార్పర్థం కాక ఎలాతెలాబొయ్యే మొహంతో ఒక క్షణంపాటు చూసి పూర్తిగా మారిపోయిన గొంతుతో "అన్నయా!'' అన్నాడు. సమాధానంలేదు. దగ్గిరికి వెళ్ళి శాస్త్రిగారిని భుజం పట్టి ఊపాడు. శాస్త్రిగారిలో చైతన్యం లేదు.

*　　*　　*　　*

అప్పుడే భోజనాలయినై. శాంత తండ్రికోసం ఎదురు చూసింది. ఆయన భోజనానికి రాలేదు. 'విషయ మేమిటో కనుక్కుంటాను, ఇంటికివెళ్ళి మళ్ళా వెంటనే వస్తా' నని ఆమె భాస్కరంతో అంటున్నది. ఇంతలోనే శాస్త్రి గారింటో పనిచేసే కుర్రవాడు పరిగెత్తుకొచ్చి, "అమ్మా! అమ్మా! నాయన మూర్ఛొచ్చి పడిపోయినారు, పలకటంలేదు!" అని ఆదుర్దాగా చెప్పాడు.

ఈ మాటలు విని శాంత కొయ్యబారినట్టు కనబడ్డది. ఆమెను గమనిస్తున్న భాస్కర్రావు విశ్వాన్ని పిలిచి శాంతను ఇంటికి తీసుకుపొమ్మని, తను వచ్చే వరకూ అవసరమైతే ఆమెవెంట ఉండమనీ చెప్పాడు.

శాంత ఇంటికి వచ్చేటప్పటికి ఇంటినిండా జనం చేరారు. డాక్టరు వచ్చి చూసి అంతా అయిపోయిందని చెప్పిపోయినాడు. ఈ నాటకంలో తనపాత్ర ఏమిటో మరిచిపోయి పురుషోత్తం హడావుడి చేస్తూ ఉత్తర క్రియల ఏర్పాటు చేస్తున్నాడు. ఆయన ఎవరో తెలియకుండానే శాంత ఆయనచేతికి ఇనప్పెట్టె తాళంచెవు లిచ్చే సింది.

కొంచెం దూరంగా నిలబడి విశ్వం శాంతను కనిపెట్టుతూనే ఉన్నాడు. ఆమె ఇంతవరకూ ఏడవలేదు. ఎవ్వరూ ఏడిచేవాళ్ళులేని ఆ వాతావరణంలో ఆమెకు ఏడవటం చేతకాలేదు.

శవాన్ని తంత్రాలు మంత్రాలు స్నానాలూ లేకుండానే శ్మశానానికి చేరవేశారు, పురుషోత్తంగారి దయవల్ల, శవం ఇల్లుదాటిన మరుక్షణం విశ్వం శాంతను రెక్క పట్టుకొని ఒక గదిలోకి తీసుకుపోయాడు. ఆమె అక్కడ మంచంమీద కూల బడి నిశ్చింతగా ఏడవసాగింది. విశ్వం గదని విడిచిపోకుండానే దూరంగా కిటికీ దగ్గిరికి వెళ్ళి బయటకు చూస్తూ నిలబడ్డాడు. కాలం ఎట్లా వెళ్ళిందీ అతనికి తెలియదు అకస్మాత్తుగా గడియారం చూసుకుంటే నాలుగు గంటలయింది.

శాంత ఇప్పుడేడవటంలేదు. గోడకు చేరగిలబడి ఆ మంచం మీదే కూర్చుంది. నిస్పృహ మూర్తీభవించినట్టుగా. ఆమె కింకా తను చెయ్యగల సహాయం ఏమన్నా ఉందేమో తెలుసుకుందామని ఉంది విశ్వానికి. కాని ఏమని అడగాలో తెలియలేదు. అతను ఆమెకు సమీపంలో కుర్చీ ఈడ్చుకుని కూర్చుని, "త్వర లోనే భాస్కరంకూడా వస్తాడు. మా ఇద్దరివల్లా మీకు కావలసిన సహాయం ఏదన్నా ఉంటే - " అని ఆగాడు.

"నా కింకెవ్వ రున్నారు, మీ యిద్దరూతప్ప? నిజంగానే ఎవరూలేరు. నేను దిక్కుమాలిన పక్షి అయిపోయినాను!" మళ్ళీ శాంతకు ఉప్పెనగా ఏడుపొచ్చే సింది. ఆమెను ఒక పావుగంట ఏడవనిచ్చాడు విశ్వం.

ఇంతలో పురుషోత్తం ఆదరాబాదరా లోపలికి వచ్చి శాంతకేసీ, విశ్వం కేసీ కాస్సేపు చూశాడు.

"నేనా? నేను శాస్త్రి తమ్ముణ్ణిలే. నువ్వీపిల్ల స్నేహితుడివా?" అన్నాడు పురుషోత్తం.

"అంత పెద్దపేరు పెట్టుకునే యోగ్యతలేదు నా కింకా! ఒక్కసారి ఇట్లా రండి, మీతో మాట్లాడాలి!" అన్నాడు విశ్వం పురుషోత్తాన్ని.

అవతలికి వెళ్ళి విశ్వం శాంతగతి ఏమిటని అడిగాడు.

"అదంతా ఏర్పాటుచేశానే! ఈ ఇల్లు అద్దెకిచ్చేస్తాను పిల్ల మా ఇంటికే వచ్చేసి మా ఇంటో ఉంటుంది. ఏమీ ఫరవాలేదు. నీ కింకేమైనా మంచి ఆలోచన తట్టిందా?" అన్నాడు పురుషోత్తం, విశ్వానికి శాంతతో ఎంత గాఢమైన సంబం ధం ఉందోనని భయపడుతూ.



''లేదు, లేదు! అదే బాగుంటుందని తోస్తున్నది. అయితే మీ రెప్పుడొచ్చా రేమిటి?" అన్నాడు విశ్వం.

"నేను తొమ్మిదింటికే వచ్చా! మావాడు నన్ను రమ్మని పిలిచాడు. ఉత్తరం రాశాడు. ఏదో సంసారవిషయాలు మాట్లాడుతున్నాం. ఇంతలోనే జబ్బుచేసి విరుచుకు పడిపోయినాడు. పట్టి పాపిష్టిజబ్బు కదా! మాట్లాడుతూండగానే కమ్ముకొస్తుంది.''

శాంతయొక్క భావి నిర్ణయం కాగానే విశ్వానికి సగంభారం తీరినట్టయింది. అతను మళ్ళీ శాంత దగ్గిరికివచ్చి, "మీ పినతండ్రిగారు మిమ్మల్ని వాళ్ళఊరు తీసుకుపోతా మంటున్నారు. అట్లాచేస్తే చాలా బాగుంటుందనుకుంటాను!" అన్నాడు.

"అవును!" అన్నది శాంత నిర్లిప్తంగా.

''నే నొక్కటి చెప్పదలచుకున్నాను, మీ కభ్యంతరం లేకుండాఉంటే!''

శాంత అతనికేసి చూసింది.

"మీరు నన్ను మీ స్నేహితుడుగా భావిస్తే నేను చాలా సంతోషిస్తాను. నేను సామాన్యంగా ఎవరినీ మెప్పించలేను. నన్నెవరూ మెప్పించలేరు. నాకు భాస్కరం ఒక్కడే స్నేహితుడు ప్రపంచంలో. నాలుగురోజులే పరిచయం అయినప్పటికీ నాకు మీ స్నేహంమీద గురి ఏర్పడ్డది. నాకేమీ ఒరిగించమని చెప్పను; కాని నావల్ల ఎప్పుడే సహాయం మీకు కావలసినా మొహమాటపడకుండా

తీసుకోండి. నాకు సంతోషంగా ఉంటుంది. నేను బతికి ఉండగా మాత్రం మీరు 'నాకెవరూలేరు' అని అనుకోవద్దు, నాకదే కావలసింది. ఈ మాట అనటానికి నాకింతకంటే అవకాశం దొరకదు. అందుకని మీ రింతకష్టంలో ఉన్నా ఇప్పుడే అనేస్తున్నాను."

శాంత వినపడీ వినపడకుండా "థాంక్స్" అన్నది.

భాస్కరం వచ్చేటప్పటికి ఆరుగంటలయింది.

"నాకక్కడే తెలిసింది" అన్నాడు భాస్కరం విశ్వంతో. "సాధ్యమైనంత త్వరగా కర్మకాండ యావత్తూ ముగించి వచ్చేశాను. అంతా ఎవరిళ్ళకు వారు వెళ్ళారు......ఏమిటి ప్రారబ్ధం? ఏదీ శాంత?''

"వాళ్ళ పినతండ్రి ఏదో మాట్లాడుతున్నాడు."

"వచ్చాడా ఏమిటి?"

"ఆ! ఆయనగారు రావటమేమిటి. ఈయన చావటమేమిటి. అంతా ఒక్కసారే జరిగింది!" అన్నాడు విశ్వం.

శాంత భాస్కరానికి దొరికేటప్పటికి మరో అరగంట పట్టింది. "ఎంత దురదృష్టవంతురాలివి!" అన్నాడు భాస్కరం శాంతను, ఓదార్పుగా.

"ఏదో చక్రం మీదిగా పోతున్నది" అన్నది, శాంత.

"మీ పినతండ్రిగారు నిన్ను వాళ్ళ ఊరు తీసుకుపోతున్నారని విశ్వం చెబుతున్నాడు. అంతకన్న చెయ్యదగిందేమీ లేదా అని ఆలోచిస్తున్నాను."

"ఏముందీ చెయ్యటానికి?" అన్నది శాంత.

"ఏమీ కనిపించటంలేదు. అందుకే చిరాకేస్తున్నది; మనం ఏదో చదువుకున్నాం. ఆధునికత్వం సంపాదించా మనుకుంటున్నాం. తీరా పరీక్షకు పెట్టేటప్పటికి మన చదువూ, ఆధునికత్వమూ ఎందుకూ పనికిరావు!"

శాంతకు పినతండ్రి దగ్గిరికి వెళ్ళటం ఇష్టం ఉండదని భాస్కరం ఊహించుకున్నాడు. శాంత తండ్రి బ్రాహ్మడని మాత్రమే అతని కర్థమయింది. ఆమె తల్లి సంగతి అతనికి తెలియదు. తెలిసే అవకాశంకూడా లేదు. 'బ్రాహ్మణపిల్ల అయి ఉండికూడా ఆమె అవివాహితగా ఉండటమే అది ఆధునికత్వమై ఉండాలి. అటువంటి శాంత, ఎక్కడో పల్లెటూరులో మరొకరి పంచన ఉండి ఏమి జీవిస్తుంది?' ఆ విధంగా ఆలోచించాడు భాస్కరం.

ఆ రాత్రి పడుకున్నప్పుడుకూడా భాస్కరాని కదే ఆలోచన.

"ఏంరా, విశ్వం? శాంత సంగతి ఏమవుతుందంటావు?"

ఏమీ పర్వాలేదు. ఎవడో ఒకడు దేవుడంటివాడు వచ్చి ఆమెను పెళ్ళాడేస్తాడు."

"నీకు తెలీదు. అటువంటి ఆడవాళ్ళకు వట్టి వెధవలు దొరుకుతారు."

"నీ కాభయం అక్కర్లేదు. ఆమె దగ్గిరికిపోయి, 'నన్ను పెళ్ళాడు' అని అడగటానికి ఏ వెధవకు ధైర్యం ఉంటుంది?"

"పోనీ, ఒరే! నువ్వింకా బ్రహ్మచారివేగదా, శాంతని పెళ్ళాడెయ్యరాదూ? ఇక్కడే ఉండిపోతుందీ!"

"నేనా? నా కసలే దిగులుగా ఉంది, నన్ను నవ్వించకు!"

"ఏంరా? నీకేం?"

"నేనొకవేళ ఆమెను పెళ్ళాడటానికి తగినవాణ్ణి అనుకున్నా ఆమెను తీసికెళ్ళి మా అమ్మకూ, మా నాన్నకూ ఎట్లా పెళ్ళిచెయ్యను? వాళ్ళను చూపించి అత్తగారూ, మామగారూ అంటే శాంత మూర్ఛపోదూ? అయినా నాకు డబ్బేదీ?"

"నీ డబ్బెవడికాక్కావాల్రా? శాంతకు డబ్బుంది. కావలిస్తే నువు కూడా పడి తిను."

"మన జన్మ కంతకంటె మంచిగీత ఉన్నట్టు లేదులే! అయినా నన్నెందుకు చంపుతావు? దేశంనిండా నాకన్న అందమైనవాళ్ళూ, తెలివిగలవాళ్ళూ, డబ్బున్నవాళ్ళూ, ఉన్నారు. ఎవరినో ఒకర్ని తెచ్చి శాంతకు పెళ్ళిచెయ్యి. నీ కిహమూ పరమూ ఉంటుంది!" అన్నాడు విశ్వం.

"శాంత పెద్దపిల్ల అనిగాని నీ కభ్యంతరం లేదుకదా?"

"నీకు నిజంగా మతిపోయింది! నాకేమో నిద్దరొస్తున్నది. నన్నిక పలకరించకు?" అని అటుతిరిగి పడుకున్నాడు విశ్వం.

అతనికి నిద్ర ఆమడదూరంలో ఎక్కడాలేదు. అతని ప్రాణంమట్టుకు శాంత దగ్గిరే తారట్లాడుతున్నది. తెలిసో, తెలియకో భాస్కరం నిజం చెప్పాడు. శాంతకు తనవంటి భర్త దొరకడు. తను ఆమెను ఆరాధించినట్టు ప్రపంచంలో ఇంకెవ్వడూ ఆరాధించలేడు. అది అసంభవం. అసలు తన ఆత్మ ఆమె ఆత్మను సమీపించినట్టు మరొకరి ఆత్మ సమీపించదు. ఆ విషయం విశ్వానికి నమ్మకంగా తెలుసును. కాని ఏమిటి చెయ్యటం ? 'నిన్ను ప్రాణంకన్న ఎక్కువగా చూసుకుంటాను. అందుకని నన్ను పెళ్లాడు !' అనటం ఎట్లా ? పైగా ఈ తరుణంలోనా ? అసంభవం. ఎప్పుడో అతను ఆ మాట అనే రోజు వస్తుంది. ఈ

లోపుగా శాంత ఎక్కడికీ పోదు. తన దగ్గిర్నుంచి ఆమెను ఎవడూ తీసుకో లేడు. అసంభవం!

* * * *

తండ్రిపోయిన మూడోనాటి సాయంకాలం శాంత పినతండ్రివెంట బయలు దేరింది. ఈ లోపుగా భాస్కరమూ, విశ్వమూ ఆమెకు అంపకాలు చెప్పారు; ఆమె చిరునామా తీసుకున్నారు. విశ్వం తన చిరునామా శాంత కిచ్చాడు.

మర్నాడే విశ్వంకూడా భాస్కరం దగ్గిర శలవు పుచ్చుకొని ఇంటికి వెళ్ళిపోయినాడు.

విశ్వం ఇంటో అడుగుపెట్టటమే ఆలస్యంగా వాళ్ళమ్మ, "అయ్యో, ఇన్నాళ్లెక్కడికి పోయినావురా? ఫలానిచోటికని చెప్పకుండా, ఫలానప్పు డొస్తానని చెప్పకుండా పోతివి! చదువుసంధె లయిపోయినా కూడా ఇంత ఇల్లు పట్టకుండా తిరిగితే ఎట్లారా?" అని సాధించింది.

"ఇప్పుడేం వచ్చింది? సంగతేమిటో బయటపెట్టు!" అన్నాడు విశ్వం.

ఇట్లా సాధింపు మొదలుపెట్టినప్పుడల్లా ఆవిడకు తనచేత చేయించవలసిన పని ఉందని విశ్వం నమ్మకం. ఈ నమ్మకం సామాన్యంగా నిజమవుతూ ఉంటుంది. "ఏంలేదులే. నిన్న ఆ చింతపల్లివారొచ్చి వెళ్లారు. ఆడవాళ్లు కూడా వచ్చారు నిన్ను చూచిపోదామని. నెలనుంచి ఆ పెద్దమనిషి నీ చుట్టూ తిరుగుతుంటే నువ్వింతవరకూ వెళ్ళి పిల్లనుచూసి రాకపోతివి. బాగుందా?"

"బాగుందే! నేను వెయ్యిపన్లవాణ్ణి. నాకు పీలుపడ్డప్పుడు వెళ్ళి చూసివస్తాను. నన్నట్లా తరిమితే ఎట్లా? నువు వాళ్ళతరపు మనిషివా, నా తరపు మనిషివా? ముందది చెప్పు."

"వాళ్ళు నీ మొహానికి నాలుగువేలు కట్నం పోస్తామంటున్నప్పుడు మనకు మాత్రం ఆదుర్దా ఉండక్కర్లా?"

"అన్నట్టు, ముందాసంగతేమిటో తేల్చండి! నా మొహానికి వాళ్ళంత కట్నం పోస్తామని ఎందుకంటున్నారూ?"

"అదంతా మన కెందుకు? మన మడిగామా, పెట్టామా? వాళ్ళంతట వాళ్ళిస్తుంటే తీసుకోవటానికి చేదా?"

"డబ్బిస్తే తీసుకోవటమేనా? అక్కడేం లొట్టలున్నయ్యో చూడక్కర్లా

"ఆ! లొట్టలేమిటి? పిల్ల పెద్దమనిషి అయిందని గిట్టని వాళ్లెవరో పు...
వేశారు. పిల్లలకు పదమూడో ఏడుకూడా వచ్చింది కనక, కాస్త కాలు బారు




పిల్ల కనక నమ్మటానికి వీలుండి, ఎవరూ ఎక్కిరావటంలేదు. అందుకని కాస్త కట్నం ఎక్కువ ఇచ్చయినా పిల్లను ఒకయ్య చేతిలో పెడదామని చూస్తున్నారు. ఎవరి ఆదుర్దా వాళ్ళదీ !"

"పిల్ల పెద్దమనిషి అయిందేమోనని మనం మటుకు ఆదుర్దా పడొద్దూ ?''

"బాగానే ఉంది, మనంపోయి పరీక్షిస్తామా ఏమిటి ? వాళ్ళనడిగితే పిల్ల పెద్దది కాలేదన్నారు. వాళ్ళబద్ధం ఆడితే వాళ్ళ పాపాన వాళ్ళే పోతారు. దానికి మనం ఏంచేస్తాం ?"

"నువు భలేదానివమ్మా ! 'నేను బ్రాహ్మణ పిల్లను' అని ప్రమాణంచేస్తే బోగం పిల్లను కూడా అంటకట్టే టట్టున్నావు నాకు – తగినంత కట్నమే రావాలిగాని !"

అక్కడికి పెళ్ళివిషయమైన ప్రస్తావన ఆగిపోయింది. విశ్వంతల్లి కోపంతో భర్తతో, "ఈసారి ఆ చింతపల్లాయనవస్తే మన ఆశ వదులుకోమనండి !" అన్నది. విశ్వంతండ్రి ఇంటో అనామకుడు. ఆయన ఏమీ మాట్లాడలేదు.

*　　　*　　　*　　　*

పినతండ్రిదగ్గిరికి వెళ్ళిన రెండుమూడురోజులకు శాంత ఒక ఉత్తరం రాసింది విశ్వానికి. అందులో ఆమె తన పినతండ్రిగారి ఇల్లూ ఇంటో మనుష్యులూ,

ఊరూ మొదలైనవన్నీ వర్ణించింది. "ఈ ఊరూ, ఇక్కడి జీవితమూ, ఇంత ప్రశాంతంగా ఉన్నప్పటికీ, ఇదంతా చూస్తున్నకొద్దీ నా ఆరాటం జాస్తి అవుతున్నది. ఏ రైలో, విమానమో ఎక్కి అవి వేగంగా పరుగెత్తుతుంటే మనస్సుకు కలిగే శాంతి కావాలి నాకు. ఇక్కడ అది లేనేలేదు. మీ రెట్లా ఉన్నారు ? ఈ మూడు నాలుగురోజుల్లో నేనెంతదూరమై పోయాను? తప్పక జవాబు రాయండి." అని శాంత ఉత్తరం పూర్తిచేసింది.

విశ్వం పన్నెండుపేజీల ప్రత్యుత్తరం రాశాడు. అందులో తన విషయం మాత్రం ఏమీ రాసుకోలేదు.

మరో మూడురోజులకు భాస్కర్రావు విశ్వానికి ఒక తంతి ఇచ్చాడు, వెంటనే బయలుదేరి రమ్మని. విశ్వం ప్రయాణం కావటం చూసి అతని తల్లి "మళ్ళీ ఎక్కడికిరా, నాయనా ?" అన్నది.

"భాస్కరం దగ్గిరికి."

"మళ్ళీ ఎప్పుడొస్తావు ?"

"ఏమో ! నా కేమన్నా ఉత్తరాలువస్తే జాగర్తగా ఉంచండి."

"మనకు భలే ఉద్యోగం దొరికిందిరా విశ్వం" అన్నాడు భాస్కరం "బెజవాడలో మా మామయ్యకొక నాటక కంపెనీ ఉంది. ఒకప్పుడు ఆ కంపెనీవల్ల లాభాలు వచ్చినైగాని, ఈమధ్య చాలా నష్టం వస్తున్నది. చాతయితే వచ్చి నడపమనీ, లేకపోతే కంపెనీ ఎత్తేస్తాననీ నాకు రాశాడు. ఏమిటి ? మనమిద్దరమూ పోయి కంపెనీ నడుపుదామా ?"

"మహారాజుగా ! ఎప్పుడు పోదాం ?"

"ఎప్పుడోనా ? వెంటనే !"

"ఐతే ముందు శాంతకు ఒక ఉత్తరంరాసి పారేద్దాం !" అన్నాడు విశ్వం.

ఇద్దరూ కలిసి ఉత్తరం రాశారు; ఇట్లా బెజవాడ పోతున్నామనీ, తమ దగ్గిర్నించి మరో ఉత్తరం వచ్చేదాకా జవాబు రాయవద్దనీను. ఈ ఉత్తరం శాంతకు చేరలేదు. ఈ సమయాన పినతండ్రిగారి ఊరు వదిలిపెట్టింది.

విశ్వానికి ఉత్తరం రాసేటప్పటికే శాంతకు పినతండ్రిగారింటి పరిస్థితులమీద రోత పుట్టింది. కాని ఆమె ఆ విషయం ఏమీ విశ్వానికి రాయలేదు.

పురుషోత్తంగారు శాంతకు ఒక గది ఇచ్చారు. ఆ గదినించి తను కదలకూడదనీ, ఇల్లంతా తిరగరాదనీ, శాంత అర్థం చేసుకుంది. ఇదిచూసి మొదట ఆమెకు కోపం వచ్చింది. కాని తరవాత ఆ కోపాన్ని అణుచుకుని ఆమె విశాల

బుద్ధి తెచ్చిపెట్టుకుంది. పురుషోత్తంగారికి తనమీద అభిమానం ఉండొచ్చుగాని ఆయన భార్య కేముంటుంది ? ఆవిడ తనని కులంచెడ్డ మనిషికింద చూడటంలో వింత ఏమిటి ? ఈ దిక్కుమాలిన పల్లెటూళ్లో విశాలభావా లుంటాయా ? ఈ విధంగా సరిపెట్టుకున్నది శాంత.

ఆ రాత్రి బాగానే గడిచిపోయింది. మర్నాడుదయం ఒక అయిదేళ్ళ కుర్రాడూ, ఏడెనిమిదేళ్ళ పిల్లా, శాంత గదిలోకివచ్చి ఆమెకేసి వింతగాచూస్తూ నుంచున్నారు. శాంత ఇద్దర్నీ దగ్గిరికి తియ్యటానికి ప్రయత్నించింది. కుర్రాడు వచ్చాడు, పిల్ల మాత్రం "నన్ను ముట్టుకోకు !" అన్నది. ఆ పిల్లనుచూస్తే శాంతకు అసహ్యం వేసింది. పిల్లవాడు మాత్రం ముచ్చటగా దగ్గిరకొచ్చి "నువు మా అక్కయ్యవా?" అన్నాడు.

"అవును నాన్నా ! నీ పేరేమిటి ?"

"బాబు !"

ఇదంతా చూస్తున్న పిల్ల అకస్మాత్తుగా, "అమ్మతో చెబుతానుండు" అన్నది బయటికిపోతూ.

బాబు భయపడ్డాడు. బిక్కమొహంవేసి, "అమ్మకొత్తుద్ది" అన్నాడు.

"కొట్టదమ్మా ! భయంలేదు !"

"కొత్తుద్ది" అంటూ బాబు శాంతనించి విడిపించుకుని బయటికి వెళ్లాడు.

కాస్సేపటికి కుర్రాడి ఏడుపూ, దెబ్బలూ వినిపించినై. కొర్రుకాల్చి వాత పెట్టినంత బాధ కలిగింది శాంతకు. ఆమె గబగబా లోపలికివెళ్ళి, "వాణ్ణి కొట్టకండి, నేనే దగ్గరకు తీశాను" అన్నది.

"నిన్ను కొట్టేందుకు నాకధికారం లేదుగా, అమ్మా! ఈమాట చెప్పటానికి నువ్వింటోకికూడా రావాలా? దగ్ధమయినట్టే ఉంది ఆచారం!"

"పిల్లలకు వాళ్ళకేం తెలుస్తుందండీ? నన్నుకొట్టలేకపోతే మాట అనగలరుగా, ఆ పని చెయ్యరాదూ?" అన్నది శాంత రోషంతో.

"నువ్వు వెళ్ళుదూ, తల్లీ! నా పిల్లల్ని నేను కొట్టుకుంటానో తిట్టుకుంటానో, నా గొడవ నాదీ! ఆ గది తలుపులు గడియవేసుకుంటే చిక్కులేకపోనుగా! పిల్లలకు తెలుస్తుందా ఏమిటి మరి, పై చూపులకు అంతా ఒకటిగానే ఉన్నప్పుడు! ఈ విషయం జరిగిన రోజున శాంత విశ్వానికి ఉత్తరం రాసింది. ఆ ఉత్తరం రాయటంవల్ల కొంత మనశ్శాంతి కలిగింది.

మధ్యాన్నం పన్నెండు దాటినప్పుడు భోజనం పెట్టారు. ఈ లోపుగా శాంత

ఆకలితో మెలికలు తిరిగిపోయింది. ఆ భోజనమైనా అందరి భోజనాలూ అయిన తరువాత కమతగాడిచేత పెట్టించారు. తను భోంచేసిన విస్తరి తనే ఎత్తుకోవలసి వచ్చింది. విస్తరి ఎత్తేసమయంలో పురుషోత్తం కూతురు వచ్చి దగ్గిరనుంచుని 'ఆ మెతుకెత్తు, ఈ మెతుకెత్తు' అని శాంత ఎత్తబోతున్న మెతుకులే చూపించ సాగింది!

శాంతకు చెప్పరాని పౌరుషంవచ్చింది. తనలో అంత దురహంకారం ఉందని ఆమె కలలోకూడా అనుకోలేదు. మనందరిలోనూ అన్ని దుర్గుణాలూ ఉంటవనీ, అందులో ఒక్కొక్కటి పైకి తెచ్చిపెట్టే నేర్పు ఒక్కొక్కరిలో చాలా అధికంగా ఉంటుందనీ, పాపం, శాంత ఎరగదు. ఆమె చిన్నతనంనుంచీ మనిషిలో మంచి తనమే చూస్తూ వచ్చింది.

'వీళ్ళిట్లా చూడటం ధర్మమయితే, ఈ ధర్మంలో న్యాయం లేదు. నేను వీళ్ళ కంటె ఏ విధంగా తక్కువ? వీళ్ళకంటె ఎక్కువే చదివాను. వీళ్లు తమ చదువును వినియోగించుకున్న దానికంటె నేను నా చదువును లక్షరెట్లెక్కువ వినియోగించుకున్నాను. సంఘానికి ఎవరెక్కువ ఉపకరిస్తారనే పోటీ పెడితే నాతో వీళ్లెవరూ శతాంశానికి రారు. అటువంటి పోటీపరీక్ష అయినా లేని సంఘం ఏంసంఘ మిది? చచ్చుసంఘం!' అనే భావాలు ఆమెను వేధించసాగినై. అటువంటి అహంకారం ఆమెలో తల ఎత్తటం అదే కొత్తకావటంచేత, ఆ భావా లామెకు ఉపశాంతి నివ్వకపోగా మరింత ఆధ్యాత్మికమైన బాధకలిగించినై. 'ఇటువంటి ఆలోచనలు రాదగినంత పరిస్థితి ఎందుకు కలగాలి!' అనుకున్నది శాంత.

ఈ లెక్కప్రకారం తనకు మోక్ష మెప్పుడు? ఇప్పటికింకా పదహారు గంటలు సరిగా గడవలేదే, ఈవిధంగా ఎన్నాళ్లు గడపగలుగుతుంది తను? కొంతకాలానికి ఏదన్నా జరిగేటట్టయితే పోనీ సహించవచ్చు! జరగబొయ్యేదాని కోసం ఎదురుచూడవచ్చు! ఇక్కడ ఎదురుచూసేటందు కేముంది?

అదివరకెన్నడూ లేంది, శాంత కిప్పుడు అన్నిటికన్నా కోరదగినది ఒక ఇల్లూ, పిల్లలూ, భర్తా అనిపించింది. ఇంతకాలమూ తండ్రికి సేవచేసిన చేతులు ఇప్పుడు చిన్నబోయినై. అదివరకల్లా తండ్రిని ప్రేమతో పొదివిన అంతరాత్మ ప్రేమించటానికి తహతహ లాడసాగింది. ఉదయం బాబు తన దగ్గరికి వచ్చి నప్పుడు తన మనస్సెంత పరవశమయిందీ శాంతకిప్పుడు తెలిసివచ్చింది. బాబునించి ఆమె ఆలోచన నేరుగా విశ్వం దగ్గరికి వెళ్ళింది. ఆ రోజున తండ్రి

పోయిననాడు-విశ్వం తనను అనునయించటానికి అట్లాగే దగ్గిరికి వచ్చాడు... తనను మొదట చూసినప్పుడు అంత రౌడీగా ప్రవర్తించిన విశ్వం! అతనన్న మాటలు ఒక్కటికూడా జ్ఞాపకం లేదుగాని అతని గొంతింకా ఆమె చెవుల్లో మారుమ్రోగుతూనే ఉంది. మాటల సారాంశంకూడా ఆమె మనస్సులో గాఢంగా నాటుకుపోయింది.

శాంత నిట్టూర్చింది. విశ్వం తనను ఈ పాటికి సగం మరచి ఉండవచ్చును. తీరా తనకు పనిబడితే అతను సహాయం చేయలేని స్థితిలో ఉండవచ్చును. ఈ దిక్కుమాలిన సాంఘిక వాతావరణంలో ఉన్న మనిషి వాగ్దానం అర తోలీ విలువ చెయ్యదు. అయినప్పటికీ అత నామాట అనటం ఎంతో బాగుంది. నిజంగా అందరూ అట్లా అనగలరా? విశ్వం మంచివాడు-ఆత్మ కలవాడు!

అతనికి రాసిన ఉత్తరం పోస్టు చేయాలి. ఈ పరమ పల్లెటూళ్లో పోస్టాఫీసొకటుంది. ఎక్కడో! కొంచెం పొద్దువాలగానే ఏకంగా బయటికిపోయి, ఉత్తరం పోస్టులోవేసి అట్లా షికారు పోదామని నిశ్చయించింది శాంత.

ఆమె వీధిలోకి వస్తే అంతా వింతగా చూసేవాళ్లే! వాళ్ళచూపులు ఆమెకు చిరాకు కలిగించినై. అజ్ఞాతంగా ఉండదలచిన వాళ్ళెవరూ పల్లెటూళ్ళకు పోరాదని ఆమె తెలుసుకుంది.

అది పోస్టాఫీసని గుర్తించటానికి ఒక ఎర్రడబ్బా తప్ప ఇంకేమీలేదు. లోపలికివెళ్ళి ఒక కవరుకొని ఎడ్రసువ్రాసి తన ఉత్తరం అందులోపెట్టి డొక్కులోవేసి బయటికి వస్తుండగా ఒక నల్లని పొట్టిమనిషి ఎదురై ఆమెవంక-చాలా ఆశగా చూశాడు. మానవుడు కళ్ళలో అంతకాంక్ష ప్రకటించగలగటం ఆమె ఎన్నడూ ఎరగదు. ఆ మనిషిని సాధ్యమైనంత త్వరలో మరిచిపోయి శాంత ఊరిబయటికి నడవసాగింది.

సూర్యాస్తమయం కావచ్చింది. శాంత చెరువుగట్టు చేరుకుని చుట్టూ వున్న దృశ్యం కలయచూసి, అది తన కళ్ళకు బాగానే ఉందని నిర్ధారణ చేసుకుంది. ఆ దృశ్యంలో అందమేమీ లేదుగాని మనిషిలో ఉన్న పశుత్వాన్ని సమర్థించే టందు కావాతావరణం అనుకూలంగా వుంది. ప్రకృతికి అంత దగ్గిరగా ఉండే జనానికి కృత్రిమమైన సంస్కారంగాని, అంతకంటెకూడా అసహజమైన వేదాంతంగాని, అబ్బకపోవటంలో శాంతకు వింత కనిపించలేదు!

వెనక అడుగుల చప్పుడయింది. ఆ పొట్టిదున్న వచ్చాడు. చెరువు గట్టుమీద ఆమెకు సమీపంలోనే నిలబడాడు.

"నువు శాస్త్రికూతురివి కాదూ? శాస్త్రీ, నేనూ చిన్నతనంలో కలిసి చదువుకున్నాం. నేనూ చిన్నతనంలో ప్రయిమరీదాకా వెలిగించాలే. నీ పేరేంటి?" అన్నాడు దున్న. అదివరకే ఆమె పేరు తెలిసుండి మరిచిపోయినట్టు.

శాంత ఆయన్ను ఎగాదిగా చూసి, "మిమ్మల్ని పోల్చలేదు!" అన్నది శీతలంగా. ఈ చూపు దున్నను మరింత ప్రోత్సాహపరిచినట్టు కనపడ్డది.

"నాపేరు లక్ష్మీనరసింహం అంటార్లే. ఈ చుట్టుపట్ల నా పేరు తెలీనివాళ్లు లేరు. అదుగో ఆ కనిపించే గట్టు లగాయతూ ఆ దూరాన తాళ్ళవరకూ మా భూమే! ఆ తాళ్ళే పొలిమేర. నిన్ను ఈవూరు తీసుకరావటం పొరపాటే చేశాడు పురుషోత్తం. ఈ వూళ్ళోవాళ్ళు మహాచెడ్డవాళ్ళు."

శాంత ఆయన మాటలు విననట్టు నటించింది. ఆయనకేసి చూడనన్నా చూడలేదు.

"వస్తా!...ఉంటావుగా? కనిపిస్తూనే ఉంటావుగా? నేను పరాయివాణ్ణి కాదులే!" అంటూ దిక్కులదిరేటట్టు ఒక్కనవ్వు నవ్వి దున్న తన పొలంకేసి నిష్క్రమించాడు.

శాంత గట్టుమీదే కొంతదూరం నడిచి ఒక చింతచెట్టుకింద కూర్చుని ఏదో ధ్యానంలో పడింది. ఆమె ఆలోచనా పరంపర ఆగిపోయి ఆత్మజ్ఞానం కలిగేటప్పటికి పొద్దుపోయింది. చుట్టూ ఉన్న వెలుతురు వెన్నెల అని తెలుసుకుని శాంత ఆశ్చర్యపోయింది.

ఇంటికి రాగానే శాంతకోసం నిరీక్షిస్తున్న వాడల్లె పురుషోత్తంగారు "ఎక్కడికి వెళ్ళావు ఒంటరిగా?" అన్నారు వాకిట్లోనే.

"షికారుకు వెళ్ళాను."

"అయ్యయ్యో! నలుగురికీ తెలిస్తే ఏమనుకుంటారు? నలుగురికీ తెలీక ఏమవుతుంది?"

"ఏమనుకుంటారు? షికారుకు వెళ్ళా ననుకుంటారు!"

"చాల్లే! ఏమన్నా అనుకుంటారని నీకు భయంలేకపోతే నాకులేదా? పిల్లలు గలవాణ్ణి! నన్ను నాలుగు కాలాలపాటు బతుకనివ్వవా ఏమిటి? ఇదేమన్నా పట్టణమా, ఆడవాళ్ళు విడిచేసి షికార్లు కొట్టిరావటానికి? అట్లా పోవటానికి వీల్లేదు. తరవాత నీ యిష్టం. పైగా ఆ మైరావణుడితో మాట్లాడావుట, దేనికి? ఆ లక్ష్మీనరసింహం చూస్తుండగానే మచ్చుమందు చల్లేస్తాడు. వాడితో మాట్లాడిన ఆడది సగం చెడిపోయిన దానికింద లెక్క!"

"ఒంటరిగా షికార్లు పోతేనూ, పరాయి మగవాళ్ళతో మాట్లాడితేనూ మీ ఆడవాళ్ళకు ఇబ్బంది రావచ్చు. నాకేం? నన్నుకూడా ఈ నిర్బంధాలు బాధిస్తయ్యా ?"

"మాకొక పద్ధతీ, నీకొక పద్ధతీనా ?"

"ఇంటో ఉంది కనక ఇంటి బయటకూడా ఉండకపోతుందా అనుకున్నాను. నాకుమాత్రం తెలుసునా, పెట్టునా?"

ఆ మాట అని కొంత పగతీర్చుకున్నందుకు శాంతకు కాస్త ఆనందం కలిగింది. ఆ రాత్రే పెట్టే బేడా సర్దుకొని, మర్నాడుదయమే తనువెళ్ళిపోతున్న సంగతి పినతండ్రికి చెప్పింది శాంత.

"ఎక్కడికి?" అన్నాడు పురుషోత్తం ఆశ్చర్యంతో.

"మా పినతల్లి దగ్గిరికి. నేనెట్లాగూ బోగం మనిషినని తేలిపోయింది. అదివరకల్లా బ్రాహ్మణమనిషిగా నటించాను. ఇక సాగనప్పుడేం లాభం? నేను ఎవరిదాన్నో వాళ్లదగ్గిరికే పోతాను!" అన్నది శాంత.

* * *

తన మేనల్లుడు భాస్కరమూ, అతని స్నేహితుడు విశ్వమూ తను కోరిన ప్రకారం వచ్చినందుకు రాఘవయ్యగారు చాలా సంతోషించారు.

"నాగభూషణానిక్కూడా చెప్పాను, మీరిద్దరూ వస్తున్నారని. అతనూ సరే నన్నాడు నేనేం చెప్పినా నాగభూషణం ఎన్నడూ కాదనలేదులే, పాపం. అయినా నాకన్న అతనే ఎక్కువ డబ్బు ఈ కంపెనీలో పెట్టాడు కనక మీరేం చేసినా అతనికి తెలియటం ధర్మం. అందుకని సాయంకాలం గదికి రమ్మని అతనికి కబురుచేస్తాను" అన్నారు రాఘవయ్యగారు.

ఆ సాయంకాలమే భాస్కర్రావూ, విశ్వమూ, రాఘవయ్యగారూ, నాగభూషణంగారూ కంపెనీ గదికి చేరారు. ముందుగానే కబురుచెయ్యటంవల్ల కంపెనీమెంబర్లూ హార్మోనిస్టూ మొదలైన వాళ్లంతా చేరారు. మెంబర్లలో 30, 40, 50 ఏళ్ళవాళ్లేగాని చిన్నకారు లేకపోవటం కనిపెట్టాడు భాస్కరం. హీరో పాత్రలు వేసే ఆయన నలభై ఏళ్లవాడు. ఆడవేషాలు వేసేవాడు ముప్పై ఏళ్లవాడు.

తమను పరీక్షించటానికి ఇద్దరు కుర్రవాళ్ళు వచ్చారనగానే మెంబర్లకు అతిశయం వచ్చింది. కాని తమ ఆగ్రహం బయటపెట్టేందుకు లేదు. ఈ కంపెనీ వదలిపెడితే ఆ మెంబర్లను మరెవరూ తీసుకోరు. పుట్టినప్పటినుంచీ

వేషాలు వేస్తూన్న కారణంచేత వాళ్ళకు మరొకటి చెయ్యటం చాతకాదు. వాళ్లస్థితి నిజంగా శోచనీయం.

"ఏదైనా ఒక సీను రిహార్సు చెయ్యండి" అని అడిగాడు భాస్కరం.

గయోపాఖ్యానమూ, హరిశ్చంద్రా, సాత్రాజితీయమూ మొదలైన నాటకాల్లో నించి ఒక్కొక్క సీను రిహార్సు చేశారు.

"ఇదంతా ఏమీ లాభంలేదు. ప్రపంచమంతా మారుతూ ఉంటే మనం ఈ నాటకాలూ, ఈ రకం నటనా, ఈ పాటలూ పట్టుకుని వేళ్ళాడి ప్రయోజనం లేదు" అన్నాడు భాస్కరం.

తరువాత విశ్వం గిరీశం స్వగతాలు రెండు చెప్పి చూపించాడు.

హీరో పాత్రధారికి కొంచెం రోషం వచ్చింది.

"అడ్డుచెబుతున్నందుకు క్షమించండి. నాకూ ఇరవై ఏళ్ళ స్టేజీ అనుభవం ఉంది. వారిప్పుడు చెప్పినట్టు స్టేజిమీద అది ఆక్టింగే కాదంటారు," అన్నాడాయన

"అవును! అదే ముఖ్యమైన విషయం. నటుడు నటిస్తున్నాడనే జ్ఞానం ప్రేక్షకులకు కలుగరాదు. నా స్నేహితుడు స్టేజిమీద నిలబడి గిరీశం పాత్ర ఈవిధంగా నటిస్తే అతడు గిరీశంకాడనేది ఎవరూ గమనించరు. నటనలో ముఖ్యమైన విషయం అదే అతను రెండు పాటలుకూడా పాడతాడు వినండి" అన్నాడు భాస్కరం.

విశ్వం పాడాడు. హార్మోనిస్టుకు ఆ రకం పాటలు కొత్తకావటంవల్ల విశ్వమే హార్మోనియం వాయించుకోవలసి వచ్చింది. విశ్వం పాటలు మిగిలిన వారంతా నిర్లిప్తులై విన్నారు గాని తబలిస్టుమాత్రం పరవశుడై పోయాడు.

రాఘవయ్యగారు కంపెనీవాళ్ల మొహాలు చూసి నిరుత్సాహపడ్డారు. భాస్కరం కొత్తగొడవ యేదో తెచ్చిపెడుతున్నాడు. దీనికి పర్యవసానమేమిటో? ఏమైనా ప్రస్తుతం ఏదో మార్పు చెయ్యక తప్పదు. లేకపోతే అసలు కంపెనీ కట్టిపెట్టాలిసి వస్తుంది

భాస్కరం తన అభిప్రాయం చెప్పేశాడు :

"సక్రమంగా నాటకాలాడాలంటే యీ కంపెనీలో చాలా మార్పులు చెయ్యాలి. లైటింగు కిందా, ఆర్కెస్ట్రాకిందా, సీనరీకిందా చాలా డబ్బు ఖర్చుచెయ్యాలి. నన్ను నమ్మి ఈ ఖర్చంతా చెయ్యమనటం భావ్యంకాదు. ఒక కొత్త నాటకం కొనేటందుకు అయిదారు వందలు ఖర్చుపెట్టటంకూడా నాకిష్టంలేదు.

ప్రస్తుతానికి దేనే ఒక నాటకం రాసి తయారు చేయిస్తాను. పాటలకు మట్లూ అవీ విశ్వం రాస్తాడు. సాధ్యమైనంత తక్కువ ఖర్చుతో దాన్ని ప్రదర్శిందాం. దాన్ని నాలు గైగో నెలలపాటు ఆడిన తరువాత పెట్టుబడి పెట్టటానికి మీకు మనస్కరిస్తే పెడుదురుగాని, గిట్టుబాటు కాదని తోస్తే మాదారిని మేం పోతాం."

దీనికి రాఘవయ్యగారూ, నాగభూషణంగారూ కూడా ఆమోదించారు.

మర్నాడు స్నేహితులిద్దరూ కలిసి శాంతకు మళ్ళీ ఉత్తరం రాశారు : తాము ఫలానిచోట ఉన్నామనీ, ఇకముందు తమకు రాసే ఉత్తరాలు ఒకే కవరులో పెట్టి పంపుతూ ఉండమనీ. ఎప్పుడన్నా వీలుచేసుకుని వచ్చి తమతో నాలుగు రోజులు గడిపి వెళ్ళమనీ.

శాంత తమకు చాలా దగ్గర్లో ఉందని, వాళ్ళిద్దరికీ తెలీదు. కంపెనీ గదికి వెనక భాగంలో అవతలి వీధిలోకి ముఖద్వారం కలిగిన రెండతస్తుల మేడలోనే శాంత గడిచిన రెండుమూడు రోజుల్నించి ఉంటున్నది. అది ఆమె పినతల్లి అనసూయ ఇల్లు. ఒక కమీషను వ్యాపారస్థు డామెకు ఇల్లు ప్రత్యేకంగా కట్టించి ఇచ్చాడు

అనసూయ శాంతను చిన్నతనంలో ఎప్పుడో చూసిందిట. శాంత అనసూయను అసలే ఎరగదు. కాని ఇద్దరూ ఒకరినొకరు చూసుకుంటూనే ప్రేమించు కున్నారు, అనసూయ శాంతకు రెండుచేతులా అతిథ్యమిచ్చింది, కాని ఆ పిల్ల తన యింట వుండగలుగుతుందని అనసూయ అనుకోలేదు. తన ఇల్లు రహదారీ బంగళా. వచ్చేవాళ్ళూ, పొయ్యేవాళ్ళూ. తను తినేతిండి శాంత తినదు శాంతకు కావలసిన విధంగా తను మాట్లాడలేదు.

శాంతకు పినతండ్రి ఇల్లు ఏ విధంగా బందిఖానా అయిందో, పినతండ్రి ఇల్లు కూడా అట్టాగే బందిఖానా అయింది. అప్పుడూ తను గది విడిచి రావడానికి లేక పోయింది; ఇప్పుడూ గదివిడిచి రావటానికి లేదు - అనసూయకోసం వచ్చి పొయ్యే జనానికి కనిపించటం శాంత కిష్టంలేక. అప్పుడూ తను ఇల్లు విడిచి పోవటానికి లేకపోయింది. ఇప్పుడూ ఇల్లు విడిచిపోవటానికి లేదు - అటువంటి ఇంటోకి, ఇంటోనించీ బయటికి పోతూ ప్రపంచానికి కనిపించటం శాంత కిష్టంలేక.

ఈ పోలికచూసి శాంతకు నవ్వు వచ్చింది. రెండిళ్ళు, సంఘానికి చెరొక చివరా ఉండి తన పాలిటికి రెండూ ఒకటిగానే ఉండటం శాంత ఆత్మవిమర్శకు చాలా తోడ్పడినై.

అయితే ఈ రెండిళ్ళలోనూ ఇంకో తేడా కనిపెట్టింది శాంత. తన పినతండ్రి గారిల్లు తనకు బందిఖానా కావటం, కేవలమూ తన తప్పేనని పురుషోత్తంగారు నిరూపించటానికి ప్రయత్నించారు - కాని శాంతను నమ్మించ లేకపోయినారు. ఇక్కడ తనకు జైలులో పెట్టినట్టుండటం శాంత తప్పేనని నిరూపించే వారెవరూ లేరు. కాని ఆ విషయం ఎవరూ నిరూపించ నవసరం లేకుండానే ఆమెకు నమ్మకం కుదిరింది. జీవితం తల్లకిందులుగా ఉన్నందుకిదో నిదర్శనం.

అక్కడికీ శాంతకోసం తలవాకిలి తలుపు గడియవేసి ఉంచి, ఎవరన్నా వచ్చి తలుపుతట్టినప్పుడు శాంతను తన గదికి వెళ్ళనిచ్చి మరీ తలుపుతీసే యేర్పాటు చెయ్యటానికి ప్రయత్నించింది అనసూయ. అసలీ యేర్పాటు పారలేదు. ఎవరో పొరుగిళ్ళవాళ్ళు వచ్చినప్పుడు కూడా శాంత గదిలోకిపోయి దాక్కోవలసి వచ్చింది. తనకోసం పినతల్లిని ఇన్ని అగచాట్లు పెట్టడం శాంతకు అవమాన కరంగానూ, కృతఘ్నతగానూ తోచింది.

అదివరకు భోగంవృత్తిని గురించి శాంతకు రకరకాల విశ్వాసాలుండేవి. ఆమె పినతల్లి ఇంట అడుగుపెట్టగానే అవి మారసాగిన్నై. భోగంవృత్తి ఆర్థిక సమస్యలవల్ల ఏర్పడ్డదేననీ, అది పరిష్కారం అయితే శరీరం అమ్ముకోడం ఉండదనీ ఆమె అభిప్రాయం. ఇది కులాలూ, కులాచారాలూలేని పాశ్చాత్య దేశాలలో నిజం కావచ్చుగాని మన సంఘంలో మాత్రం నిజంకాదని శాంత ఇప్పుడు తెలుసుకున్నది. తన పినతల్లికి చాలా ఆస్తి ఉంది. పిల్లలు లేరు. ఒక పిల్లను పెంచుకుంటే పన్నెండేళ్ళు పెరిగిపోయింది. ఆమెకు వృత్తిచేయకపోయినా గడుస్తుంది. కాని ఆమె మానలేదు. అనసూయ తన వృత్తిమీద ఏ విధమైన ఏవగింపూ లేనట్లు శాంతకర్థమయింది. ఆ మనస్తత్వం ఏమిటో ఊహించటానికి ప్రయత్నించి శాంత ఓడిపోయింది.

శరీరం అమ్ముకోవటం నీచమయినప్పటికీ దానివల్ల ఇహమైనా ఉన్నదని శాంత అదివరకు నమ్మి ఉండింది. ఈ వృత్తి ఒక్కొక్కరికి రోజుకు పావలా కూలి రేటుకూడా గిట్టించనట్టు ఇప్పుడు శాంతకు స్పష్టమైంది. తన పినతల్లి దగ్గిరకు మీనాక్షి అనే మనిషి బేడకూ పావలాకు వస్తూఉండేది.

"ఈ వృత్తిలోకూడా అదృష్టం కలిసి రావటమూ రాకపోవటమూ ఉంటుంది. ఒక్కొక్కసారి రంభవంటిదానికి రోజులు కలిసిరావు. దొరికే ఖాతాలన్నీ నాసివే అవుతై. సంపాయించే డబ్బు అలాములూ పలాములూ అవుతుంది...ఇది అందరికీ చాతైన విద్యకాదు. కనుముక్కు తీరైనా లేకుండా



రెండు సంవత్సరాల్లో రాణివాసపు దర్జా సంపాదించే వాళ్ళుంటారు. కొందరు లంజలు చదువెక్కువై చెడతారు. వాళ్ళు ఒకడిదగ్గర గుంజి ఇంకోడి మొహాన పోస్తారు. వృత్తిచేసే తెలివితేటలు జన్మతహా రావాలి. ఆ తరవాత ఎంతో అనుభం కావాలి. చెప్పేవాళ్ళుండాలి. చెప్పింది అర్థంచేసుకోవాలి. తరవాత గీత కలిసిరావాలి. ఇది నిజంగా కష్టమైన విద్య. దీన్లో గొప్పవాళ్ళని పించుకున్నవాళ్ళు నిజంగా గొప్పవాళ్ళే."

శాంత పినతల్లి ఉపన్యాసం వింతగా విన్నది. ఐతే ఇదంతా ఆమెకు విజాతీయంగా కనిపించింది. ఇదంతా తనకు వ్యర్థజ్ఞానం. ఒకటిమాత్రం తేలింది. తను బ్రాహ్మణత్వానికి ఎట్లా తగదో, చెయ్యదలిస్తే సాని వృత్తికీ అట్లాగే పనికిరాదు. తను త్రిశంకుస్వర్గంలో ఉంది.

* * * *

శాంత తన గదిలో కూర్చుని ఏదో చదువుకుంటూ ఉండగా దొడ్డివెనుక ఇంటివేపునుంచి ఎవరో పాడటం వినిపించింది. ఏదో పాతరకం పాటలు. ఆ గొడవ మరిచిపోయి శాంత మళ్ళీ చదువులో పడ్డది. ఒకపావుగంట అయిన తరువాత ఆగిపోయిన పాటలు మళ్ళీ ప్రారంభమయినై. ఈసారిఇంకెవరో పాడుతున్నారు. ఆ పాట వింటుంటే శాంత హృదయంలో అస్పష్టమైన ఆవేదన ఏదో ప్రారంభమయింది. ఆ పాట బాగున్నదన్న సంగతికూడా ఆమె గమనించలేదు. కాని ఆ గొంతు ఆమె నరాలు పట్టుకు లాగుతున్నట్టయింది. శాంతకు

మొదట చిరాకువేసింది. కాని త్వరలోనే ఆ చిరాకు బాధగా మారింది. ఆ పాడేదెవ్వరో కనుక్కుంటేగాని ఆమె ఆరాటం తగ్గేటట్టు కనిపించలేదు.

ఆ పాట పూర్తికాగానే శాంత క్రిందికి దిగివచ్చి, తల దువ్వుకుని సింగారించుకుంటున్న అనసూయదగ్గిరికి వచ్చి. "పిన్నమ్మా, మన ఇంటి వెనకాల పాటలు పాడతా రెవరు?" అని అడిగింది.

బాహ్యప్రపంచం శాంతను ఆకర్షిస్తున్నట్టు అనసూయ అర్థంచేసుకుని, "ఈ ఊళ్లో సినిమాలు అవీ ఉన్నైగదా, సాయంకాలంపూట వెళ్ళి సినిమా అయినా చూసిరాగూడదమ్మా?" అన్నది.

"ఎబ్బే, అందుకు కాదు. ఇప్పుడెవరో ఎరిగినట్టున్న గొంతుతో పాడితే అందుకడిగాను," అన్నది శాంత పినతల్లి భావం అర్థంచేసుకుని.

"వాళ్ళెవరో నాటకాలవాళ్ళు. ఇక్కడ మాకో నాటక కంపెనీ ఉందిలే. దిక్కుమాలిన కంపెనీ! దాన్ని వదిలెయ్యమంటే వదలడు చేర్మన్‌గారు."

"చేర్మ నెవరు?"

"ఉన్నాడులే నాగభూషణమని. మనింటి కొస్తుంటాడు. ఆయన చేర్మనూ గాదు పాడూకాదు. వెనక ఎప్పుడో కవున్సిలరుగా ఉండి, పదిహేను రోజుల పాటు చేర్మను పనిచేశాడు. ఆయన్నంతా చేర్మనంటారు."

అనసూయ ఈ మాట అంటుండగానే నాగభూషణంగారు లోపలికి అడుగు పెట్టారు.

మొదట శాంత కంగారుపడింది. అలవాటు ప్రకారం పారిపోయి తన గదిలో దాక్కోవాలనే ఆలోచనవచ్చింది. గాని శాంత ఆ ఆలోచనను చంపేసింది. పొట్టిగా, బొద్దుగా, బట్టతల వేసుకుని నాగభూషణంగారు నిరాపాయుడైన నడి వయసువాడల్లేనూ, పెద్దమనిషిగానూ కనిపించారు.

"కూర్చొండి చేర్మనుగారూ! లాడ్జిలో పాడుతున్నారు ఎవరు? మళ్ళీ నాటకాలాడుతున్నారా యేం? మొత్తానికి దివాలాతీసిన కంపెనీ పట్టుకు ఏం పాకులాడతారండీ?" అన్నది అనసూయ.

"పోనిస్తూ! మా రాఘవయ్యగారు ఎవరినో కొత్తవాళ్ళను తెచ్చి కొత్త నాటకా లాడిస్తున్నాడు. చూస్తాం. ఇంతకన్న చెడదు కదా!...ఈ పిల్లెవరు?" అన్నారు చేర్మనుగారు.

"మాపిల్లే, మా అక్కయ్య కూతురు."

"ఎప్పుడొచ్చింది?"

"రెండుమూడు రోజులయిందిలే."

"అట్లాగా? ఏం చేస్తూంటుంది? ఎక్కడుంటుంది?"

"చదువుకుంది. ఈ మధ్యనే వాళ్ళయ్య పోయినాడు. కొంతకాలం నా దగ్గిరే వుంటుంది. బోలెడంత ఆస్తి ఉంది. పిల్లను చూశారుగదా, దానికి మంచి సంబంధం ఉంటే చూడండీ, పెళ్ళి చేసేద్దాం!" అన్నది అనసూయ.

"ఏం సంబంధాలో! ఏం పెళ్ళిళ్లో!! నన్నడిగితే ఈ రోజుల్లో పెద్దమనుషులైన పిల్లలు ఎవరి మొగుళ్ళను వాళ్ళే వెతుక్కుంటే బాగుంటుంది. మనం పోయి మొగుళ్ళను వెతకపోతే, ఆ మొగుళ్ళు నిక్కి కూచుని మననే పెళ్ళిచేసుకోమంటే ఎంతెంత కట్నం అడగవచ్చునో అంతంతా అడుగుతారు. దానికూడా ఇష్టపడి సంబంధం కుదురుస్తామా, ఆ మొగుడు పిల్లకు నచ్చిందాకా నమ్మకంలేదు. ఈ కాలపు ఆడపిల్లలు—మరీ అన్యాయంగా ఉంది-మనం నవమన్మధుణ్ణి తెచ్చి కట్టి పెట్టినా యిష్టపడరు. వాళ్ళంతట వాళ్ళు వయసు మళ్ళిన మొగవాళ్ళను ప్రేమిస్తారు. వాళ్ళ అభిప్రాయాలు బొత్తిగా కనుక్కోలేం!" అని అంతా అనుభవం మీద మాట్లాడుతున్నట్లే మాట్లాడసాగారు నాగభూషణంగారు, తన కళ్లన్నీ శాంతమీదనే పెట్టి, ఆ కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకొని.

అనసూయ నిర్లక్ష్యంగా, "ఏమో! కాస్త పెద్ద మొగుళ్ళే రైటు ఆడపిల్లలకు. ఆపేక్షగా చూస్తారు. అర్థంచేసుకుంటారు. అభమూ శుభమూ ఎరగని కుర్రకారు వాళ్ళతో సుఖంకన్న కష్టమే జాస్తి" అన్నది. ఈ సంభాషణ ఇక వినకర్లేదని తేల్చుకుని శాంత లేచి తన గదికి వెళ్ళిపోయింది.

"ఆ పిల్లకు నిజంగా పెళ్ళిచేస్తావా ఏమిటి?" అన్నాడు నాగభూషణం.

"ఏం అట్లా అడుగుతున్నారు? ఆ ఆలోచన మీకు నచ్చలేదా?"

"ఉహూఁ!" అన్నాడు చేర్మను. అడ్డంగా తలతిప్పి, పెళ్ళిసమస్యను గురించి సమ్యగ్దర్శనం చేసినవాడల్లే. "పెళ్ళాడినవాళ్ళేం బావుకున్నారు ఉన్న స్వేచ్ఛ కాస్తా పోవడమేగాని? ఎవరినన్నా అనువైనవాణ్ణి చూసుకుని వాడితో నియామకంగా ఉండిపోతే ఎంతో గొప్పగాకూడా ఉంటుంది. నన్నడిగితే మీ పిల్లకు పెళ్ళీ వద్దు, నీ మాదిరిగా ఈ పిటిముష్టీవద్దు. హాయిగా ఎవరినన్నా చూసుకుని పెద్దెత్తుగా వాడితోనే ఉండిపోతే బాగుంటుంది. వాడివల్ల పిల్లకూ ఘనత, పిల్లవల్ల వాడికీ ఘనత! అటువంటి ఏర్పాటు చూడు."

"పోనీ, అదైనా మీరే చూడండి – మా శాంత ఒప్పుకుంటుందని నమ్మకం లేదు గాని!"

"ఒప్పుకోకపోతే తెలివితక్కువ మనిషన్నమాట. నా గతిచూడు ఏమయిందో, నా భార్య పోయినప్పుడే నా కిటువంటిపిల్ల దొరికివుంటే ఇల్లిల్లూ తిరగవలసినగతి పట్టిఉండదుగదా! రెండోపెళ్ళి చేసుకోవటమంత బుద్ధితక్కువలేదాయె. అందుకని నాకీ కర్మ!"

"మీ భార్య ఉన్నప్పుడు మీకు కాలు నిలిచేడిసినట్టు! తీస్యేయం డీ కబుర్లు! ఒకరూ ఇద్దరూ అయితే చాలదాయె. అందుకని చేజేతులూ మీరే చేసుకుని గతని చెప్పుతారేమిటి? విడిచెయ్యటానికన్నా హద్దూ పద్దూ ఉండాలి!" అని అనసూయ బాగా దెప్పింది.

"అట్లా అనకు. మీ పిల్లంటిది నాకు మొదట్లోనే దొరికితే శ్రీరామచంద్ర మూర్తిలాగా ఏకపత్నీవ్రతం చెయ్యకపోయినానా?" అన్నాడు నాగభూషణం నవ్వుతూ.

"అడగక్కర్లా?...మాపిల్లంటివాళ్ళు చెట్టున కాస్తున్నారనుకున్నారా ఏమిటి? ఒక్కపిల్ల ఎంతమందికి దొరుకుతుంది? ప్రపంచంనిండా మీవంటివాళ్ళు కాదూ? వాళ్ళంతా నియామకంగా ఉండటంలా?"

"అట్లా అంటున్నావుగాని, నువ్వు తలుచుకుంటే ఈ క్షణాన ఆ పిల్లను నా కేర్పాటుచెయ్యలేవూ?"అన్నాడు నాగభూషణం నిర్లక్ష్యంగా.

"ఏమిటీ?" అన్నది. అనసూయ చేర్మనుధోరణి గ్రహించి. "ఈసారి అంటే అన్నారుగాని ఇంకోసారి అనబోకండి. అది వింటే మనిద్దర్నీ పాతేస్తుంది!"

"ఏదో మాటవరస కన్నాను. నిన్ను గాని, మీ అమ్మాయిని గాని నిర్బంధించానా ఏమిటి? పిల్ల పెళ్ళి విషయం అడిగావు గనక నాకు తోచింది నేను చెప్పాను. తప్పేముంది?"

అనసూయ ఆయనకేసి నిదానించి చూసి, "చాల్లే సరసం!" అంది.

"వేళాకోళ మనుకుంటున్నావా?"

"కాకపోతే మరేమిటి?"

"అయితే పోనీ. ఇక ఈ విషయం మానేద్దాం" అన్నాడు నాగభూషణం.

కాని అనసూయకు రకరకాల ఆలోచనలు బయలుదేరినై. నాగభూషణం మంచి మనిషి. ఆస్తిపరుడు. ఆడవాళ్ళను గౌరవంగా చూసేబాపతు. ఈడు మించినవాడని శాంత అభ్యంతరం చెప్పకుండా ఉంటే ఇంతకన్నా మంచి ఏర్పాటుండబోదు. తనకు నాగభూషణంవల్ల ముట్టే తృణమో కణమో శాంతకే

ఉంటుంది. ఇంతలో నష్టమేమిటి ? తన ఇంటో ఎట్లాగూ ఉండలేదు శాంత. పిన తండ్రిగారింటో అసలే ఉండలేకపోయింది. శాంతకు పెళ్ళి కావటం కష్టం. ఒక వేళ అయినా బ్రాహ్మడే దొరకటం మరీ కష్టం. నాగభూషణం బ్రాహ్మడు. శాంతను పువ్వుల్లో పెట్టి పూజిస్తాడు. ఆ ఇంటో శాంత రాజ్యం ఏలవచ్చు. అడిగేవాళ్లుండరు. ఏమిటి లోటు ?

ఆలోచించినకొద్దీ ఇది దివ్యమైన ఏర్పాటుగా తోచసాగింది అనసూయకు. మర్నాడుదయం అనసూయ శాంతను కూర్చోబెట్టి ఆమె భవిష్యత్తును గురించి పట్టుదలగా చర్చించింది.

"ఏం చేస్తానో నాకే తెలీదు......దానంతట అదే ఏదో జరుగుతుందనే నమ్మకంతో కూచున్నాను. జరిగే దేమిటో నాకూ తెలీదు...పెళ్ళాడతానను కోను...లేదు, నాకెవరిమీదా ఇంతవరకూ అపేక్షలేదు...ఏదన్నా చిన్న వ్యాపకం కల్పించుకుందామని ఉంది. చిన్నపిల్లలకు చదువు చెప్పటమో, ఇంకే మన్నా చేతామని ఉంది—పొద్దుపొయ్యేందుకు మనం ఎరిగినవాళ్ళయితే ఊరికేనే చెబుతాను".

శాంత చాలా అస్పష్టంగానూ, భవిష్యత్తును గురించి ఆలోచించటం బాధగా ఉన్నట్టుగానూ మాట్లాడింది.

"మొన్న మన ఇంటికి వచ్చారే నాగభూషణంగారు, ఆయనకు పదేళ్ల పిల్లా, ఎనిమిదేళ్ల పిల్లవాడూ ఉన్నారు. నువు వాళ్ళపిల్లలకు చదువు చెప్పరాదూ ? ఆయన చాలా స్నేహపాత్రుడు. సరదామనిషి. పొద్దూకులూ వాళ్లింటో కూర్చున్నా నీకు పొద్దుపోతుంది." అని చెప్పింది అనసూయ.

"నాకేమి అభ్యంతరం లేదు. రెండురోజులుచూసి నాకు బాగుంటే అట్లాగే చేస్తాను. కాని ముందుగా మాట ఇవ్వలేను. ఆయనంటే నా కంత అభిప్రాయం ఏర్పడలేదు" అన్నది శాంత.

*  *  *  *

మర్నాడు శాంతను నాగభూషణంగారు స్వయంగా తన ఇంటికి వెంట పెట్టుకుని వెళ్ళారు. దారిపొడుగునా బండిలో ఆయన తన మోచేత్తో ఆమె మోకాలు పొడుస్తూ, ఆమె తన ఇంటికి వస్తున్నందుకు కృతజ్ఞత వెళ్ళబోసు కున్నాడు.

నాగభూషణంగారి పిల్లలిద్దరూ చాలా బుద్ధిమంతులు. వాళ్లు తల్లిలేని పిల్లలని తెలుసు గనుక శాంతకు వారిని చూడగానే హృదయం కరిగిపోయింది. వాళ్ల

మాటలూ మర్యాదా చూస్తే శాంతకు ముచ్చటేసింది. నాగభూషణంగారిల్లు శాంతకు స్వర్గమల్లే కనిపించింది – పుషోత్తంగారిల్లూ, అనసూయ ఇల్లూ చూసినమీదట ఇక్కడ తనకు ఊపిరాడుతున్నట్టుగా ఉంది.

"నువ్విక్కడే ఉండదలిచినా నా కభ్యంతరం లేదు. నాకు మరీ సంతోషం. ఈ ఇంటో నీ మాటకు తిరుగుండదు. నా పిల్లలకు నువుచెప్పే చదువుకన్నా నీ సహవాసం వెయ్యిరెట్లు ఎక్కువైనదని నాకు తెలుసు," అన్నాడు నాగభూషణం ఆత్రంతో.

"తరవాత చూదాం లెండి!" అన్నది శాంత.

తనను పిల్లలు పాతచుట్టాన్ని చూసినట్టుచూడడమూ, వాళ్లిద్దరూ తమ విద్య లన్నీ తనకు చూపటమూ, తనను లక్ష ప్రశ్నలు వెయ్యటమూ, తనకు గ్రామ ఫోను వినిపించటమూ, తనచేత చీట్ల పేకాడించటమూ మొదలైన వన్నిటితోటీ రెండు మూడు గంటలు గడిపి శాంత ఇంటికి పోవటానికి బయలుదేరేటప్పటికి నాగభూషణంగారు శాంతను భోంచెయ్యందే వెళ్ళనివ్వ నన్నారు. శాంత భోంచెయ్యనని చాలాసేపు మొండికెత్తింది. కాని లాభంలేకపోయింది. శాంత భోంచెయ్యకపోతే తామూ భోంచెయ్యమని పిల్లలచేత అనిపించాడు తండ్రి. భోంచెయ్యటానికి ఒప్పుకున్న తరవాత నాగభూషణం పంక్తిన భోంచెయ్య టానికి మరో పేచీ పెట్టింది శాంత. కాని దానికూ్కడా నాగభూషణంగారు అంగీకరించలేదు.

"మా ఇంటో అటువంటి అభ్యంతరా లేమీలేవు. కాస్త పాతకాలపు మనిషి మా ఇంటో మా అక్కే. ఆవిణ్ణి ఆవిడమొగుడు బతికుండగా నానా మాలకూళ్ళూ తినిపించాడు. వొట్టి పాపిష్టి పీనుగ!" అన్నాడు భూషణం.

భోజనా లయినతరవాత పిల్లలు మళ్ళీ కొత్తవిద్యలు ప్రదర్శించారు. ఇద్దరూ తమ పుస్తకాలు తెచ్చి శాంతముందు పడేసి అందులో తమకు వచ్చిన పాఠాలూ, రాని పాఠాలూ చూపించారు. తమకు కంఠతా వచ్చిన ఇంగ్లీషు తెలుగు పద్యాలు వప్పగించారు.

"పన్నెండుగంటలకు నడి ఎండలో ఏంపోతావు! కాస్త పొద్దువాలిన తరవాత పోవచ్చు. కావాలంటే కాస్సేపు పడుకో. అమ్మాయి, ఆవిడకు దక్షిణపు గదిలో పక్క వెయ్యవే!" అన్నాడు నాగభూషణం.

"నేను పడుకోను. పగటినిద్ర నా కలవాటు లేదు." అని శాంత అబద్ధం ఆడింది. "ఊరికే నడుంవాల్చు పోనీ!" అన్నాడు నాగభూషణం.



శాంత ఒకవేళ నిద్రపోదలచినా పిల్లలు ఆమెను వదల్లేదు. ఆమె వెంట గదిలోకివచ్చి ఏమైనా కథలు చెప్పమన్నారు. ఆమె ఏవేవో కథలు చెప్పసాగింది. అవి వింటూ ఇద్దరూ ఆ మంచంమీదే ఆమెకు చెరో వేపునా పడుకుని నిద్ర పోయినారు. మరికాస్సేపటికి శాంతకూడా కన్ను మూసింది.

నాగభూషణంగారి దయవల్ల శాంత జీవితం విశాలమయింది. ఆమె రోజుకు హీనంగా అయిదారు గంటలు – ఒక్కొక్కరోజు ఇరవై నాలుగు గంటలూ అక్కడ గడపసాగింది. నాగభూషణంగారిమీద ఆమెకు మొదట్లో కలిగిన దుర భిప్రాయం క్రమంగా రహితమయింది. తన ఇద్దరు పిల్లలతోపాటు ఆయన కూడా ఒక పెద్దపిల్లవాడల్లే ఉండేవాడు. ఆయనను చనువుతీసుకుని కోప్పడ టమూ, చిన్నపిల్లల్ని ఉబ్బేసినట్టు ఉబ్బెయ్యటమూ ప్రారంభించింది, శాంత. ఆమెకు కోపం వస్తే నాగభూషణం నిజంగానే భయపడేవాడు. ఆమె కోపం పోగొట్టటానికి ఏమైనా చేసేవాడు. తనతో పరిచయమైనందుకు ఆయన అమిత గర్వపడుతున్నట్టు శాంత గ్రహించి ఆయన అమాయికత్వానికి నవ్వుకున్నది. తన కంతవిలువ ఇచ్చినవారెవరూ లేరు.

కాని నాగభూషణంలో ఒక్కవిషయం శాంతకు నచ్చలేదు. బలవంతాన లేని అవకాశం కలిగించుకుని ఆయన తన చెయ్యో భుజమో ముట్టుకుంటాడు. తన

కన్న రెట్టింపుపైగా వయస్సున్నవాడికి దుర్బుద్ధి లంటగట్టటం గాని, ఈ కాస్తతో పాతివ్రత్యం నటించటంగాని శాంత కిష్టం లేకపోయింది. పైగా ఇంత స్వల్ప విషయానికి ఆయన్ను నిలవదీసి నేరారోపణచేసి బాధించటం ఇష్టం లేదు. చాత కాలేదు కూడానూ. కాని ఆయనంతట ఆయన ఆ అలవాటు మానేట్టు కనిపించ లేదు. అది నానాటికీ ఎక్కువవుతున్నది.

సాహసించి శాంత ఒకసారి "ఏమిటి, పసిపిల్లనాతల్లె! నన్ను ముట్టుకుని చెబితే కాని నాకు వినిపించదనా, అర్థం కాదనా?" అన్నది ఆ సమయాన పిల్లలుకూడా దగ్గర లేరు. అందుకనే ఆమె సాహసించ గలిగింది కూడానూ.

"నిన్ను ముట్టుకుంటే నాకెంత ఆనందమో నువ్వెరిగితే అట్లా అనవు!" అన్నాడు నాగభూషణం ఆమె చెయ్యి పట్టుకుని.

శాంతకు ఒక్కసారి భగ్గుమన్నది. ఆమె ఆయన చెయ్యి దులిపేసి, "ఇట్లా అయితే నేను మీయింటికిక రాను!" అన్నది.

"నేను నీకోసం ఎట్లా తపించిపోతున్నానో నువ్వింకా తెలుసుకోలేదా? నువీ ఇంటో తిరుగుతుంటే నా ఇల్లు నిండినట్టుంది. నువ్వు నా పిల్లలకి తల్లికన్న ఎక్కువగా ఉంటుంటే, నాకు భగవంతుడు కలిగించిన ఒక్కకొరతా తీరినట్ట యింది. నా ఆపేక్ష నీకు కోపం తెప్పిస్తుందని నేను కల్లోకూడ అనుకోలేదు శాంతా! నీది ఇంత ప్రేమతో కూడుకొన్న స్వభావమని తెలిసిన తరవాత నా ఆపేక్షను గౌరవంతో చూస్తావనుకున్నాను. చౌక అభిప్రాయాలు గల ఇతర ఆడవాళ్ళల్లే నువుకూడా నా వయస్సు పాటిస్తావనుకోలేదు.. నేను నీతిపరుణ్ణి కాను అయినట్టు నీదగ్గిర నటించటంలేదు. కాని ఏ నీతిపరుడూ నీ విలవ కను క్కోలేడు, నేను కనుక్కుంటున్నాగా. అదివరకు నీ మనస్సులో ఎవరూ లేరని మీ అనసూయ మాటల సందర్భాన [illegible]ంది. అటువంటప్పుడు నిన్ను పెళ్ళాడ తాననటానికి భార్యలేని ప్రతిమగవాడికీ హక్కున్నది. ఇంతమాత్రానికే అది నిన్ను అవమానించటమ[illegible] నువ్వనుకో[illegible]క్కర్లేదు. అవకాశం చూసి నేనుకూడా నిన్నామాట అడుగుదా మ[illegible]న్నను ఇప్పుడు చెప్పు, నన్ను పెళ్ళాడ తావా?" అన్నా[illegible]

శాంత తల తిరిగిపోయింది. ఆయన ఈ ఉపన్యాసం ఇవ్వకుండాఉంటే బాగుండేది. కాని ఇచ్చేశాడు. దీన్ని తాను తృణీకరించేటందుకు వీలులేదు. ప్రతి కూల సమాధా[illegible]నా బాగా ఆలోచించి ఇవ్వవలసిందే కాని అప్పటికప్పుడు 'నేను నిన్ను చేసుకోను' అనటం [illegible] కాదు! ఒకప్పుడు తనను గురించి

తనకున్న అభిప్రాయాలు తప్పని ఎన్నడో తేలిపోయింది. పని పెట్టుకుని సంఘంలో తన స్థానమేమిటో ఇంతవరకూ నిర్ణయించలేదు. తన కీక్షణాన హాస్యాస్పదంగా కనిపిస్తున్న నాగభూషణంగారి కోరిక ఒకవేళ తన విలవకన్న హెచ్చయినదేమో! ఇది నిరాకరిస్తే ఇంతమాత్రం అవకాశంకూడా రాదేమో! జాగ్రత్తగా ఆలోచించాలి. తొందరపడరాదు. నాగభూషణం ఇటువంటి కోరిక కోరబోతాడని ముందుగా ఏ మాత్రం అనుమానం తట్టినా శాంత సమాధానం జాగ్రత్తపరిచేదే!

"మీరు చెప్పింది ఆలోచిస్తాను. నాకో నెల గడువివ్వండి!" అంది శాంత.

"గడువు తీసుకో. నెల అనవసరం. పదిహేనురోజులు చాలు!"

"సరే, పదిహేనురోజు లివ్వండి, ఏ సంగతీ చెబుతాను!"

"థాంక్స్!" నాగభూషణం ఆమె రెండుచేతులూ తన చేతులతో గట్టిగా పట్టుకున్నాడు—అప్పుడే ఆమె తనను ఆమోదించినట్టే.

"ఒకటే షరతు" అన్నది శాంత. "మీరీలోపల ఈ విషయం తీసుకు రాగూడదు. నన్ను ముట్టుకోనని కూడా వాగ్దానం చెయ్యండి."

"ముట్టుకోవటం తప్పేనా?"

"తప్పూ, ఒప్పూ అని కాదు. మీకు బొత్తిగా నిగ్రహమనేది లేదని తోస్తే మిమ్మల్ని పెళ్లాడాలని నాకెట్లా బుద్ధిపుడుతుందీ?"

"అయితే ముట్టుకోను!" అని చట్టున నాగభూషణంగారు శాంత చేతులు వదిలేశారు.

శాంత నేరుగా వెళ్ళి పినతల్లిని సలహా అడిగింది. తనదగ్గిరికి తరుచు వచ్చే మనిషి తన అక్కకూతుర్ని పెళ్లాడుతున్నాడంటే అనసూయ కించిత్తయినా అసూయగాని, అసమ్మతినిగాని కనబరచకపోవడం శాంతకు ఆశ్చర్యం కలిగించింది. మీదుమిక్కిలి అనసూయ సంతోషించినట్టు కనబడ్డది

శాంతను అనేకశక్తులు అనేక వేపులక [illegible] గినై.

తన కెవ్వరో ఒకరి అండకావాలి నా [illegible] టునంతో అండగా పనికి వస్తాడు. అసలే తన రోజులు బాగ [illegible]వు తనకు సంఘంలో స్థానంలేదు, తనకు తాను లేనిపోని విలువ ఆపాదించుకుని ఏం ప్రయోజనం?

ఆ మాటవిని తనను తను మరీ తక్కువ చేసుకుని, విగ్గిక్కి లొంగిపోయి, ప్రాణం బేజారయి. దొరికినవాణ్ణి పెళ్ళాడెయ్యటమేనా? విధితో పెనుగులాడి, 'నాకు నాగభూషణంకంటె మంచిమొగుడు రాకపోతే పెళ్లాడను నిండా ముని

గినదానికి చరేమిటి ? నా కింతకన్న ఏంకష్టాలు రాబోయినై' అనే దృష్టి ఉండ వద్దా ? అసలిప్పుడు తనకు పెళ్లికాకపోతే ఏం ? తను భర్తకోసం తహతహ లాడుతున్నదా ? ఈ పెళ్ళి అభిప్రాయం తనలో పెట్టిన దెవరు ?

తను ఇంత అధోగతికి వచ్చినా, ఇంకా ఏదో ఆకాశాన్నించి తన ముందు ఊడిపడుతుందనే ఆశ పోదేం ? అదంతా తన ఆత్మవంచనేనా ?

కష్టాలు మనిషి ఆధ్యాత్మికబలాన్ని హరించుతై. తన కటువంటి పని జరగటం లేదుకదా ? పదిహేనురోజులకిందట-పదిరోజుల కిందట కూడా—ఒక పొట్టి, లావాటి, బట్టతలమనిషి, నడివయసువాడు వచ్చి తనను పెళ్ళాడతానంటే తను ఆ విషయం గురించి ఇంతగా ఆలోచించి ఉండేదా ?

తన పెళ్లివిషయం వచ్చినప్పుడు తను తన తండ్రితో అన్నమాటలు జ్ఞాపకం వచ్చినై. తనకు సరిఅయిన భర్తదొరక్క, పెళ్ళాడవలసిన గతే పడితే తను పెళ్ళాడతానని తండ్రితో చెప్పింది అక్షరాలా నాగభూషణాన్నే ! తన వాక్కు ఎంత అమోఘంగా పరిణమించింది ! ఇక లాభం లేదు. తనకు నాగ భూషణం రాసిపెట్టి ఉన్నాడు !...ఆ విశ్వాసం తన కెంత బాధగా ఉంది !

సరిఅయిన భర్తకోసం తను ఏం వెతికింది ? అయినా తన భ్రమగాని, సరి అయిన భర్తలు వెతికితే దొరుకుతారా ? గీతలో రాసిపెట్టి ఉండాలిగాని ! వెత కటమని ఒక్కమాటు అన్నట్టేనా ? ఎట్లా వెతకటం ? అసంభవం !

ఇటువంటి సమయంలో అనసూయతప్ప తనకు సలహాఇచ్చే స్నేహితులు-తన సంస్కారం ఉండి తన మనస్తత్వం అర్థంచేసుకునేవాళ్లు-లేకపోవటం ఎంత పాతకం !

విశ్వం ఏమయినాడు ? అతని వాగ్దానం ఏమయింది ? తనను అప్పుడే పూర్తిగా మరిచాడా ? అదికూడా తన జాతక ప్రభావమేనేమో ! అతనికి రాసిన మూడు ఉత్తరాలకు జవాబు లేదు. భాస్కరానికి రాసిన ఉత్తరానికీ జవాబు లేదు. వాళ్ళ మంచితనం స్నేహం కింద గణించినందుకు శాంత కిప్పుడు చిన్న తనం వేసింది. వాళ్ళెక్కడ ? తానెక్కడ ?

ఆ రాత్రి ఆమెకు తిండి సయించలేదు. గదిలో ఒంటరిగా కూర్చుని ఏడవ బుద్ధయింది. తన కెవరూ లేరు. ఎవరూ లేరు. చచ్చిపోయిన తన తల్లి దండ్రుల ఆత్మలు కూడా తనను విసర్జించినై ! ఇంత విశాల ప్రపంచంలో తన కున్నది నాగభూషణమూ, అతని బట్టతలా, అతని ముసలి ప్రేమా !

మళ్ళీ కంపెనీవాళ్ళ లాడ్జిలో సంగీతాలు మొదలుపెట్టారు. ఎవరో ఆ పాడేది?

ఎంత నిశ్చింత లేకపోతే అట్లా పాడగలడు? ఆ దిక్కుమాలిన పాట తన కడుపులో చెయ్యిపెట్టి అట్లా తిప్పుతుందేం?

*   *   *   *

'ఇవాళే మన నాటకం. సాయంకాలం పెందలాడే నువ్వూ, మీ పిన్నీ ఇక్కడకువస్తే ఇక్కడే భోంచేసి ఇక్కణ్ణించే పోదాం!'' అన్నాడు నాగభూషణం శాంతతో.

సరేనన్నది శాంత. నాటకం సంబరంలో నాగభూషణం పిల్లలిద్దరూ బిగ్గరగా మాట్లాడుతూ గంతులెయ్యసాగారు.

"మీ రిద్దరూ ఇక్కడ అల్లరి చెయ్యకండి. ఎటైనావెళ్లి ఆడుకోండి!" అన్నాడు నాగభూషణం.

"ఉండనివ్వండి, వాళ్ళచేత కాస్త చదివింతా మనుకుంటున్నాను!" అన్నది శాంత. నాగభూషణానికి ఒంటరిగా చిక్కటం ఇష్టంలేక.

"చాల్లే. నువు వాళ్లను చదువుతో చెడగొట్టేస్తున్నావు!" అన్నాడు నాగభూషణం.

"మేం చదువుకుంటాం నాన్నా!' అన్నాడు కుర్రాడు.

''ఏడిచావులే! పదండి'' అని నాగభూషణం పిల్లల్ని బైటికి తరిమాడు.

శాంత నాగభూషణంకేసి నిదానంగా చూస్తూ, "పిల్ల లిద్దర్నీ వెళ్ళగొట్టారు. ఏమిటి కథ?" అన్నది.

అది నాగభూషణానికి ప్రోత్సాహంగా పనికి వచ్చింది. ఆయన శాంత చేతులు పట్టుకుని తనవేపు బలహీనంగా లాగుతూ "శాంతా. పదిహేను రోజులు గడువు పెట్టావు ఎట్లా గడుస్తుంది! ఒకవారం గడవటానికింత గగన మయిందే! ఇంకో వారం గడపగలనా?'' అన్నాడు.

"ఇంకో వారమేం? ఇంకా రెండువారాలు గడపాలి!" అన్నది శాంత శాంతంగా.

''ఇంకా రెండు వారాలా? నువుకోరింది పదిహేనురోజులేగా?''

"అవును. మీరు నాచేతు లెందుకు పట్టుకున్నారు? ఆ విషయం ఎందుకెత్తారు? ఇంకా పదిహేనురోజులు!—ఈలోపల మీరు మళ్లీ ఇటువంటి పని చెయ్యకుండా ఉంటే!''

''నాతో చెరలాటం ఆడుతున్నావుగాని నువ్విప్పు డన్న మాటలో అర్థం ఉందీ?"

"షరతుల్లో అర్థం ఏముంటుంది! కేనొక షరతు కోరాను. దానికి మీరు ఒప్పుకున్నారు. ఒప్పుకుని మీమాటమీరే అతిక్రమించారు. అది నా తప్పేనా?"

"నా స్థితిలో నువ్వుంటే అంత కఠినంగా మాట్లాడవు. పదిహేనురోజులు కైమడిగావు. పదిహేనురోజులూ నన్ను ముళ్లమీద ఉంచి నువ్వాకరుకు నన్ను నిరాకరించవచ్చును. నా ఆరాటం ఎంతగా ఉందో నువ్వర్థంచేసుకోలేవా? ఈలోపుగా నేను చేసిన పాపం ఏమిటి? నీమీద మనసు పట్టలేకపోవటం? దానికా నన్ను నువు శిక్షించేది? ఏమిటీ అన్యాయం? పోనీ నన్ను స్వీకరిస్తానని మాట ఇవ్వు నిన్ను ముట్టుకోకుండా నెలరోజులుంటాను. తప్పితే అప్పుడను!"

ఈ వాదన శాంతకు కోపం రాలేదు. తాపీగా ఆమె ఆయన తప్పు ఆయనకు విప్పి చూపించింది.

"నేను పదిహేనురోజులైన తరవాత నిరాకరిస్తానేమోననే భయంతో ఈ లోపల దక్కినంతే ఆయెనని నన్ను ముట్టుకున్నారన్నమాట! మీరు చవుకబారు ఆడవాళ్ళతో తిరిగి ఆడదానికోసం తహతహలాడటమే నేర్చుకున్నారుగాని ఆడదాన్ని సంపాయించేవాడి బాధ్యత మీకర్థం కాలేదు."

"నువ్వు నిజంగా కిరాతకురాలివి!" అన్నాడు నాగభూషణం.

"అవును. నన్ను వదిలెయ్యండి. నేను పదిహేనురోజు లడగటం ఎంత ఉపకరిస్తున్నదో చూశారా? మిమ్మల్ని నేనూ, నన్ను మీరూ బాగా అర్థం చేసుకోవడానికి అవకాశం దొరికింది. నన్ను చూసి నేను అన్ని విధాలా మీకు కావలసిన దాన్ననుకున్నారు. ఇంకో వారంకూడా జరగనివ్వండి. నాలో ఇంకెన్ని లక్షణాలు చూస్తారో చెబుదురుగాని!" అన్నది శాంత.

"ఇట్లా మాట్లాడకు. చేసినదానికి చెంపలు వాయించుకుంటాను. నువ్వెటువంటి దానివైనా నాకభ్యంతరం లేదు. నాకు నువ్వే కావాలి."

"ఇది మగ పాతివ్రత్యం మాదిరిగా ఉంది! మీరు నన్నుచూసి నా శరీరాన్ని కోరారు. దానివెంట ఎటువంటి కుళ్లుమెదడూ, ఎంత ఛండాలమైన ప్రవృత్తులూ ఉన్నా మీ కభ్యంతరం లేదన్నమాట! ఇంతకంటె నాకు కావలసిందేముంది?" అన్నది శాంత ఎగతాళిగా.

నాగభూషణం ఆశ్చర్యంతో "ఇవాళిట్లా ఐపోతున్నా వేంటి?" అన్నాడు.

శాంత లేచి ఇటూ అటూ తిరగసాగింది. వారం పదిరోజుల్లో తను ఆకాశం మీదినించి కిందపడ్డది. వారంరోజుల క్రితం తన చెవులకు హేళనగా వినపడ దగిన మాటలు ఈనాడు తను గంభీరంగా వినవలసివస్తున్నది. ఈ నాగ

భూషణమూ, ఆయన ప్రణయమూ, ఆయన అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పవలసిన బాధ్యతా—ఇదంతా కల కాదనుకోటం చాలా కష్టంగా ఉంది. ఆ విషయం నాగభూషణానికి ఎట్లా అర్థమవుతుంది? ఇది నిజంగా పీడకలే! తనలో అణిమాదిసిద్ధులే ఉంటే ఈ కలలోనించి మేలుకుని బయటపడగలుగును!... యథార్థ ప్రపంచంలో ఎక్కడో తన తల్లీ, తండ్రీ, భాస్కరమూ, విశ్వమూ, వారందరు తనతో అన్నమాటలూ, వారి సంపర్కంవల్ల తనలోకలిగిన భావాలూ అట్లాగే ఉన్నై. ఈ పీడకల వాటిని తనకు ఎడంచేసింది. అంతే......

ఎనిమిదిన్నరకు హాలుదగ్గిర జనం కిటకిట లాడుతున్నారు కిళ్లీవాళ్ళ అరపులూ, సోడావాళ్ల అరపులూ, సోడాలుకొట్టే మోతా, జనంచేసే కలకలమూ ఇల్లాఇ దీపాలూ, పొగా వీటన్నిటితోనూ ఆ ప్రదేశం శోభిస్తున్నది.

ఈ జనమంతా కంపెనీ ప్రఖ్యాతినిబట్టిగాని, నటుల పేరుప్రతిష్ఠలనుబట్టిగాని, నాటకానికున్న ఆదరణనుబట్టిగాని రాలేదు భాస్కరం నాటకానికి మంచి పబ్లిసిటీ ఇచ్చాడు. చిల్లర డబ్బులకుకూడా మొహం వాచిఉన్న చిత్రకారుణ్ణి పట్టుకుని అతనికి నెలజీతం ఏర్పాటుచేసి అతనిచేత నాటకానికూ్కడా అరడజను బానర్లు రాయించి ఊళ్లో అక్కడక్కడా పెట్టించాడు. పబ్లిసిటీ పనిచేసింది. జనం బాగా వచ్చారు.

శాంతా, అనసూయా, నాగభూషణమూ హాలుదగ్గిరికి వచ్చేటప్పటికి ఏడు వందల పైచిల్లర కలెక్షను వచ్చినట్టు తెలిసింది. ఆడవాళ్ళ నిద్దర్నీ హాలులోకి పంపి నాగభూషణంగారు బుకింగు దగ్గిరికి వెళ్లారు. భాస్కరం కూర్చొని టిక్కెట్లు అమ్ముతున్నాడు.

"హాలు పట్టినదానికన్న ఒక్కటిక్కెట్టుకూడా అధికంగా అమ్మటంలేదు. నేలా, బెంచీ ఆపేశాను. ఇంకా కాసిని కుర్చీలున్నై, అవికూడా పూర్తికాగానే బుకింగు కట్టిపెడతాను." అన్నాడు భాస్కరం.

"నీయిష్టం" అన్నాడు నాగభూషణం.

"ఇంతమంది జనం వచ్చారు. కొత్తకథ. ఇవాళ నాటకం ఫెయిలయితే ఇక నేను మావూరువెళ్ళి పొలం దున్నుకుంటాను" అన్నాడు భాస్కరం.

"తరవాత ఏమైనాసరే. మన నాటక మేమిటి, ఇంతమంది హాలుదగ్గిర పోగవటమేమిటి? నువు నిజంగా మొనగాడివే. ఇంతటితో కంపెనీ దివాలా ఎత్తినా నాకభ్యంతరం లేదు. మన నాటకానికిట్లా జనం ఎగబడి నాలుగేళ్లయింది నమ్ముతావో నమ్మవో!" అన్నాడు నాగభూషణం.

"మామయ్యగారేరీ?''

"స్టేజిలో ఉన్నాడు. నాటకం సరిగా టైముకు ప్రారంభించే భారం ఆయన మీద వేశాను. ఈ కాస్తపని ఐపోగానే నేనువచ్చి అందుకుంటాను. మీరుకూడా లోపలికి వెళ్లి సమయానికి తెర ఎత్తేటట్టు చూడండి.''

కాని తొందర ఏమీ లేకపోయింది. ఇంకా పావుగంట వ్యవధి ఉందనగానే వేషాలు పూర్తి అయిపోయినై నాటకం ప్రారంభించక పూర్వమే భాస్కరం బుకింగు పూర్తిచేసి స్టేజిలోకి వచ్చాడు. సరిగా లెక్కప్రకారంగా తెర ఎత్తారు. మొదటనే విశ్వం స్టేజిమీదికి వెళ్ళాలి.

"మీరిద్దరూ నా నాటకాన్ని పిట్‌లోనించి చూసి ఎట్లావుందీ చెప్పాలి!" అని భాగస్థు లిద్దర్నీ స్టేజిలోంచి తరిమివేశాడు భాస్కరం.

నాగభూషణంగారు కుర్చీలో కూర్చుంటూ ఒకసారి ఆడజనంలో అనసూయనూ, శాంతనూ, పోల్చుకుని తృప్తిపడి లేస్తున్న తెరవేపు తిరిగారు.

విశ్వం పాటపాడుతూ స్టేజిమీదికి వచ్చాడు. శాంత ప్రాణాలన్నీ కళ్ళల్లోకి, చెవుల్లోకీ వచ్చినై. దురదృష్ట వశాత్తూ అంతకుపూర్వం ఆమె విశ్వం మూలుగుతుండగానైనా వినలేదు సరేకదా అతను పాడతాడనైనా విన్న జ్ఞాపకంలేదు. దానికితోడు విశ్వం వేషంలోనించి గుర్తుపట్టటానికి వీలుగాలేదు. కాని ఆమె కళ్ళు అతనిమీదే ఉన్నయ్.

ఎంతసేపటికీ విశ్వం శాంత వున్నవేపు చూడలేదు. నాటకం జరిగిపోతున్నది. నాటకంనిండా పాటలూ, హాస్యమూ-సంభాషణలో హాస్యం-తప్ప ఇంకేమీలేదు. కాని జనం ఆ సంభాషణలకు విరగబడి నవ్వుతున్నారు. పాటలు చాలా ఆనందంతో వింటున్నారు. పాడిన పాటే మళ్ళీ మళ్ళీ పాడలేక విశ్వం హాతమారిపోతున్నాడు. జనం వన్స్ మోరని అరచినప్పుడు మళ్ళీ పాడటమా అనే సమస్య విశ్వానికి అదివరకే వచ్చింది. కాని భాస్కరం పాడవలసిందేనని తేల్చాడు.

"అట్లా పాడటంవల్ల రసభంగంకాని నాటకాలే ఆడదాం! తుమ్మితే ఊడేకళను మనం ఆరాధించనే వద్దు. చూసేవాళ్ళకు ఆనందం ఇచ్చిందే కళ!"

''బూతుపాటలు పాడితే ఆనందిస్తారు. అదే కళ అంటారా?'' అని పాత హీరో వెంకటరత్నం అడ్డొచ్చాడు.

"బూతుపాటలు వట్టి ఆనందం కలిగించవు. ఉద్రేకంకూడా కలిగిస్తయి. నేను చెప్పేది ఆ ఆనందంకాదు" అన్నాడు భాస్కరం

భాస్కర్రావు తరిఫీదు క్రింద ఇతర నటులుకూడా వెనకటిమాదిరిగా కృత్రిమ నటన చెయ్యటం మాని సంభాషణలు నిర్దుష్టంగా అనటం నేర్చారు. ప్రేక్షకుల ప్రాణాని కీమార్పు హాయిగా వుంది.

మూడోరంగం జరుగుతుండగా విశ్వం ఒక్కక్షణంపాటు శాంత ఉన్నవేపు ఆమెను పోల్చాడు. ఆక్షణంనించీ అతనికళ్ళు అటే వెళ్ళసాగినై. సైడ్‌వింగ్స్‌లో నించి విశ్వాన్ని జాగ్రత్తగా గమనిస్తున్న భాస్కరానికి విశ్వం కంగారుపడు తున్నట్టు కనిపించింది. కారణం అర్థంకాలేదు.

స్టేజిమీద ఉన్నది విశ్వమేనని శాంతకు రూఢిఅయింది. ఆమెచప్పున లేచి బయటికి వచ్చేసింది. గేటుదగ్గిర వాడివ్వబోయిన అవుట్‌పాస్ కూడా ఆమె గమ నించలేదు. వెనకనుంచి ఎవరో తరుముతున్నట్లు శాంత స్టేజివేపు పరుగెత్తి లోపలికి దారి తెలియక అటూ ఇటూ తారట్లాడసాగింది.

"నాదగ్గిరికి వస్తావేం, ఫూల్! స్టేజిమధ్యకు పో!" అని భాస్కరం విశ్వాన్ని కసిరాడు.

"శాంత స్టేజిలోకి వస్తున్నది....వెళ్ళి తీసుకురా!" అన్నాడు విశ్వం వెంటనే స్టేజిమీదకు వెళ్ళిపోతూ.

మొదట్లో భాస్కరానికేమీ అర్థంకాలేదు. కాని మనస్సులో తడువుకుంటూ అతను స్టేజిబయటికివచ్చి శాంతనుచూసి "హల్లో!" అన్నాడు.

"మీరుకూడా ఉన్నారే!" అన్నది శాంత, సంతోషంతో దగ్గిరికివచ్చి.

"అవును. నువిక్కడెందుకున్నావమ్మా? నీకు రెండుత్తరాలురాసి సమాధానం రాక మమ్మల్ని మరిచిపోయినావనుకున్నాం" అన్నాడు భాస్కరం.

"చాలాకథ ఉంది... ఆ వేషం వేసింది విశ్వంగారేనా?"

"ఆ! గుర్తించలా? వాడే చెప్పాడు నువు వచ్చావని! లోపలికి రా."

శాంత లోపలికి వెళ్లేటప్పటికి ఆ రంగం పూర్తిఅయిపోయింది. విశ్వం ఇవతలికి వచ్చేశాడు. శాంత కనిపించటమే వ్యవధిగా ఆమెతో లక్ష మాటలు మాటలాడదామనుకుంటున్న విశ్వం ఆమెను తీరా చూసేటప్పటికి 'హలో!' అనిమాత్రం అనగలిగాడు. ఆ రెండక్షరాలయినా గొంతులో అతుక్కుని బల వంతానగానీ ఊడిరాలేదు.

భాస్కరం గడియారం చూసి "ఒరె, నీకు సరిగా పదిహేను నిమిషాల టైముంది వేషం మార్చుకోటానికి. అంతసేపూ మీరిద్దరూ స్పెషల్ రూములో కూర్చుని మాటలాడుక్కోవచ్చు. నువుమాత్రం కాలయాపన చెయ్యక వేషం

మార్చుకో"—అంటూ తెర ఎత్తించబోయినాడు. శాంత దగ్గిరకూడా అనుజ్ఞ పుచ్చుకుని.

గదిలో అడుగుపెడుతూనే విశ్వం శాంత చెయ్యిపట్టుకుని 'శాంతా! ఇంత కాలం ఉత్తరాలెందుకు రాయలేదు?' అన్నాడు. శాంత సమాధానం చెప్పే లోపుగా అతను కళ్లు పెద్దవిచేసి ఆశ్చర్యంతో "నా కెంత సాహసం వచ్చిందీ!'' అన్నాడు.

''ఏం?" అన్నది శాంత నవ్వుతూ. మొహానికి రంగేసుకుని అతను భావ ప్రకటన చేస్తుంటే అదికూడా నటనమాదిరిగానే ఉంది

నిగ్రహించుకునే లోపల శాంత కళ్లవెంట నీళ్లు వచ్చేసినై. నాగభూషణం తనను కోరేటంత చులకనగాచూసే తనను, విశ్వం చెయ్యిపట్టుకోడానికీ, 'శాంతా' అని నోరారా పిలవటానికీ క్షమాపణ చెప్పుకోవాలా? ఏమిటీ అన్యాయం?

కళ్ళనీళ్లు కనిపించకుండా తల పక్కకు తిప్పుకుని శాంత "నా కథంతా తీరిగ్గా చెబుతాను, ముందు మీరెట్లా ఉన్నారో చెప్పండి!" అన్నది.

"నే నీ లోపల కొత్తజ్ఞానం సంపాదించాను!" అన్నాడు విశ్వం వేషం మార్చుకోవటానికి కూర్చుంటూ.

"ఏమిటది?"

''లోకంలో నాకు ఒక్కత్తె అడదున్నది అనే విశ్వాసం కుదిరినవాడు పాపాత్ముడు. వాడు సుఖపడడు!" అన్నాడు విశ్వం, అద్దంలోకి చూసి విగ్గు తీసేస్తూ.

"ఇట్లా చూడండి!'' అన్నది శాంత. విశ్వం చూశాడు. ఆమె అతని మొహమంతా తన చూపులతో తడువుతున్నది.

"ఏమిటి?" అన్నాడు విశ్వం. ఆనందంతోనే కాస్త కంగారుపడుతూ.

"ఏమీలేదు. మీరిప్పు డన్నమాట వేషం విప్పేసిన తరవాత మళ్ళీ ఒక్కసారి అంటే మీ మొహంవంక చూద్దామని!'' అన్నది శాంత.

* * *

నాటకం ప్రేక్షకులకు రుచించక పోతుందని భాస్కరం ఒక్కనాటికీ సందేహించలేదు కానీ, ప్రేక్షకులు ఇంత ఉబ్బి తబ్బిబ్బులవుతారని కూడా అతను భావించి ఉండలేదు.

"మొత్తానికి సాధించావురా" అని రాఘవయ్యగారు అతనితో అన్నప్పుడు భాస్కరం "నా నమ్మకాలు సరిఅయినవని రుజువయింది. ఇదేం చూశావు.




రేపు నాలుగైదువేలు పెట్టుబడి పెట్టి నిజంగా చాతనయిన వాడిచేత వెయి రూపాయల విలువచేసే నాటకం రాయించి, మూడునెల్లు ప్రాక్టీసుచేసి, ఆడ వేషాలు ఆడవాళ్ళచేత వేయించి, ఫస్టుక్లాసయిన లైటింగూ అవీ ఏర్పాటుచేసి మనం నాటకాలాడుతుంటే, అప్పుడు చూడు నా తడాఖా." అన్నాడు.

నాటకాంతాన బయలుదేరే అల్లరిలో మామా అల్లుళ్లీవిధంగా మాట్లాడు కుంటుంటే, మరోమూల స్పెషల్ రూములో శాంతా విశ్వమూ వాళ్లప్రపంచంలో వాళ్లున్నారు. ఆ క్షణాన వాళ్ళు ప్రణయం నడపక పోయినప్పటికీ కొత్తగా వచ్చిన పరిణయం వాళ్లకొక కృత్రిమమైన బాల్యమూ దాని వెంట వచ్చే అమాయకమైన ఆనందమూ ఇచ్చింది.

ఇంకోమూల శాంతకోసం వెతుకుతున్న నాగభూషణానికి అనసూయ మాత్రమే దొరికింది. ఆమెను సమీపించి, శాంత ఏదని అడిగి, 'ఏమో, ఆట మధ్య ఎటో వెళ్లింది' అని సమాధానం తెచ్చుకొని కంగారుతో ఆయన అటూ ఇటూ చూస్తుండగా ఇంతలో శాంతను వెంటబెట్టుకొని విశ్వమూ, భాస్కరమూ వచ్చేశారు.

శాంత మొహంలో కొత్త కళ గమనించాడు నాగభూషణం. ఆమె మాత్రం నాగభూషణంలో కలిగిన మార్పు గమనించినట్టులేదు. గబగబా ఆయనదగ్గిరికి

పరిగెత్తుకుంటూవచ్చి, "ఏమండీ, చేర్మనుగారూ, వీళ్లిద్దరూ నా స్నేహితులు. ఇవాళ వీళ్లవెంట వెళతాను మేమూ మేమూ చాలా విషయాలు మాట్లాడు కోవాలి!'' అన్నది.

నాగభూషణం మాట్లాడలేదు. ఆయన మౌనం పూర్ణాంగీకారంకింద తీసుకుని శాంత తన స్నేహితులతో ప్రయాణమయింది.

ముగ్గురూ కలిసి భాస్కరం మేనమామ గారింటికి బండి చేయించుకున్నారు. బండిలో భాస్కరం "ముసలాడు నిన్నెరిగుండే మాటమాత్రం మాతో నీ విషయం అనకుండా దాచాడన్నమాట" అన్నాడు.

"మీరు నన్నెరుగుదురని, పాపం ఆయనకేం తెలుసు?" అంది శాంత ఆ క్షణాన ఆమె తన పినతండ్రినికూడా 'పాపం' అనే స్థితిలో ఉంది.

"నీ కాయనతో ఎట్లా పరిచయం?" అన్నాడు భాస్కరం.

"నేను వాళ్ళ పిల్లలకు పాఠాలు చెబుతున్నాను."

"అదేమిటి?" అన్నాడు విశ్వం బిత్తరపోయి.

"కూలిడబ్బులకు కాదు; సరదాకు."

''అసలీ వూరెప్పుడు చేరావు?'' అన్నాడు భాస్కరం.

"పదిరోజు లయింది. మా బాబాయిగారింట్లో నన్ను సరిగా చూడలేదు. అందుకని అక్కడ సెలవు పుచ్చుకుని మా పినతల్లిగారి ఇంటికి వచ్చేశాను."

"ఆవిడెవరు?''

"మీరు చూడలేదా ఏమిటి? నాటకానికి వచ్చిందే! మనం మాట్లాడుతున్నప్పు డక్కడే ఉంది."

"అయితే మరి ఆవిడ అనుజ్ఞ తీసుకోలేదే మనం?'' అన్నాడు విశ్వం.

"దేనికి?'' అన్నది శాంత.

"నిన్ను మావెంట తీసుకురావటానికి!"

"అదంతా ఏమీ లేదు. నేనేంచేసినా మా పిన్ని కభ్యంతరం లేదు" అన్నది శాంత, అది ఆధారం చేసుకుని అడ్డమైన పన్లన్నీ చేస్తున్నదానల్లే.

"వాళ్ళింటికి చేరేటప్పటికి ఒంటిగంట అయింది మూడింటిదాకా కబుర్లు చెప్పుకున్నారు. అప్పటికి భాస్కరం మాట్లాడుతూ మాట్లాడుతూనే నిద్దరకు పడ్డాడు.

''ఇక మనంకూడా పడుకుందాం!'' అన్నాడు విశ్వం. కాని అతనికి నిద్ర పట్టలేదు. నాలుగుకూడా కొట్టింది గడియారం. కళ్లుమూసుకు పడుకున్నాడు.

అలిసిపోయిన అతని శరీరమంతా సీసంపోసినట్టు మొద్దుబారిపోయినా అతని తలలో యంత్రాలు పనిచేస్తూనే ఉన్నై.

ఇంతలో శాంత కదలటం గమనించాడు విశ్వం. ఆమె మెల్లిగా మచంమీది నించిలేచి బయటకి వెళ్ళి వరండాలో వెన్నెలలో నిలబడ్డది. విశ్వం కూడా లేచాడు.

"మీకూ్కడా నిద్రపట్టలేదా?" అన్నది శాంత అతను దగ్గిరికి వచ్చిన తరవాత.

"పట్టలేదు శాంతా! నాలో పిచ్చివాడి లక్షణా లేమన్నా గమనించావా?"

"ఏం?" అన్నది శాంత నవ్వుతూ.

"నా మనస్సు సరిగాలేదు. ఇంకోసారి, ఇందాకా వచ్చినటువంటి సాహసం వస్తే నేనేం చేస్తానో తెలీదు. నన్ను కొంచెం తప్పించుకుని తిరుగుతూ ఉండు–ఎటుపోయి ఎటువచ్చినా మంచిది."

"తప్పించుకుని తిరిగితే మీ సాహసం ఏమిటో ఎట్లా చూస్తానూ?" అన్నది శాంత కొంటెగా.

మారు మాట్లాడకుండా శాంతను దగ్గిరికి లాకు్కన్నాడు విశ్వం, ఇద్దరూ వొణికిపోతున్నారు. ఎవరికీ ఏం చెయ్యటానికీ సాహసంలేదు.

"శాంతా. నేనంతగా చెప్పానుకదా, మీ బాబాయిగారింట్లో ఉండటం నీకు కష్టమయితే నాకెందుకు తెలియజెయ్యలేదు?" అన్నాడు విశ్వం.

"నేను మీకు రాశాను. జవాబులేదు."

"అన్నట్టు మరచిపోయాను. ఒకళ్ల ఉత్తరాలు ఒకళ్ళ కందలేదు. నీ సంగతంతా చెబుతానన్నావు, చెప్పవూ?"

"బండిలో చెబితినే!" అన్నది శాంత.

"అంతేనా కథంతా?"

"స్థూలంగా అంతే."

"సూక్ష్మంగా చెప్పవూ?

"పోనివ్వండి, ఆ పీడంతా ఇప్పుడెందుకు? ఈ వెన్నెల చూడండి. ఎట్లా ఉందో!"

శాంత చంద్రుడికేసి చూస్తూండటం ఆధారం చేసుకుని విశ్వం ఆమె చెంప విరికిగా ముద్దు పెట్టుకున్నాడు.

"ఇక ముందెప్పుడూ నాకు కనిపించకుండా పోనని ప్రమాణం చెయ్యి శాంతా!''

"పోవలసి వస్తే?"

"రాదు. నేను నిన్ను పెళ్ళాడబోతున్నాను."

"ఈ సంగతి నాకు తెలియదే!'' అన్నది శాంత.

''అవును. సమయం వచ్చినప్పుడు నేనే చెప్పుదామనుకుంటున్నాను. ఇక నీకోసం బాధపడ దలచలేదు. నిన్ను చూస్తూ ఉండటానికీ, నీతో మాట్లాడటానికీ మొహం వాచిపోవటం నాకే బాగుండలేదు. అయితే నువు నన్ను సేవకుడి కింద ఆమోదిస్తావని నేను కలలోకూడా అనుకోలేదు......నిజంగా నేనంటే నీ కేమాత్రం గురి అయినా ఉందా? లేక నన్నిట్లా కొంతసేపు వాగనిచ్చి 'ఎవడ్రా నువ్వు' అంటావా? ఇదంతా నిజమని నేను నమ్మలేకుండా ఉన్నాను."

"కల అయితేమాత్రం అభ్యంతర మేమిటి? అందమైన కల కంటూ ఇది నిజం కాదేమోనని ఎవరన్నా దిగులుపడతారా?" అన్నది శాంత.

కొంచెంసేపు మాట్లాడకుండా ఊరుకుని విశ్వం, "ఇట్లా నాతో మాట్లాడగలిగి ఉండికూడా గడిచిన పదిహేను రోజుల్లో నన్నంతబాధ ఎట్లాపెట్టగలిగావో నాకర్థం కావటంలేదు" అన్నాడు.

* * *

నాలుగైదురోజులు గడిచినై. మళ్ళీ శాంత నాగభూషణం కళ్ళబడిన పాపాన పోలేదు.

నాటకమైన మర్నాడు ఉదయం తొమ్మిదిగంటలప్పుడు శాంత పినతల్లి గారింటికి వచ్చి స్నానంచేసి ఇంకోచీరె కట్టుకుని చేతిపెట్టె సర్దుకోసాగింది. ఆ సమయంలో అనసూయ హఠాత్తుగా శాంతతో, "ఆ ఇద్దర్లో ఎవరు?" అంది.

''ఏమి టెవరు?'' అన్నది శాంత.

"నీ ముఖ్యస్నేహితుడు."

"ఇద్దరూ ముఖ్యస్నేహితులే."

కొంచెం ఆగి అనసూయ, ''ప్రయాణమల్లే ఉందే?" అన్నది.

"అవును."

"ఎక్కడికి? మళ్ళీ ఎప్పుడు తిరిగివస్తావు?"

"నాకు బాగాతెలీదు. మళ్ళీ ఒకవారం రోజుల్లో నాటకం వేస్తారుట. ఈ లోపుగా తిరిగివస్తాను."




''వెళ్ళేలోపుగా నాగభూషణం గారింటి కేమైనా వెళతావా?"

''టైము లేదు. ఒకవేళ ఆయన వస్తే ఊరికి వెళ్ళానని చెప్పు."

మళ్ళీ నాలుగురోజులదాకా శాంత ఏమయిందో నాగభూషణంగారికిగాని, అనసూయకుగాని అంతుచిక్కలేదు. నాగభూషణంగారు ప్రతిపూటాఅనసూయ దగ్గరికి వచ్చి శాంత విషయం అడిగి ఒకటిరెండు గంటలుకూర్చుని తనగోడవ యావత్తూ చెప్పుకుని వెళుతున్నారు. ఆయనలో అనసూయ నిస్పృహ కనిపెట్టి ప్రోత్సాహం ఇచ్చింది.

"ఇంత అనుభవం ఉన్న మీతో కుర్రవాళ్లు పోటీకి రావటమేమిటి? మీ రసికత్వం ఏమయింది?" అన్నది అనసూయ ఆయనతో.

"శాంత వయసు పిల్లకు రసికత్వమూ బంకలూ ఏంతెలుస్తుంది? తన ఈడువాళ్లయితే తన కేదో ఒరిగిస్తారనుకుంటుంది!" అన్నాడు భూషణం.

"మరేంలేదుగాని ఎందునా కాకుండా చెడుతుందేమో అమాయికపు పిల్ల అని నా ఏడుపు. వాళ్లిద్దరూ దీన్నిట్లాగే కొంతకాలం తిప్పినట్టేప ముంచుతారని నా అనుమానం దీన్ని పెళ్ళాడేదాకా వాళ్లకేం ఖర్మం? ఒకవేళ వాళ్లు పెళ్ళాడతామన్నా, వాళ్ల పెద్దవాళ్లు మక్కెలు విరగగొట్టరా?...అసలు పెళ్ళాడే ఆలోచనే ఉంటే ఒకతెవెంట ఇద్దరు పడతారా? నాకుమాత్రం శాంత తన గొయ్యి తానే తవ్వుకుంటున్నదని భయంగా ఉంది" అన్నది అనసూయ.

"తన ఇష్టంవచ్చినట్టు చేసుకోనీ. నాకేం? కాని నాతో మాటమాత్రం అన రాదా? నేను పెళ్లిచేసుకుంటానని అడిగినప్పుడు నా కేమాటా చెప్పకుండా ఇంకోరివెంట వెళ్ళిపోవటం ధర్మంకాదు. నేను తనమీద చూపించిన ఆదరానికి నన్నిట్లాగేనా చెయ్యటం?" అన్నాడు నాగభూషణం.

ఈ విధంగా ఒకరిమాటలు ఒకరికి పొందకుండా మాట్లాడుకునేవాళ్లు నాగభూషణమూ, అనసూయా.

ఈలోపుగా శాంత, విశ్వమూ తమ ప్రణయానికి దాదాపు శరీరం ఏమీ లేకుండా అంతా కవిత్వం అన్నట్టు ప్రవర్తిస్తున్నారు. ఒకరినోట వచ్చే మాటలు మరొకరికి కవిత్వం మాదిరిగానే ఉండేది. ప్రేమ వాళ్ల చుట్టూ దట్టంగా సాంబ్రాణి పొగలాగా చుట్టేసుకుని బాహ్యప్రపంచం కనిపించకుండా, బయటి వాసనలు సమీపానికి రాకుండా, పీల్చిన ప్రతి ఊపిరితోనూ తన సువాసన నసాళాని కంటుతూ ఉంది. ఇంకొకతె అయిఉంటే తన కింత పరిపూర్ణమైన తృప్తి ఇచ్చి ఉండకపోనని విశ్వమూ, మరొకడయితే తన మనసులో రోజుకు వందసార్లు చిన్న చిన్న అనుమానాలు కలిగించి ఉండునని శాంతా గట్టిగా నమ్మారు.

శాంత స్వతహాగా ఉద్రేక స్వభావం కలదికాదు. ఉద్రేకం మనిషియొక్క ప్రవర్తనలో అందం లేకుండా చేస్తుందని ఆమె నమ్మకం. ఆ విషయాన్ని ఇతరులు ఆమె ఎదుట అనేకసార్లు రుజువుచేశారు. ఆమె ప్రేమను కూడా ఉద్రేకరహితంగానే ఊహించుకుని ఉండింది. అలాంటి శాంత విశ్వం విషయంలో పూర్తిగా మారిపోయింది. తనూ విశ్వమూ ఒంటరిగా ఉన్నప్పుడు శాంత అతన్ని అమితగాఢంగా ఆలింగనం చేసుకుని "నా చేతుల కింకా పదింతలు బలం పెట్టగూడదూ?" అని పళ్లు బిగబట్టి అడిగేది. అతని చెవిలో నోరుపెట్టి. "విస్సీ, దొంగముండా!" అనేది. "ఇటువంటి కోతివేషాలు చూస్తే మీ కసహ్యం పుట్టదంలే నామీద?" అని అడిగేది. అతనికి తనమీద అసహ్యం లేదనే నమ్మకంతోనే.

విశ్వం నవ్వి, "భాస్కరంగాడు కూడా ఉన్నప్పుడు నిన్ను చూస్తే మాత్రం నవ్వొస్తుంది. ఏమీ ఎరగని అమాయకురాలల్లే!" అనేవాడు.

ప్రణయంలో ఎప్పుడూ ఒకరిస్తారు. ఇంకోరు స్వీకరిస్తారని ఎవరో అన్న మాట పూర్తిగా సత్యం కాకపోయినప్పటికి అందులో కొంత నిజం ఉన్నట్టు శాంత రుజువు చేసింది. ఈ ప్రణయం దాదాపు శాంత ప్రోత్సాహం మీదనే నడిచింది. ఒకసారి విశ్వం అన్నాడుకూడాను.

"అన్నిమాటలూ నువే అనేస్తావు! నేను వట్టి చవటనల్లే కనబడుతున్నాను. నా కళ్ళకే, ఇక నీ కెట్లా కనిపిస్తున్నానో!"

"ఇది నా ప్రణయకథ. ఇందులో మీకేమీ భాగంలేదు!" అనేది శాంత.

"చుక్కలుకూడా కనిపించని అమావాస్యనాటి చీకట్లో దైమెంత అయిందీ తెలీనట్టు, నువుచేసే గొడవలో నీ ప్రేమ ఎంతో తెలియటంలేదు నాకు" అనే వాడు విశ్వం.

"నాటకంలో మిమ్మల్ని చూసిన క్షణం మొదలు ఇప్పటివరకూ నా రోజులు మంచివి కావనే ఆలోచన నాకు రాలేదు" అని సమాధానం చెప్పేది శాంత గంభీరంగా.

"ఆ మాట జ్ఞాపకం పెట్టుకుని నా మునిమనమలకూ్కడా చెబుతాను!" అనేవాడు విశ్వం.

శాంత స్నేహితులతో పర్యటనం పూర్తిచేసి ఇంటికి రాగానే అనసూయ ఆమె ప్రవర్తనను గురించి కొంత చర్చించింది.

"నీకూ నీ స్నేహితులకూ నిజమైన సంబంధం ఏమిటి? నేను నిన్ను తప్పు పడుతున్నా ననుకోకమ్మా, నాకు కొంత అనుభవం ఉంది. అందుకని అడుగు తున్నాను," అన్నది అనసూయ.

"వేరే ఏమీ లేదు. వాళ్లు నా స్నేహితులు" అన్నది శాంత. తన ప్రేమ విషయం అనసూయ తెలుసుకోవలసిన అగత్యం ఉన్నట్టు శాంతకు తోచ లేదు.

"వాళ్లల్లో ఎవరన్నా నిన్ను పెళ్ళిచేసుకుంటారా?"

"ఏమో, నే నావిషయం ఆలోచించలేదు. నేను వాళ్ళవెంట తిరుగుతున్నది పెళ్ళికోసంకాదు."

"వాళ్ళిద్దరూ బ్రహ్మచార్లేనా?"

"అది కూడా నాకు తెలియదు."

"నీకు జన్మలో పెళ్లనేది లేకుండా చెయ్యగలరు నీ స్నేహితులు. ఆ సంగతి ఆలోచించావా? నీకూ వాళ్లకూ మధ్య ఏమీ లేకపోవచ్చు. కాని నువు వాళ్ళతో కొంతకాలం తిరిగినతర్వాత నిన్నెవరు పెళ్ళాడతారు? ఎల్లకాలమూ స్నేహితా లుంటాయా? రేపు వాళ్ల పెళ్లాలొస్తే వాళ్లు నీతో తిరుగుతారా? వాళ్ల పెళ్ళాలు తిరగనిస్తారా? కొంచెం జాగ్రత్తగా ఆలోచించు. ఎంత చెడ్డా నీ కన్నా పెద్దదాన్ని!"

అనసూయ తనకు అర్థంగాని విషయం అర్థమైనట్టు చర్చించటం శాంతకిష్టం లేదు. కాని అనసూయ దురుద్దేశంతో మాట్లాడటం లేదని ఆమె ఎరుగును. అందు కని లోపల ఇష్టంలేకపోయినా శాంత పినతల్లికి సమాధానం చెప్పింది: "పెళ్ల నేది నువ్వనుకున్నంత ముఖ్యంకాదు. ఈ స్నేహితాలు నువ్వన్నట్టు శాశ్వతం కాక పోతే వీటి స్థానే ఇంకేదో రాకపోదు."

"ఆ విషయం నీ యిష్టం. నేనేమీ అనను కాని, పాపం నాగభూషణంగారి మాటేమిటి? ఆయన్నెందుకు నడిసముద్రంలో వదిలేశావు?"

ఈ ప్రశ్న శాంతకు ఆశ్చర్యం కలిగించింది. అదివరకు అనసూయ నాగ భూషణం గురించి ఎత్తితే తన సమస్యగా తీసుకునే మాట్లాడిందిగాని ఆయన తరఫున మాట్లాడటం ఇదే మొదటిసారి. అనసూయ నాగభూషణం ప్రతినిధిగా పనిచేస్తున్నదా ఏమిటనే అనుమానం శాంత కిప్పుడే కలిగింది.

ఒక్కసారిగా శాంతకు వికారం కలిగింది. అసలీ నాగభూషణం ఎక్కడ దాపరించాడు? ఆయన తనను పెళ్లాడతా ననట మేమిటి? ఆయనకూ తన పిన తల్లికీ సంబంధం ఉండి ఉండడ మేమిటి? ఆవిడ ఆయన్ను తనకు కట్టబెట్ట టానికి ఇంత పన్నాగ మేమిటి? తలచుకొన్న కొద్దీ పినతల్లీ, ఆవిడ ఇల్లూ, ఆ వాతావరణమూ ఒకమురికిగుంటగా స్ఫురించింది శాంతకు.

"నాకు నాగభూషణంగారిని చేసుకోవాలని ఏ మాత్రమూ లేదు. ఆయన్ను చేసుకోవలసినంత కక్కుర్తి కూడా లేదు. ఆయనతో ఆ మాట చెప్పేస్తాను" అన్నది శాంత.

"నీ క్షేమం నీకు తెలియకుండా ఉంది. నీ కింతకన్న మంచివాడు దొర కడు" అన్నది అనసూయ.

"అంతకన్న చాలారెట్లు మంచివాడు దొరికాడు! నన్ను గురించి నీ కంత తక్కువ అభిప్రాయం ఎందు కేర్పడ్డదో నా కర్థం కాకుండా ఉంది."

"ఎవరది?" అని అడిగింది అనసూయ.

"విశ్వనాథం. మొన్న నాటకంలో వేషం వేసినవాడు."

"నువ్వెవరో అతనికి తెలుసునా?"

"ఏమో! నేనడగలేదు. తెలిసే ఉంటుంది. ఇందులో రహస్యమేముంది?"

"నిన్ను పెళ్లాడతా నన్నాడా?"

"అధమం నన్ను ఉంచుకోకపోడు!" అన్నది శాంత, లోలోపల ప్రజ్వ లిస్తున్న కోపాన్ని అణచుకోలేకుండా.

ఆ పైన అనసూయ మాట్లాడలేదు. శాంత తన గదిలోకి వెళ్లి తలుపు వేసుకుంది. మరొక అయిదు నిమిషాల్లో అనసూయ తలుపుదగ్గిరికి వచ్చి, ''అమ్మాయి, నీ కోసం నాగభూషణంగారు వచ్చారే!'' అని కేకవేసింది.

''ఇప్పుడు పనిమీద ఉన్నాను. నాకింకా రేపటిదాకా గడువుందని ఆయనతో చెప్పు!'' అని జవాబు చెప్పించింది శాంత.

నాగభూషణాన్ని కూర్చోబెట్టి అనసూయ శాంతవైఖరి విశదీకరించింది.

నిస్పృహతో ఆయన ''నేను మొదటినుంచీ అనుమానపడుతూనే ఉన్నాను. ఈ వయసులో నాకా పిల్లమీద మనసుపోవటం నా ప్రారబ్ధం. ఆమె తప్పేమీ లేదు.'' అన్నాడు తాత్కాలికంగా ఆత్మవికాసం కలిగి.

''మీరట్లా అధైర్యపడకండి. ఆ విశ్వనాథం దీన్ని నట్టేట్లో ముంచే బాపతే. ఇది ఎవరో అత నెరుగడు, అతనెవరో ఇది ఎరగదు. అతనికి పెళ్లయిందో లేదో కూడా ఇది ఎరగదు. అతను మాత్రం దీన్ని పెళ్లిచేసుకుంటా ననలేదు. దీన్ని అతనిబారినించి తప్పించేటందుకైనా మీరేదో ఒకటి చెయ్యాలి, తప్పదు'' అన్నది అనసూయ.

''ఈ వ్యవహారం ఎంతకాలంనించీ నడుస్తున్నదో కనుక్కున్నావా?''

''ఎబ్బె. ఎంతో ఏదీ? మొన్ననాటకంనాడే మొదలు. అదివరకు నే నడిగితే తనకు స్నేహితు లెవరూ లేరన్నది. మిమ్మల్ని పెళ్ళిచేసుకొనటాని క్కూడా దాదాపు ఒప్పుకుంది. అప్పటి కీపిచ్చి లేదు.''

''కాని అతన్ని శాంత అదివరకే ఎరిగి ఉండాలి!''

''అదంతా నాకు తెలియదు. దీనికీ పిచ్చి పుట్టటానికి ఇదే మొదలు. మీరు త్వరగా ఏదన్నా చెయ్యండి.'' నాగభూషణం కొంచెం ఆలోచించి, ''అతన్ని కంపెనీలోనించి తీసేయిస్తాను. తరవాత శాంత నన్ను పెళ్ళిచేసుకున్నా మానినా ఆ పిల్ల మంచికోసమన్నా ఈ ఊరునుంచి సాగనంపుతాను'' అన్నాడు.

''ఆ పని చెయ్యండి. పీడ వదలిపోతుంది!'' అన్నది అనసూయ.

* * * *

నాగభూషణంగారికి కాలు నిలవటంలేదు. ఆయన రాఘవయ్యతో విశ్వాన్ని సాగనంపటం గురించి మాట్లాడాడు ఆ సాయంకాలమే.

''ఎల్లుండి నాటకం పెట్టుకొని ఇవాళ అతన్ని పంపించెయ్యట మేమిటి? అయినా ఏంవచ్చింది? అతనితో మనకు బోలెడంత పనిఉంది'' అన్నాడు రాఘవయ్య.

''నేను నిన్ను కంపెనీ విషయాల్లో ఎన్నడూ ఏమీ కోరి ఎరగను. ఈ ఒక్క పనీ చెయ్యి. నన్ను కారణా లడక్కు. నీవంటి పెద్దమనిషి వినదగిన కారణాలు కావు."

"నీ యిష్టం" అన్నాడు రాఘవయ్య.

అక్కడినించి నాగభూషణంగారు నేరుగా అనసూయ ఇంటికి వచ్చేశారు. సమయానికి సావిట్లో ఉండడంవల్ల శాంత ఆయన్ను తప్పించుకోలేక పోయింది. గడచిన వారంరోజుల్లోనూ ఆయన ముసలితనం మూడింతలయినట్టు కనిపించింది శాంతకు. ఆ మార్పు ఆయనలో కలిగిందో, తనలోనే కలిగిందో ఆమె తెలుసుకోలేకపోయింది.

"నీ గడు వింకా రేపటిదాకా ఉన్నప్పటికీ నా ఆత్రంకొద్దీ అడుగుతున్నాను. నేనడిగిన విషయం ఏంచేశావు? నువు చెప్పబొయ్యేది నేను ఊహించానుగాని నీ నోటిమీదిగా వింటే నాకు తృప్తిగా ఉంటుంది!" అన్నాడు నాగభూషణం.

ఆయన అసహాయస్థితి చూస్తే శాంతకు జాలివేసింది. ఆ యీడున ఆయనకు తనమీద భ్రమ కలగడం ఆయనలో ఒక క్షమించరాని దోషంగా ఆమెకు కనివించలేదు, జాలిపడదగిన దౌర్బల్యమనిపించింది.

"నామీద ఆశ వదులుకోండి. నామనస్సింకొకరికి ఇచ్చేశాను. నన్ను పెళ్ళాడి మీరేం సుఖపడతారు? మీరు నన్నా ప్రశ్న వెయ్యకుండా ఉంటే మన ఇద్దరికీ ఎంత సుఖంగా ఉండేది! నాకు నిజంగా మీరంటే చాలా అభిమానం ఉంది. కాని నన్ను కోరి మీరు నాకు చాలా కోపం కూడా తెప్పించారు'' అన్నది శాంత ఎంతో సౌజన్యంతో.

"అటువంటప్పుడు నన్ను మొదటనే నిరుత్సాహపరచలేక పోయావా?"

''అది నాతప్పే. క్షమించండి, కాని నేనీమధ్య అడ్డమైన కష్టాలూ పడి అభిమానం కూడా పోగొట్టుకుని మతిచెడి ఉన్నాను. మీకోరిక సక్రమమైనది కాదని అనటానికి ధైర్యం చాలకపోయింది.''

నాగభూషణం రెండునిమిషాల పాటేమీ అనలేదు. ఆఖరు కాయన లేస్తూ, ''నీకనవసరంగా శ్రమ ఇచ్చాను. ఈ విషయం మళ్ళీ ఎత్తను. కాని ఏ కారణం చేతనైనా నువ్వు అభిప్రాయం మార్చుకుంటే నాతో వచ్చి చెప్పు! నాకన్న మంచిభర్త దొరకనిపక్షాన ఏనాడైనా నిన్ను పెళ్ళాడటానికి నేను సిద్ధమే. ఈలోపుగా నేను మరొకర్ని పెళ్ళాడబొయ్యేది లేదు. నిన్ను చూసినమీదటే నాకీ పెళ్ళి ఆలోచనంటూ వచ్చింది. పోయి వస్తాను" అని సెలవు పుచ్చుకున్నాడు.

మర్నాడుదయం శాంత ఉత్సాహంతో నిద్రలేచింది. తన ఉత్సాహానికి కారణమేమిటో శాంత కనుక్కోలేదు. నిజానికి నాగభూషణాన్ని గురించిన దిగులు ఆమె నెంతగా వేధించి ఉంకింది. అది పరిష్కారం కావటం తన హృదయభారాన్ని ఎంతగా తగ్గించిందీ ఆమెకే తెలియదు. శాంత మొహం కడుక్కొని కాఫీ తాగి గదిలో పాడుతూ కూర్చున్నది.

అప్పుడే విశ్వం లాడ్జిదొడ్డిగుమ్మం దగ్గిర నిలబడి ఏదో ఆలోచిస్తూండగా శాంత తన గదిలో పాడుతున్న పాట వినిపించింది. మొదట అతనా పాటను శ్రద్ధగా వినలేదుగాని క్రమంగా అది అతని ఆలోచనను పక్కకు నెట్టేసి, ఆకర్షించింది.

"మంచిగొంతు!" అనుకున్నాడు విశ్వం. "తగుమాత్రం పలుకుతుంది కూడాను! ఆమాత్రం పాట చాలు స్టేజిమీదికి!"

విశ్వం నౌకరును పిలిచి, "ఆ ఇల్లెవరిదిరా?" అని అడిగాడు.

"ఎవరో సానివాళ్ళదయ్యా!" అన్నాడు నౌకరు.

"నీకు నమ్మకంగా తెలుసా?" అన్నాడు విశ్వం.

నౌకరు దగ్గిరికొచ్చి రహస్యంగా, "ఆమనిషిని మన చేర్మనుగారుంచు కున్నారు!" అన్నాడు.

"ఆ పాడేది ఆ మనిషేగా?"

"ఆ మనిషి పాటసానిగాదు —"

విశ్వం ఇక వినలేదు మిగిలినవాళ్ళంతా రావటాని కింకా గంట పట్టినా పట్టవచ్చు. ఈ లోపల వెళ్లి ఆమనిషిసంగతి తేల్చుకొంస్తే! వీలయితే ఆమెను ఏదోకాడికి కంపెనీలో చేర్చవచ్చు. బోగందికూడా కనకా పేచీలూ పాడూ ఉండవు!

విశ్వం చుట్టూ తిరిగి అనసూయ ఇంటిచాయలకు వచ్చి, దారేపొయ్యేవాణ్ణి ఎవర్నో నిలవేసి "ఈ మేడ ఎవరిది?" అని అడిగాడు.

"బోగమాళ్ళది!" అని విశ్వాన్ని ఎగాదిగాచూసి ఆ మనిషి వెళ్లిపోయాడు.

ఇక వేరో ఆలోచన లేకుండా విశ్వం ఇంటో జొరబడ్డాడు. అతను హాలులో అడుగుపెట్టటం వ్యవధిగా శాంత మేడమెట్లు దిగి రాసాగింది.

"శాంతా!" అన్నాడు విశ్వం సంతోషంలేని పొడి ఆశ్చర్యంతో.

శాంతమటుకు సంతోషంతో, "మీకు మాయిల్లెట్లా తెలిసిందీ? రండి, రండి!" అన్నది.

"ఇది మీ ఇల్లా ?" అన్నాడు విశ్వం నమ్మలేకుండా.

"మా పినతల్లి ఇల్లు!" అన్నది శాంత అతని ఆశ్చర్యం అర్థంకాక.

"భోగంవాళ్ళ ఇల్లని చెప్పారే!" అన్నాడు విశ్వం. తన నెవరో వంచించినట్టు.

"అవును. మా పినతల్లి భోగం మనిషే!" అన్నది శాంత చురుకుగా. అతని ఆశ్చర్యం ఆమె కిప్పు డర్థమయింది. తన సంగతి అత నెరగడు. ఇప్పుడే తెలిసింది. అతని మొహాన్ని శాంత వెయ్యికళ్ళతో పరీక్షిస్తున్నది.

"మరి నువ్వు-నువ్వు-" అన్నాడు విశ్వం.

"నేను భోగందాన్నే, మానాన్న బ్రాహ్మణుడు. మా అమ్మ భోగంది."

"ఈ సంగతి నాతో ఎందుకు చెప్పలేదూ?" అన్నాడు విశ్వం. ఆకాశం విరిగి మీదపడ్డట్టు.

"పోనివ్వండి! ఇప్పటికన్నా తెలుసుకున్నారు" అన్నది శాంత కఠినంగా. ఆమెకు లోపల మళ్ళీ అగ్నిహోత్రం పుట్టుకొస్తున్నది.

విశ్వం మాట్లాడలేదు. అతను ఆమెవంక చూడనన్నా చూడకపోయినాడు. శాంత లేనిశాంతం తెచ్చిపెట్టుకుని "మీ బాధ నాకర్థమయింది. మీరిక వెళ్ళిపోవచ్చును. నన్ను చూడటానికి మీరు ఎటువంటి ప్రయత్నమూ చెయ్యనక్కర లేదు" అన్నది.

పిచ్చివాడల్లే తను ఏం చేస్తున్నదీ తనకే తెలీనట్టుగా విశ్వం బయటికొచ్చాడు. అతను వీధినపడి కొంత దూరం నడిచిన తరవాతగాని అతనికి జ్ఞానోదయం కలగలేదు. తన గొడవలో అసలుసంగతి—శాంతను వేషం వెయ్యటం గురించి అడగటం-మరిచాడు. ఆమె వేశ్య అన్న విషయం తను తాపీగా జీర్ణంచేసుకో వచ్చు. ముందు ఆమెను నాటకంలోకి తీసుకోవటం కంపెనీకి ముఖ్యం.

విశ్వం మళ్ళీలోపలికి వచ్చాడు. అతడు వెళ్ళాడన్న నమ్మకంతో తీరికగా కళ్ల నీళ్ళు పెట్టుకుంటున్న శాంత మళ్లీ పులివేషం ధరించవలసి వచ్చింది.

"అసలు వచ్చినపని మరిచాను-నువు మానాటకాల్లో వేషం వేస్తావా?" అన్నాడు విశ్వం. ఆ ప్రశ్న అతని చెవులకే హాస్యాస్పదంగా కనిపించింది.

"మీ నాటకాలకు ఆమడదూరంలో ఉండటాని క్కూడా నా కిష్టంలేదు. మీరు దయచేసి వెళ్లిపోండి!" అన్నది శాంత. తను తన రహస్యం కావాలని దాచినట్టు అతను పడిన అభిప్రాయం ఆమె హృదయంలో బల్లెంమాదిరిగా గుచ్చుకుంది.



విశ్వం వెళ్ళిపోగానే శాంతకు కొంచెం కోపం తగ్గింది. అతను వెళ్ళేటప్పుడు శాంతకు కనిపించిన అతనివీపు ఆమెను విచిత్రంగా కరిగించసాగింది. కాని ఈ సారి శాంత తన హృదయానికి లొంగదలచలేదు. ఆ హృదయంలో ఆమెకు విశ్వాసం కలుగలేదు.

కాస్సేపు వడవడిగా అటూఇటూ పచారుచేసి ఆఖడుకు లోపల ఉన్న అనసూయ దగ్గిరికివెళ్లి "పిన్నీ! చేర్మను గారింటికెళుతున్నాను. ఆయన్ని పెళ్లాడటానికి నిశ్చయించాను. నీవుకూడా నావెంట వస్తావా?" అన్నది.

"పిచ్చిదానా, నేనుకూడా దేనికి నీవెంట? పానకంలో పుడకల్లే!" అని అనసూయ సమాధానం చెప్పింది.

పానకంలో పుడక అనేమాట శాంతచెవులకు అపస్వరంగా ధ్వనించింది. తను నాగభూషణం భార్య కావటంలో పానకం ఏముంది! అసలు జీవితంలో పానకం అనేది ఎక్కడుంది? ఆ బట్టతలవాడు తన ప్రియుడన్నట్టు అనసూయ ఇంకెంతకాలం నటిస్తుంది?

చెప్పులు తొడుక్కుని శాంత బయటకి వచ్చి బండికోసం చూస్తూ నిలబడింది. ఆమెకు అకస్మాత్తుగా భాస్కరం జ్ఞాపకం వచ్చాడు. విశ్వంతో విరోధం

అతనికికూడా వర్తించాలా, వద్దా? వాళ్లిద్దరిదీ ఒకటే ప్రాణంకదా. నాకున్న దల్లా ఒక్క భాస్కరమే. ఇంకో స్నేహితుడు లేడు,' అని విశ్వం ఒకసారి అన్నాడు. 'నీకు ప్రపంచంలో ఇంకెవరూ లేరనిపించినప్పుడు నేనొకణ్ణి ఉన్నానని మరవకు' అని చెప్పిన విశ్వం కాదూ. 'విశ్వంగారూ, నాకీక్షణాన ఎవరూ స్నేహితులు లేరు. మీ రేమంటారు?...ఏమంటారు? 'నీలో బోగంరక్తం ఉంది, వెళ్లి ఎందులోనన్నా దూకు' అంటారు!' పాపం, భాస్కరం ఏ పాపమూ ఎరగడు. విశ్వంమూలంగా అతనితో విరోధం పెట్టుకోవటం అన్యాయం!

అకస్మాత్తుగా శాంత కళ్లవెంట నీళ్లు పొర్లివచ్చినై. భాస్కరం జ్ఞాపకం రావటంవల్ల కాదు. విశ్వం అన్న మాటలన్నీ ఒక్కసారిగా జ్ఞాపకంవచ్చి! విశ్వం ఆ మాటలన్నీ ఏ శాంతతో అన్నాడో ఆ శాంత చాలా గొప్పది! ఆమెకు కులాలూ గోత్రాలూ లేవు. ఆ శాంత అంతరించిపోయి ఆమెస్థానే బోగంది మిగిలింది. ఈ మనిషి నలభైఏళ్ళ నాగభూషణాలను పెళ్లాడటానికి అభ్యంతరం లేదు!

నాగభూషణంగారింటికి వెళ్ళాలనే ఇచ్ఛ చప్పున దిగజారిపోయింది. ఎందుకు తనకింతలో తొందర! మళ్ళీ సాయంకాలానికల్లా విశ్వంవచ్చి క్షమాపణ చెప్పు కుంటాడు. అది తన చెవుల కమృతప్రాయంగా ఉంటుంది. ఆ ఆనందంకోసమైనా ఎంతోకాలం కనిపెట్టుక్కూర్చో వచ్చునే! విశ్వం సంస్కారం తను ఎరగదా?

మళ్ళీ ఇంకో ఆలోచన వచ్చింది. తనకోసం విశ్వం తన మనస్సును సమాధానపరచుకోవలసినంత ఆగత్యం ఏంవచ్చింది? అట్లా సమాధానపడటం అతనికి అభ్యంతరం లేకపోతే తన కెందుకుండరాదూ? ఆదర్శానికి వెంట్రుక వాసి తేడా ఉన్నా ఆ దాంపత్యం తనకవసరం లేదని తను తండ్రితో ఒకప్పుడని ఉండలా? తనను ఒకవేళ విశ్వం పెళ్ళాడితే ఆ దాంపత్యం ఆదర్శానికి వెంట్రుకవాసి ఎడం ఉండదూ! అంతకన్న తను ఏ భ్రమా లేకుండా నాగ భూషణాన్నే పెళ్ళాడటం ధర్మం కాదూ?

ఆమె ప్రశ్నకు సమాధానమల్లే ఖాళీజట్కా ఒకటి వీధివెంట మెల్లిగా వచ్చింది. శాంత బండి ఆపి అందులో ఎక్కింది.

*　　　*　　　*

శాంతను వదిలి విశ్వం కాలినడకను నేరుగా నాగభూషణంగారింటికి వెళ్ళాడు. ఆయన స్నానంచేస్తూ ఉండటంవల్ల విశ్వం అయిదు నిమిషాలు కని పెట్టుకుని ఉండవలసి వచ్చింది. అప్పటికి నాగభూషణంగారు చొక్కా గుండీలు

పెట్టుకుంటూ విశ్వం కూర్చున్న గదిలోకి వచ్చారు. అదే సమయానికి శాంత వరండాలోకి అడుగుపెట్టి ఇంతలో నాగభూషణంగారి మొదటి మాటలు చెవిని పడి అక్కడే ఆగిపోయింది, లోపలి సంభాషణ ఆలకిస్తూ.

"ఏమోయ్, విశ్వనాథం? ఎంతసేపైంది వచ్చి?" అన్నాడు నాగభూషణం.

"అయిదునిమిషాలో ఏమో అయింది" అన్నాడు విశ్వనాథం విధేయతతో లేచినిలబడి.

"నాదగ్గిరికి వచ్చి లాభం లేదు, నేను మాట్లాడవలసిం దంతా మన రాఘవయ్యతో మాట్లాడాను. ఇది మళ్ళీ నాదాకా రాకుండా చూడమని కూడా చెప్పాను"

"మీ రేం చెబుతున్నారో నాకర్థం కావటంలేదు క్షమించండి, నేనేం పనిమీద వచ్చా ననుకుంటున్నారు?"

"నువు కంపెనీలో మానుకోవటం గురించి కాదూ?"

"సరే!" అన్నాడు విశ్వం పట్టలేనంత ఆశ్చర్యంతో. "ఈ సంగతి మీ కెట్లా తెలిసింది, నే చెప్పకుండానే!"

విశ్వం మాట్లాడుతున్నది నాగభూషణానికి అయోమయంగానే ఉంది. కొంచెం ఉండి, "నిన్ను ఉద్యోగంలోనించి తొలగించిన సంగతి నీతో రాఘవయ్య చెప్పాడా లేదా?" అన్నాడు.

"లేదే? నన్నుద్యోగంలోనించి ఎవరు తొలగించారూ?"

"నేనే!"

"మీరా? దేనికి?"

"అదంతా ఇప్పుడు చర్చించటం అనవసరం. నీకీ సంగతి రాఘవయ్య చెప్పకపోతే నువిప్పుడు ఎందుకు వచ్చినట్టు?"

"నేను ఉద్యోగం చాలించుకుంటున్నా నని చెప్పటానికి!"

ఇదేదో దొంగవేషమని నాగభూషణం అనుమానించి, "నువ్వెందుకు ఉద్యోగం మానుకో దలచావో నేను తెలుసుకోవచ్చునా?" అన్నాడు.

"తప్పకుండా! అది చెప్పటానికే నేను వచ్చింది. మీరు శాంత నెరుగుదురుగా! ఆమె చాలా చక్కగా పాడుతుంది. ఆ సంగతి ప్రమాదవశాన నా కీపూటే తెలిసింది. ఆమెను మన కంపెనీలో చేర్పించండి. ఆమెవల్ల కంపెనీకి లాభం ఉంది."

"నీ వుద్యోగం మానుకోవటం సంగతి చెప్పక ఇంకేదో చెబుతావేం?"

"మరిచాను. నేను కంపెనీలో ఉంటే ఆమె ఒప్పుకోక పోవచ్చును. నేను కంపెనీలో లేనని చెబితే ఒప్పుకోవచ్చును. నాకన్న కంపెనీకి ఆమె ముఖ్యం—ఆవిడ ఆడవేషాలు వెయ్యటానికి ఒప్పుకునే పక్షంలో!''

''మీరిద్దరూ స్నేహితులే గామాలు?''

"ఒకరి స్నేహితుణ్నని చెప్పుకునేంత స్నేహపాత్రుణ్ణికానేమో నేను!''

"ఆవిడ నిన్ను స్నేహితుడని చెప్పుకుంటూనే ఉందే!'' అన్నాడు నాగభూషణం అసూయ కక్కుతూ.

"ఆవిడ నా విషయంలో పొరపాటు పడిఉండవచ్చును. నేను పైకి కనబరుస్తున్న సంస్కారమంతా చెమట ఓడ్చి సంపాదించిందనీ, కొంచెం గోకి చూస్తే నాలో నా తలిదండ్రుల సంస్కారం తాలూకు ఛాయలు లేకపోలేదనీ ఆమె ఎరగదు. నేనెటువంటి నీచమైన వాతావరణంలో పెరిగానో, నా కిష్టంలేనప్పటికీ అవి నన్ను పట్టుకుని ఎట్లా బాధిస్తున్నవో, పాపం, శాంత ఎరగదు ఈ పూటవరకూ. ఈ పూటనే నా నిజస్వరూపం బయటపెట్టుకున్నాను. ఆమె నన్ను క్షమించదు. క్షమించకుండా ఉండటానికి కారణాలున్నై—క్షమించటానికే కారణం లేదు."

"అయితే నీ రాజీనామా నే నామోదిస్తాను. నువు వెళ్ళిపోవచ్చును!''

"అయితే సెలవు. ఆమెను కంపెనీలో చేర్చటం గురించి మాత్రం అశ్రద్ధ చెయ్యవద్దు."

''ఆ గొడవంతా నేను చూస్తాను. ఇక నువు వెళ్ళిపో! నాకు వేరే పని ఉంది కూడాను."

బయటికి వస్తున్న విశ్వం కళ్లపడకుండా శాంత దాక్కుని అతను వెళ్ళిన తరవాత ఇవతలికివచ్చి నాగభూషణంగారున్న గది ప్రవేశించింది.

"ఒహో! శాంతా! రా, రా! ఇవాళ ఏదో పర్వదినమల్లే ఉంది. లేకపోతే, నువేమిటి, మాయింటికి నీ అంతట నువు రావటమేమిటి?'' అన్నాడు నాగభూషణం, అప్పుడే విశ్వానికి విడాకులిచ్చిన సంబరంలో.

శాంత మొహం ఆయన కర్థం కాలేదు. ఆ మొహంలో నాగభూషణం అదివరకెన్నడూ చూడని వింతభావం ఏదో ఉంది. ఆమె నాగభూషణాని కెదురుగా కూర్చుని కొత్తచోటుకు వచ్చినదానల్లే చుట్టూ చూడసాగింది.

ఒక నిమిషం గడవనిచ్చి నాగభూషణంగారు, ''ఏం, శాంతా! అట్లా మౌనంగా ఉన్నావేం? నువు వచ్చిన పనేదో చెప్పవూ!" అన్నారు

"మిమ్మల్ని పెళ్లాడటానికి నా కభ్యంతరం లేదని చెప్పటానికి వచ్చాను!"



అన్నది శాంత నిబ్బరంగా. నాగభూషణం దివాలున కుర్చీలోనించి లేచికుందేలు పిల్లల్లే పరిగెత్తుకుంటూ వచ్చి శాంత చేతులు రెండూ పట్టున్నాడు.

"ఆగండి, ఆగండి! నేను మిమ్మల్ని పెళ్లాడతా ననలే దింకా! పెళ్లాడతానని చెప్పటానికి వచ్చానన్నాను" అన్నది శాంత.

"అయితే చెప్పూ! ఎందుకు నన్నిన్నివిధాల చంపుతున్నావు, శాంతా?" అన్నాడు నాగభూషణం.

"ఇక్కడిదాకా వచ్చినతరవాత నేను అభిప్రాయం మార్చుకున్నాను. నేను మిమ్మల్ని నా జన్మలో పెళ్లాడను. మీరు చేసిన మేలంతా మరిచిపోతాను. మిమ్మల్నే మరిచిపోతాను. అదివరకల్లా మిమ్మల్ని పెళ్ళాడాలని లేకపోయి నప్పటికీ, మీ అమాయకత్వాన్ని నమ్ముతూ వచ్చాను. అదంతా నటన అని నాకు తెలియలేదు. మీ అంత నీచమైన మనిషిని నేనెక్కడా చూడలేదు. ఆ సంగతి మీ కిదివరకు తెలుసునో లేదో, నేను చెబుతున్నాను తెలుసుకోండి."

శాంత గొంతులో క్రోధంగాని, పారుష్యంకానీ లేదు. అయినప్పటికీ ఆమె పెద్ద గొంతుతో తనని అడ్డమైన తిట్లూ తిట్టినంతగా బాధ పడ్డాడు. నాగ భూషణం...ఆమె లేచి వెళ్ళిపోవటానికి తయారవుతున్నది.

"ఉండుండు! నేను నీకేం ద్రోహం చేశానని నన్నలా అంటున్నావు?" అన్నాడు నాగభూషణం.

"నన్ను అన్యాయం చెయ్యండి. నేను వద్దన లేదు. ఇంకొకర్ని మీరన్యాయం చేస్తుంటే నేను చూసి సహించలేను...మీరు విశ్వనాథాన్నెందుకు వెళ్ళగొట్టు తున్నారు? చచ్చిపోయిన మీ దౌర్భాగ్యపు కంపెనీకి ప్రాణం పొయ్యటమేనా ఆయనచేసిన పాపం? ఆ కంపెనీ మేలే కోరి అతనంతట అతను తన ఉద్యోగం వదులుకుంటుంటే అది చూసి అయినా మీ హృదయం మారిందా? మీలో మాన వత్వం ఉంటేగా, మారటానికి?"

శాంత చరచరా వెళ్ళిపోయింది. ప్రాణం కడబట్టినవాడల్లే అయిపోయినాడు నాగభూషణం.

* * * *

శాంత తిట్టి వెళ్ళిపోయిన తరవాతకూడా నాగభూషణం తను చేసిన దాన్ని ఉపసంహరించుకోలేదు. అదివరలో హీరోవేషాలు వేస్తుండిన సత్యనారాయణను విశ్వం వేస్తున్న వేషం చదవమని ఇంతకు పూర్వమే నియమించటం అయింది. ఆ ప్రకారం లాడ్జిలో రిహార్సల్సు జరుగుతూ ఉన్నై. ఎల్లుండే నాటకం కావటం చేత రాత్రీ పగలూ రిహార్సల్సు చేస్తున్నారు. రిహార్సల్సుకు విశ్వంకాని, భాస్క రంగాని రావటంలేదు.

విశ్వం భాస్కరంతో తనకూ శాంతకూ, తనకూ నాగభూషణానికీ మధ్య జరిగిందంతా చెప్పాడు.

"నన్ను పంపెయ్యమని నాగభూషణం నిన్న సాయంకాలమే చెప్పాడటగా మీ మామయ్యతో?" అని అడిగాడు విశ్వం.

"అవును. మా మామయ్యకు నిన్నరాత్రి మనమిద్దరమూ అందలేదు. ఇవాళ ఉదయం నేను నిద్రలేవకమునుపే నువు వెళ్ళిపోయినావు...ఈ నాగభూషణం తిక్క వదలగొట్టటం ఎట్లాగా అని ఆలోచిస్తున్నాను." అన్నాడు భాస్కరం.

"అసలు నన్ను వెళ్ళిపొమ్మనటంలో ఆయన ఉద్దేశమేమిటి?"

"వాడు శాంతమీద కన్నువేశాడని నాకు కొంత అనుమానంగా ఉంది. శాంత వాళ్ళింటికి తరచువెళ్ళుతూ ఉంటుందనీ, ఆయన పిల్లలకు చదువు చెబుతూ ఉంటుందనీ ఆరా తీశాను. ఆ సంగతి పోనీగాని, నువు మధ్య శాంత కెందుకట్లా కోపం తెప్పించావు?"

"నా ఖర్మం! నోరుజారి ఆ పాడుమాట నానోట వచ్చేసింది. శాంత

భోగంద్దైనా పాకిద్దైనా నాకేమీ పట్టలేదు. నేను ఆ క్షణాన బయటపెట్టింది భోగంవాళ్ళమీద అసహ్యంగాని శాంతమీద కోపం కానేకాదు."

"అటువంటప్పుడు శాంతను బతిమాలో, కాళ్ళమీద పడో మంచిచేసుకోలేక పోయినావా?"

"నాచేత కాలేదు. చేసిన పాపాలను అనుభవించటంలోనే నాకు నమ్మకం ఉందిగాని క్షమాపణల్లోనూ, నాకు పశ్చాత్తాపంలోనూ విశ్వాసం లేదు."

"ఏడిచినట్టే ఉంది! ముందీ నాగభూషణంగాడి సంగతి చూడాలి. తరవాత నీ సంగతి చూస్తాను."

"నాగభూషణం సంగతి ఏంచూస్తావు?"

భాస్కరం చివాలున లేచి, "ఒక కారు! ఒక చిన్న అందమైన బేబీ కారు! అంతే కావలసింది!" అని ఒక్క కేక పెట్టాడు.

"కారెందుకూ?" అన్నాడు విశ్వం.

"షికారుకు పోవటానికిరా బ్రదర్, షికారుకు పోవటానికి!" అన్నాడు భాస్కరం విశ్వానికి అర్థంగాని ఉత్సాహంతో.

"ఎప్పుడు వెళతావు షికారుకు?"

"రేపు సాయంకాలం."

"రేపేనా నాటకం?"

"అవునురా బ్రదర్! అందుకే!"

"నేనుకూడా నీ వెంట రావచ్చునా?"

"నాన్సెన్స్! రేపు పొద్దూకింది లగాయతు నువు ఇంటి ఆవరణ దాటి ఎక్కడికి వెళ్ళటానికి వీల్లేదు."

"ఏం?"

"నా ఆజ్ఞ!"

"ఎందు కట్లా ఆజ్ఞాపిస్తున్నావు?"

"ప్రశ్న లడక్కు! చెప్పినట్టు చెయ్యటం నేర్చుకో!"

మర్నాడు సాయంకాలం నాలుగున్నరకు భాస్కరం హాలు దగ్గిరికి వచ్చాడు. స్టేజిమీద ఆఖరు రిహార్సలు జరుగుతున్నది. సత్యనారాయణ తన వేషంతో కుస్తీ పడుతున్నాడు. అతని పూర్వపు అభిమానులైన సభ్యులు "చాలా బాగా చేస్తున్నావు!" అని అభినందిస్తున్నారు.

రిహార్సలు పూర్తికాగానే భాస్కరం సత్యనారాయణను సమీపించి, "రెండు రోజుల్లో ఎంతబాగా తయారయినా రండీ! ఎట్లాగైనా పాతచేతులు పాత చేతులే. అనుభవం ఊరికే పోదు!" అని అభినందించాడు.

"మీరు వేళాకోళాని కంటున్నారు" అన్నాడు సత్యనారాయణ.

"ఛా, ఛా! నేను వేళాకోళం ఆడనే. రాత్రికి చూస్తారుగా! నే నబద్ధమాడితే ఆడియన్సు అబద్ధ మాడతారా?"

సత్యనారాయణ ఆ మాటకు కరిగిపోయినాడు ఆయన భాస్కరాన్ని విడవ లేక అతనివెంట హాలుబయటికి వచ్చాడు. భాస్కరం హాలుబయట నిలబెట్టి ఉన్న బేబీకారు సమీపించి, దానిమీద చెయ్యివేసి, "కారుచూశారా? చాల అందమైన కారు. అమ్మకానికి వచ్చింది గాలను నలభై రెండుమైళ్లు పోతుం దంటున్నాడు. నిజంగా అన్నిమైళ్ళూ వెళ్లేట్టయితే కొనటానికి నిశ్చయించాను. రెండుగాలన్లు పోయించాను. ట్రంకురోడ్డుకు పట్టిస్తున్నాను. నాతో మీరుకూడా వస్తారా ఏమిటి?" అన్నాడు భాస్కరం.

"మళ్లీ ఎప్పుడు వస్తాం?'' అన్నాడు సత్యనారాయణ.

"రెండు గంటల్లో రామటండీ! కనీసం ఏడింటికల్లా వచ్చేస్తాం."

"అయితే పదండి" అన్నాడు సత్యనారాయణ.

ఇద్దరూ కారెక్కి బయలుదేరారు.

ఊరుదాటి రెండుమైళ్లు వెళ్లినతరవాత భాస్కరం సంభాషణ మొదలు పెట్టాడు. "నే నెప్పుడో చిన్నతనంలో మీ నాటకం చూశాను. అబ్బో! అప్పుడు మీరు స్టేజిమీదకొస్తే జనం బ్రహ్మరథం పట్టేవారు. నామటుకు నేను మీ వేషం చూసి ధంగయి పోయినాను" అన్నాడు భాస్కరం.

"ఎట్లాగైనా ఆ రోజులు వేరండీ! విద్వత్తున్నవాడికి పేరు ప్రతిష్ఠలుండేవి. ఈ రోజుల్లో అనుభవం అక్కర్లేదు. విద్య అసలే అక్కర్లేదు. అంతా బుకాయింపు మీద బతుకుతున్నది. ఒకప్పుడీ సూర్యనారాయణా, ఈ నాయుడూ, ఈ సుబ్బారావూ మనకు సలాము కొట్టినవాళ్లు కారుటండీ? వాళ్ళెంత పెద్దవాళ్ళయి నారో చూడండి!'' అన్నాడు సత్యనారాయణ.

"అది కాలంలోమార్పు. ఎవర్నీ ఏమీ అనటానికి లేదు. ఇవాళ మనం ఆడే నాటకం చూడండి. దేశాన్ని దోచేస్తుంది. కాని దాన్లో కళ ఏముంది! ఏమీ లేదు! నాకు తెలీదా? జనానికి కావలసింది ఇదీ! నాకు ఇప్పటి కాలపు అభిరుచులు

పాతవే సుమండి. నేను జరిగిపోయిన రోజులు తలుచుకుని దిగులుపడతాను!" అన్నాడు భాస్కరం.

"నిజంగా మీకింత విజ్ఞానం ఉన్నట్టు నాకు తెలియనే తెలియదు సుమండీ. నేను మిమ్మల్ని ఇంకోవిధంగా అర్థంచేసుకున్నాను. కలిసి మాట్లాడితేగాని ఒకరికొకరు అర్థంకారు" అన్నాడు సత్యనారాయణ.

తరవాత ఒక అరగంటసేపు ఇద్దరూ మాట్లాడలేదు.

"ఇది ట్రంకురోడ్డు కాదల్లే ఉందండీ!" అన్నాడు సత్యనారాయణ.

"ఎటు పోతున్నామో నాకూ తెలియటంలేదు" అన్నాడు భాస్కరం.

భాస్కరం ఉపాయంగా పెద్దరోడ్లనూ, గ్రామాలనూ తప్పించుకుంటూ కారు తోలుతున్నాడు.

చీకటిపడింది. రోడ్డంతా గతుకులుగా ఉంది చూపు మేరలో ఎక్కడా ఒక కొంపయినా ఉన్నట్టు కనిపించలేదు ఈ గతుకులమధ్య వచ్చి కారు ఆగి పోయింది. భాస్కరం కారును మళ్లా స్టార్టుచెయ్యాలని ఎన్నిసార్లు ప్రయత్నిం చినా ఇంజన్ టర్‌మని కాస్సేపు ఆడి ఆగుతున్నది.

"ఏం జరిగింది?" అన్నాడు సత్యనారాయణ.

"ప్లగ్ సరిగా స్పార్కిస్తున్నట్టు లేదు."

భాస్కరం కారుదిగి బానెట్ తెరిచి రిపేరు మొదలుపెట్టాడు.

ఒక పావుగంట చూసి సత్యనారాయణ, "ఏమండీ, మళ్ళీ త్వరలో స్టార్టు కాగలమా? ఇప్పుడే ఏడయినట్టుంది" అన్నాడు.

"ఫరవాలేదు. అయిదు నిమిషాలు! ఇట్లా చెడిపొయ్యేట్టయితే ఈ కారెవడి క్కావాలి?"

*　　　*　　　*

ఎనిమిదిన్నర అయింది. హాలుదగ్గర అప్పుడే గుంపులు పోగయినై. నాగ భూషణంగారు సత్యనారాయణకోసం నిరీక్షిస్తున్నారు. అతను ఏమయిందీ చెప్పే వాడులేడు. భాస్కరంగాని, విశ్వంగాని హాలు చాయలకు రాలేరు. వాళ్ల వస్తారని నాగభూషణం అనుకోనూ లేదు. భాస్కరం సాయంకాలం నాలుగున్నరకు హాలు దగ్గిరికి వచ్చాడనీ, అయిదున్నరకు భాస్కరమూ, సత్యనారాయణా కలిసి బయటకు వెళ్ళారనీ తెలిసింది.

ఇక గత్యంతరం లేక నాగభూషణం రాఘవయ్యగారింటికి బయలుదేరాడు, భాస్కరాన్నడిగి సత్యనారాయణ విషయం కనుక్కునేటందుకు.

రాఘవయ్యగారూ, విశ్వమూ భోంచేస్తున్నారు. భాస్కరం ఎటో వెళ్లాడనీ, భోజనానికి రానన్నాడనీ తెలుసుకున్నాడు నాగభూషణం.

"భాస్కరంమాట ఎట్లా ఉన్నా సత్యనారాయణ కనిపించలేదు. ఈ నాటకం వెధవల్ని నమ్మరాదు. నువ్వేగతి అనగానే కొమ్మెక్కి కూచుంటారు. ఇప్పుడెట్లా? నాటకం ఆపేస్తే మన పరువు దక్కదే!'' అన్నాడు నాగభూషణం.

విశ్వం తలవంచుకు భోంచేస్తున్నాడు. అతను ఈ సంభాషణలో జోక్యం కలిగించుకో దలచలేదు.

"మనకు పరువేమిటి? మన కసలు నాటకాలాడించడం చాతకాదు. కాని అమ్మిన టిక్కెట్లు రీఫండుచేసి లైట్లార్పి అందరినీ ఇళ్లకు వెళ్లమను" అన్నాడు రాఘవయ్య నాగభూషణంమీద పగ తీర్చుకుంటూ.

"ఎందుకు రాఘవయ్యా, నామీద నీకంత కోపం?''

''లేకపోతే ఏమిటి? కంపెనీ అధోగతికి పోతున్నన్నాళ్ళూ చూస్తూ ఊరుకుని, నాతో నీయిష్టం వచ్చినట్టు చెయ్యమని, మనవాళ్లిద్దరూ వచ్చి కాస్త మన పరువు నిలబెట్టే ఏర్పాటు చేసేటప్పటికి పానకంలో పుడకల్లే అడ్డంవచ్చి అంతా పాడు చేస్తివి. అనుభవించు! నువ్వే ధైర్యంతో సత్యనారాయణకు విశ్వం వేషం ఇచ్చావో నాకేం తెలుసూ?"

"బుద్ధిపొరపాటయింది, రాఘవయ్యా! జరిగిందేదో జరిగింది. ఏం విశ్వనాథం? నువు వచ్చి మళ్ళీ మా కంపెనీలో చేరి వేషాలు వేస్తావా, నన్నెక్కడికైనా పారి పొమ్మన్నావా?'' అన్నాడు నాగభూషణం.

విశ్వం, నాగభూషణంవంక చూసి, "మీకంపెనీ సంగతి నా కవసరం లేదు. ఇవాళమటుకు కావాలంటే వేషం వేస్తాను. తరవాత మీరు కంపెనీ ఆపుకున్నా సరే లేచిపోయినా సరే!'' అన్నాడు.

విశ్వనాథాన్నీ, రాఘవయ్యనూ వెంటబెట్టుకుని నాగభూషణం హాలు దగ్గిరికి వచ్చేటప్పటికి తొమ్మిది దాటింది. నాటకం సకాలానికి ప్రారంభమయింది. విశ్వనాథం మళ్ళీ రావటంచూసి ఆడియన్సు వన్సుమోరులు కొట్టారు. మూడో అంకం జరుగుతుండగా భాస్కరమూ, సత్యనారాయణా మట్టికొట్టుకొని హాలు చేరుకున్నారు. సత్యనారాయణను హాలుదగ్గిర దిగబెట్టి భాస్కరం కారులో మళ్ళీ బయలుదేరాడు విశ్వంచెప్పిన గుర్తుల ప్రకారం అతనికి అనసూయ ఇల్లు సుళువుగానే తెలిసింది.



అనసూయ నిద్రపోతున్నది కాని శాంత మేలుకునే ఉన్నది; తలుపు చప్పుడు విని ఆమె, పినతల్లికోసం ఎవరో వచ్చారనుకుని అనసూయను లేపింది. తలుపు తీసిన అనసూయను చూసి భాస్కరం, "శాంత ఉండే దిక్కుదేస్తా?" అని అడిగాడు.

"ఏం కావా" లన్నది అనసూయ.

''ఆమెతో మాట్లాడాలి'' అన్నాడు భాస్కరం. భాస్కరం గొంతు గుర్తించి శాంతే బయటికి వచ్చింది.

'శాంతా, పోదాం రా!" అన్నాడు భాస్కరం.

మారు మాటాడకుండా శాంత కారెక్కింది. ఇద్దరూ హాలుదగ్గిరికి వచ్చారు అప్పటికి నాటకం పూర్తి కావస్తున్నది.

''ఎందుకు విశ్వంమీద అంతకోపం తెచ్చుకున్నావు?" అని అడిగాడు భాస్కరం. శాంత జవాబు చెప్పలేదు.

'ఇప్పుడింకా వాడిమీద కోపం ఉందా?" అన్నాడతను.

"ఉన్నది!"

"అంత ద్రోహం ఏంచేశాడు వాడు?"

"నేను మకురుతనం చేస్తే ఆయనెందుకు చూస్తూ ఊరుకోవాలి? లాగి దవడ పగలగొట్టితే నాకప్పుడే బుద్ధి వచ్చిఉండేదిగా?" అన్నది శాంత.

భాస్కరం నవ్వి, 'గుడ్‌గర్ల్' అన్నాడు.

ఆఖరురంగం జరుగుతున్నది. విశ్వం స్టేజీమీద ఉన్నాడు. భాస్కరమూ, శాంతా సైడ్‌వింగ్‌దగ్గిర నిలబడి ఉన్నారు.

వెనకనించి 'శాంతా!' అని పిలుపు వినబడింది. శాంత వెనక్కు తిరిగి చూసింది; నాగభూషణం. శాంత మొహం తిప్పేసుకుంది.

"భాస్కరం, కొంచెం మీరిద్దరూ ఇవతలికి వస్తారా? నీ ఎదట శాంతతో ఒక్కముక్క చెప్పాలి" అన్నాడు నాగభూషణం. ముగ్గురూ కలిసి స్పెషల్ గ్రీన్ రూములోకి వెళ్లారు. భాస్కరం బలవంతంమీద శాంత వచ్చింది. గది తలుపువేసి భాస్కరం 'ఏమిటి?' అన్నాడు.

"శాంతా, బుద్ధితక్కువై నిన్ను పెళ్ళాడమని అడిగాను. నాకు మతి భ్రమ కలిగింది. నీకు కోపం తెప్పించాను. నువు నన్ను పెళ్లాడనందుకు సంతోషం గానే ఉందిగాని నీకు కోపం తెప్పించినందుకు కష్టంగా ఉంది. నేనేంచేస్తే నీ కోపం పోతుంది? ఏం చెయ్యమంటే అది చేస్తాను" అన్నాడు నాగభూషణం.

"నన్నెందు కడుగుతారు? మీరు నా కన్యాయం చేశారని అన్నానా? ఎవరి కన్యాయం చేశారో వారినే అడగండి, ఏంచేస్తే పాపం పరిహారం అవుతుందో!" అన్నది శాంత కోపంగానే.

"అతను నన్ను క్షమించేటట్టు లేడు. ఇవాళ వేషం వెయ్యటానికి ఒప్పు కున్నాడుగాని నా కంపెనీలో ఉండడానికి ఒప్పుకోలేదు. నువ్వయినా కాస్త చెబుతావా?"

"అడగవలసిన విధంగా అడిగితే ఎందు కొప్పుకోరూ?"

"కావలిస్తే మళ్ళీ నీ ఎదట అడుగుతాను."

ప్రేక్షకులంతా ఒక్కసారి గొల్లుమన్నారు. నాటకం అయిపోయింది.

"నాయనా, భాస్కరం! మీ విశ్వాన్ని ఒక్కసారి ఇట్లా పిలుస్తావా?"

భాస్కరం వెళ్ళి విశ్వాన్ని పిలుచుకొచ్చాడు.

"విశ్వం, నీ స్నేహితు లిద్దరి ఎదుటా మళ్ళీ ప్రాధేయపడుతున్నాను. నేను బుద్ధిపొరపాటున వెళ్ళిపొమ్మన్నందుకు నన్నిట్లా శిక్షించటం ధర్మంకాదు. నా కంపెనీలో ఉండవూ?" అన్నాడు నాగభూషణం.

"మీరు వెళ్ళిపొమన్నారని కోపంవచ్చి నేను వెళ్ళిపోతున్నానా?" అన్నాడు విశ్వం.

నాగభూషణం మొహం చిట్లించి తల తడువుకుని, "నీకు నా మీద కోపం లేదా?" అన్నాడు.

"లేదు."

మరి నా కంపెనీలో ఉండి పనిచేస్తావన్న మాటేనా?"

"చెయ్యను."

"మళ్ళీ అదేమిటి?"

''నేను వెళ్ళిపోవటానికి కారణం ఏమిటో నిన్న ఉదయం చెప్పాను. మీరు మరిచిపోయినారు!" అన్నాడు విశ్వం.

"నాకు జ్ఞాపకం రావటం లేదు. మళ్ళీ చెప్పు పోనీ!"

విశ్వం మాట్లాడలేదు. శాంతవేపు ఒక చూపు చూసి ఊరుకున్నాడు. ఆ చూపు నాగభూషణానికి జ్ఞాపకం తెప్పించింది. ఆయన వికసించిన మొహంతో శాంతవేపు తిరిగి, ''అన్నట్టు శాంతా, నువుకూడా మా కంపెనీలో చేరి వేషాలు వెయ్యకూడదమ్మా?-నీ కభ్యంతరం లేకపోతే సుమా!" అన్నాడు. తను ఏమంటే ఎవరికి ఏం కోపం వచ్చిపోతుందోననే భయం ఆయనకు బాగా పట్టుకుంది.

"ఈ ఆలోచన మీకెవరు చెప్పారు?" అన్నది శాంత రౌద్రంగా.

విశ్వం అనుమానిస్తూ ఆమెకేసి మళ్ళీ చూశాడు. అతనికి నిన్న ఉదయం నించీ శాంతను చూస్తే హడలుగానే ఉంది.

"మన విశ్వమే. అతనుంటే నువ్వు ఒప్పుకోవేమోనని అతను తనపనికూడా మానుకుంటున్నాడు. నాకిప్పుడు జ్ఞాపకం వచ్చింది, కాదూ, విశ్వం?"

విశ్వం మూడోసారి శాంతకేసి చూశాడు.

ఆడపులి మాదిరిగా శాంత విశ్వంమీదికి తిరిగి, "ఏమండీ, మీరు వెళ్ళిపోతే నేనీ కంపెనీలో వేషాలు వేస్తానని మీతో అన్నానా?" అన్నది.

విశ్వం ఈ బుకాయింపు సహించలేకపోయినాడు. అతను లేనిఓర్పు తెచ్చి పెట్టుకొని, "నువ్వామాట అన్నావని నేనుమాత్రం అన్నానా? నేను కంపెనీలో ఉన్న కారణంచేత నీకు కంపెనీలోకి రావటాని కభ్యంతర మయినట్టయితే, అంత తప్పని పరిస్థితుల్లో నేను విరమించుకుంటానన్నాను. ఇప్పుడు సందేహం తీరిందా" అన్నాడు.

"నే నా షరతుమీద వేషం వెయ్యను!" అన్నది శాంత గర్వంగా.

"బతికాం! అట్లా అయితే నేను మీ కంపెనీలో ఉండిపోతానండీ, చేర్మను గారూ" అన్నాడు విశ్వం నాగభూషణంకేసి తిరిగి.

"మీరు కంపెనీలో ఉండేట్టయితే నేను కంపెనీలో చేర ననలేదు" అన్నది శాంత.

"ఏమిటీ?" అన్నాడు విశ్వం తన చెవులను తనే నమ్మలేకుండా.

నాగభూషణం మాత్రం చాటంత మొహంతో, "అయితే ఇద్దరూ మా కంపెనీలో ఉంటారన్నమాటే? ఏడీ రాఘవయ్య" అంటూ పరిగెత్తాడు.

విశ్వం భాస్కరంకేసి తిరిగి, "ఒరే, ఇడియట్! ఇక్కడ నీకేం పనిరా? పో అవతలికి" అన్నాడు.

భాస్కరం అవతలికి పోయినాడు.

రెండు గంటలైంది. హాల్లో విశ్వమూ, శాంతా ఒకరికొకరు ఎదురెదురుగా కూర్చున్నారు. భాస్కరం నిద్రవస్తున్నదని అంతకు పూర్వమే వెళ్ళాడు.

"ఏమిష్టాలోచిస్తున్నారు?" అన్నది శాంత.

"మన సంగతే!" అన్నాడు విశ్వం.

"ఇంకా అనుమానం తెగలేదా యేం?"

"మనిద్దరి సంగతి కాదోయ్. రేపు మనిద్దరికీ పుట్టగల పిల్లల సంగతి. చూస్తూ చూస్తూ మనం పిల్లల్ని కనటం ఎట్లా?"

"ఏం?"

"వాళ్ళంతా కులంలేని పిల్లలై నానా అగచాట్లూ పడతారు."

"ఎందుకనీ?"

"నువు చూడరాదూ?"

"క్షమించండి. నన్నేమన్నా అంటే నే నూరుకోను."

"ఎందుకనో!" అన్నాడు విశ్వం ఆశ్చర్యం నటిస్తూ.

"ఎందుకనా? నాకంటే అదృష్టవంతురా లీక్షణాన ఈ ప్రపంచంలో ఎవతయినా ఉందేమో చూపించండి!" అన్నది శాంత గర్వంగా.

విశ్వం మరి మాట్లాడలేదు.

---



# జీతమందిన రోజు

## జగన్నాథ్

ఆఫీసు నుంచి, గంట ముందుగా బయట పడ్డాడు- మన్మధరావు.

ఆరోజు జీతమందింది.

మనసు మనసులో లేదు. విపరీతమైన కోరికల్లో మునిగాడు.

ఈ రోజు జీతాలిస్తారు, సరదాగా సినిమాకు పోదాం- రెడీగా ఉంటు.

అని యింటినుంచి బయల్దేరేముందు, రాధకు మరీ మరీ చెప్పాడు-

ఎలాగైనా రాధను సినిమాకు తీసు కెళ్ళాలి. బేబికీ మంచి బట్టలులేవు. వచ్చేది పండుగ- దానికి ఈ సారైనా మంచి గౌన్లు కుట్టించాలి.

ఇక రాధ సంగతి సరేసరి. పెళ్ళినాడు కొన్న చీరెలు. మళ్ళీ ఇన్నాళ్ళకు ఒక్క చీరె కొన్లేకపోయాను.

"ఉన్నంతలో ఏకలనేత చీరెలో రెండు కొంటే బాగుండును.

ఎప్పుడూ నోరు తెరిచి అడగలేదు! నేను ఏ విధంగానూ సుఖపెట్టలేక పోతు న్నాను, రెండు చీరెలు కొనాలి!

కొంటె! పిచ్చిముఖంది ఎంత సంతో షిస్తుందో!

ఇక నా సంగతి మామూలే. ఉన్న వాటినే రిపేరు చేయించుకుని, ఎలాగో కాలాన్ని గెంటొచ్చు - ఇవన్నీ జరిగే దెట్లా?

మరోమారు లెఖవేశాడు - రెండు వందలకు, మరో రూ పా యి కూ డా, ఎక్కువ కనిపించదు!

కోరికలుమాత్రం తరగటంలేదు. ఆలోచనలతోనే అడుగులు వేస్తున్నాడు.

ఇంటి అద్దె నలభై రూపాయిలు - పోయిననెల కూడా ఇవ్వలేదు!

ఈ నెలలో మొత్తం ఇస్తానని, సత్య హరిశ్చంద్రుడిలా వాగ్దానంచేశాడు!

రెండునెలల అద్దె ఈ నెలలో ఇవ్వక పోతే నా అమాయకత్వాన్ని ఆసరా తీసుకుని బజార్న పడతాడు-వాడసలే ముఖోపి!

ఇంకా పాలు పెరుగు కిరాణా ఇవన్నీ ఖాతాలే.

నా ముఖంచూసి ఎవరూ ఇవ్వక పోయినా పాపం రాధ ముఖం చూసి ఇస్తున్నారు!- అంత ఉత్తమురాలునాభార్య కావటం- నా పూర్వజన్మ సుకృతం-

ఇంతకీ ఇప్పుడేంచెయ్యాలి? "వచ్చిన కాస్త జీతం అందరికీ పంచిపెడితే మళ్ళీ నెలంతా ఎట్లా గడుస్తుంది!-పోనీ ఆ కాబులీ సాయిబునే మళ్ళీ అడుగుదా మంటే."

వాడికిదివరకే ఐదు వందలుదాకా ఇవ్వాలి-

చస్తే ఇవ్వడు!

ఉన్నట్టు మర్చిపోయాను; వాడి కీనెల్లో యాభై రూపాయలు వడ్డీ కట్టాలి!

ఈపాటికి ఆఫీసుకు వెళ్ళే ఉంటాడు!

"అక్కడ నేను లేనుగా."

నేను తెలివితక్కువ వాడినను కుంటున్నాడు - అందుకే ఆఫీసునుండి గంట ముందుగా బయటపడ్డాను!

ఆ సంగతి వాడికి తెలియదు పాపం!

ఈరోజు గడిచిందనుకుంటే - రేపు ఊరుకుంటాడా?

ఇంటిముందు గుంటనక్కలా కూర్చుంటాడు!-

వెధవ జీతాలు వచ్చిందాకా ఒకటే ఆరాటం, వచ్చింతరువాత ఎలా సర్దుకో వాలో.

చాతకాక చావటం-

ఏం జీతాలో-ఏం జీవితాలో

పైగా పండగొకటి.

వచ్చింది చాలక చస్తుంటే...

ఈ సంక్రాంతి పండుగ కబంధ హస్తాలనుండి బయటపడే మార్గం ఏది?

సినిమాటైం దగ్గరపడుతోంది.

మనసు మనసులో లేదు-

కొబ్బరి దొరికిన కోతిలా వీధులెంట ఆ రకం ఆలోచనలతో నడుస్తున్నాడు!

నైజాం హోటల్లో స్ట్రాంగు టీ త్రాగాలనిపించింది!

ఆగిపోయాడు!

"అప్పారావు, ఆంజనేయులుకనిపిస్తే బాగుండును!"

వెధవలు ఏ క్లబ్‌కో పోయుంటారు-

జీతమందిన రోజున హాయిగా ఫ్యాను క్రింద కూర్చుని-కబుర్లు చెప్పుకుంటూ వేడి వేడి "టీ" త్రాగితే ఎంత బాగుం టుంది!

తెగించి ఒక్కడే హోటల్లోకి నడిచాడు! హోటలు కిటకిటలాడుతోంది.

హోటల్లో పెట్టబోయె అడుగు వెనక్కి పడింది.

గాలి విపరీతంగా వీస్తోంది.

రోడ్డుమీద దుమ్ము మన్మధరావు కళ్ళల్లో పడింది!

కోపంగా కళ్ళు నులుపుకొని, బల వంతాన రెప్పలు పైకెత్తాడు!-ఈదర గాలికి రోడ్డుకు అడ్డంగా పట్టీలు కొడు తున్న అందమైన పండగ బోర్డు కన పడింది.



వాళ్ల జాతకాలు భలేగ "మాచ్" అయ్యాయి ! నా క్కావల్సింది అంతే !!!

కళ్ళవెంట నీళ్ళు కక్కుతూ, బోర్డు ముందుకు నడిచాడు.

కళ్ళు పెద్దవిచేసి. బోర్డు చదివాడు.

"సంక్రాంతి పండుగ సందర్భమున, రూపాయికి ఇరవై పైసలు రిబేటు."

లైలా సిల్కుపాలెస్ మేన్ రోడ్డు.

మనసు సిల్కుప్యాలెస్ మీదికి మళ్ళింది.

మన్మధరావు ఉన్న స్థలానికి ఆ పేలెస్ రెండు ఫర్లాంగులుంది!

నడవాలనిపించలేదు.

రిక్షా ఎక్కాలనిపించింది.

మరోమారు జేబులో చెయ్యి పెట్టి చూసుకున్నాడు. డబ్బు దండిగా తగిలింది.

ధైర్యం స్థాయి పెరిగింది.

జీతం అందినట్టు ఫోజుపెట్టి.

"ఒరేయ్ రిక్షా నిన్నే వినపట్టం లేదూ!"

కేక వేశాడు!

అది ఒన్‌వే ట్రాఫిక్. చుట్టూ తిరిగి పది నిమిషాల్లో దగ్గరకు చేరుకున్నాడు, రిక్షావాడు!

"ఛ! అసలే టైంలేక చస్తుంటే ఒన్‌వే ట్రాఫిక్ ఒకటి?-గొణిగాడు!"

"ఏమోయ్! లైలాసిల్కు ప్యాలెస్సుకు ఎంతిమ్మన్నావు-హుందాగా అడిగాడు.''

"ముచ్చవక బావ్!"

తొరగా ఎక్కండి-జవోన్లు సూత్తే ఒల్లకోరు!

"ఏవిఁటి సరిగ్గా రెండు ఫర్లాంగులు లేదు!

ముప్పావలా కావాలా?"

అందులో సగమిస్తా,నీ ఇష్టమైతే రా!

ముందుకు నడిచాడు!

బావ్! అంటూ రిక్షా వెనకాల నడిచింది.

వెనకా ముందులుగా ఇద్దరూ సగం దూరం నడిచారు.

ఇంతలో ఎదురుగా వస్తున్న యమ ధర్మరాజు (కాబూలీ సాయిబు) మన్మథ రావు చూపుల్లో నిలిచాడు-బెంజి లారీకి బ్రేకు పడ్డట్టు టక్కున ఆగిపోయాడు!

వెనకాల వస్తున్న రిక్షా సున్నితంగా ఓ...

"ఎవడ్రా అది" వెనక్కి తిరిగి చూశాడు.

చావబోయే వాడికి గరళం పోసినట్టు ఆ రిక్షావాడు గౌతమబుద్ధుడిలా శాంత స్వరూపంతో కనిపించాడు!

కాబూలీ సాయిబు సమీపిస్తున్నాడు!

గుండెదడ పట్టుకుంది!

"నాయనా రిక్షావాలా నీకు పుణ్య ముంటుంది. నీకు రూపాయి పావలా ఇస్తా"

నన్నక్కడదింపు."

కాలుకాలిన పిల్లిలా టక్కున రిక్షా ఎక్కి కూర్చున్నాడు!

రిక్షా కదిలింది.

"ఒయ్ రిక్షా, టాపెయ్ వాడొస్తు న్నాడు.

నాలిక కరుచుకున్నాడు!

రిక్షావాడికి అనుమానం వచ్చింది.

నా రిక్షాలో ఎక్కింది పిచ్చివాడేమో!

తీరా దిగేక పేచీపెడతాడేమో?

మనసులో అనుకుంటూ టాపు తగిలించి తల నేలకువంచి, బలంగా లాగటం ప్రారంభించాడు వాడు!

మళ్ళీ రిక్షాలోంచి కేక.

"నా కర్మకాలి నీ రిక్షా ఎక్కాను నడిపిస్తావేం త్వరగా పోనియ్.

కంగారుకొద్దీ అన్నాడు!

రిక్షావాడు ఆయాసంతో,

"ఇదంతా అప్పండి. ఈ ఊళ్ళో అప్పు లెక్కువున్నాయ్, నన్నేదిసెయ్య మంతారు! అన్నాడు!"

"నాకూ ఉన్నాయ్ ఊళ్ళో అప్పులు అందుకే నీ రిక్షా ఎక్కాను."

మన్మధరావు గొణిగాడు.

ఎలాగైతేనేం అతి కష్టం మీద కాబూలీని దాటింది రిక్షా అంతవరకు నక్కి కూర్చున్న మన్మధరావు నడుం పైకి లేచింది.

తల బయటపెట్టి వెనక్కు చూసి ధైర్యం తెచ్చుకున్నాడు!

"నాకన్నా నువ్వేనయం. నడివీధిలో నిర్భయంగా రిక్షా లాక్కుంటున్నావు!" అన్నాడు.

రిక్షావాడు ఆ మాటలు పట్టించుకునే స్థితిలో లేడు.

రిక్షా నెమ్మదిగా పదినిమిషాల్లో సిల్కు ప్యాలెస్సును చేరుకుంది.

"బావ్ దిగండి."

"అప్పుడే వచ్చిందా? అంటూ"

అటూ ఇటూ చూసి ఆర్ధ రథుడిలా క్రిందకు దిగాడు—అతని కళ్ళు ప్యాలెస్ మీదికి మళ్ళాయి!—అతనికది

విద్యుద్దీపాల కాంతిలో—కళ్ళు మిరి

మిట్లు కొలుపుతూ, తాజ్‌మహల్‌కన్న మిన్నగా కనిపించింది.

ఆ సంతోషంలో రిక్షావాడ్ని మర్చిపోయాడు.

సిల్కు ప్యాలెస్ మెట్లు లెక్కపెట్ట నారంభించాడు?

రిక్షావాడు ఈయనకి నిజంగా పిచ్చి పట్టిందనుకున్నాడు.

బాప్! డబ్బులియ్యకుండా పోతంద్రు.

ఇసురుగా వెళ్ళి అడుకున్నాడు.

తుళ్ళిపడి ఇహలోకంలో పడ్డాడు మన్మధరావు.

"ఏమీ అనుకోకు, మర్చిపోయాను."

జేబులో చెయ్యిపెట్టి-చిల్లర డబ్బులు లెక్కపెట్టి-నలభై పైసలు చేతిలోపెట్టి పొమ్మన్నాడు.

రిక్షావాడికి చిరాకెత్తింది.

"ఇదేటండి నాను ముఛ్చవక అడిగితే తమరేమో రూపాయి పావలా ఇత్తా నన్నారు. వుప్పుడేమో నలభై పైచా లిత్తంద్రు, ఇదేట్నాయం.

మన్మధరావు సర్దుకుని.

''అవునుమరి నేను అడిగిన దగ్గర నుండి వస్తే ముప్పావలా ఇచ్చేవాడ్ని-సగందూరం నడిపించి మరీతీసుకొచ్చావు. అందుకే సగమిచ్చాను!-పొమ్మన్నాడు.

"అదేటి కుదర్దు-నానడిగిన ముచ్చవక యిచ్చి కదలండి! పేచీకి దిగాడు వాడు!

ఇంతలో అప్పిచ్చిన యమధర్మరాజు రొప్పుతూ అప్పెక్కటం మన్మధరావు కళ్ళబడింది!

గుండె ఝల్లుమంది.

కళ్ళకు చీకటి కమ్మింది.

తటపటాయించి!

"చిల్లర లేదోయ్, అందుకని. ఇదిగో ఈ రూపాయుంచు."

వాడిచేతిలో పడేసి కంగారుగా సిల్కు-ప్యాలెస్‌లోకి వెళ్ళాడు .. అడుగుపెట్టీ పెట్టగానే-

కిట కిట లాడుతూ జనం.

కోలాహలం-గందరగోళం.

చాలా సరదాగా ఉంది.

షాపంతా కలియతిరిగాడు మన్మధరావు.

సినిమాటైం ఎప్పుడో అయిపోయింది. ఆ మాటే మర్చిపోయాడు!

ఒకమూలకు చేరుకున్నాడు? షోకేస్ అందంగా కనిపించింది! అందులో మరీ అందంగా ఉన్న గౌన్లు కనిపించాయి!

బేబీ గుర్తొచ్చింది.

"అభ! ఆ గౌనెంత బాగుంది-బేబికి చూడముచ్చటగా ఉంటుంది!

ఇంతకీ ఆ గౌనెంతో-కనుక్కుంటే పోలే!

"ఇదిగో మిష్టరు ఆ గౌనెంత?"

"నలభై రూపాయిలు."

కళ్ళు తిరిగాయి.

"అయ్యబాబోయ్! ఒకనెల అద్దె!"

మనసులో అనుకున్నాడు!

గౌరవానికి లోపంలేకుండా! అదెంత? ఇదెంత? అని అన్నింటి ధరలు కనుక్కున్నాడు.

తను అనుకున్న ధరకు ఏదీ కనిపించదు!

"కనీసం పెరుగు బాకీ ధరంతలో ఉన్నా బాగుండును!" నసిగాడు!

స్టైల్‌కి లోపంలేకుండా - దిక్కులు చూడటం ప్రారంభించాడు.

మరోప్రక్క పెద్ద షోకేసు-అందులో దేవకన్యలా చక్కనిబొమ్మ-ఆ బొమ్మకు చుక్కల టెర్లిన్ చీరెకట్టి చక్కగా కనిపించింది!

నెమ్మదిగా అక్కడికి చేరుకున్నాడు. కన్నార్పకుండా, ఆ బొమ్మపై చూపు నిల్పి తదేకంగా చూస్తూ, నిటారుగా నిల్చున్నాడు!

తన్మయత ముసకొట్టింది.

"ఆహా! ఆ చీర ఎంతబాగుంది! నా రాధ కట్టుకుంటే, ఈ బోడిబొమ్మకన్నా నిండుగా ఉంటుంది.

ఆనాడు పెళ్ళిలో-రాధ పట్టుచీరె కట్టుకున్నప్పుడు-తొంగిచూసిన అందం ఈ చీరెలో కనిపించింది.

ఊహా లోకంలో విహరించాడు మన్మధరావు పది నిమిషాలపాటు!

"సార్ చీరెలు చూపించమన్నారా? అన్నాడు కొట్టువాడు.

తుళ్ళిపడి నోట మాటరాక-హోదాకు తగినట్టు ''ఊఁ'' అన్నాడు మన్మధరావు.

వరుసగా రంగు రంగుల చీరెలు-అతని కంటిముందు పేర్చబడ్డాయి!

ధరలు తెలుసుకుని బాగోలేదన్నట్టు తల ఊపుతూ, "ఇవన్నీకాదు, ఆ బొమ్మకు కట్టిన చీరె". అమాయకంగా అడిగాడు.

"ఎనభై రూపాయలని" వెంటనే సమాధానమిచ్చాడు కొట్టతను.

"అమ్మయ్యో" రెండు నెలల అద్దె. గుండె గుభేలుమంది.

తెల్లబోయి చూస్తున్నాడు మన్మధరావు.

"ఇదేం కొనేబాపతుకాదు" - తీసిన చీరెలన్నీ బీరువాలో సర్దుతున్నాడు షాపతను.

చిరాగ్గా.

మన్మధరావుకు దేనికీ చెయ్యాట్లం లేదు. మళ్ళీ బయటకొచ్చి ఆ చీరె కట్టిన బొమ్మనే చూస్తూ నిల్చుండిపోయాడు.

క్షణం గడిచింది!

ఆ బొమ్మ, బొమ్మలా కనిపించలేదు! తన భార్యే షోకేసులో వచ్చి నిల్చుందనుకొన్నాడు.

భ్రమతో అద్దంపై చెయ్యి వేసేంతలో,

వెనుకనుండి బలమైన చెయ్యి బుజాల మీద వాలింది!

కంగారుగా వెనక్కితిరిగి చూశాడు.

యమధర్మరాజు.

ముచ్చెమటలు కమ్మాయ్.



గుండెదడ పట్టుకుంది!

మనసులో యాభై రూపాయలు గోవిందా అనుకున్నాడు. బిక్కముఖం పెట్టి-పిచ్చి చూపులు చూస్తూ-

"సలాం సాయిబు-నీ పెళ్ళానికి చీరె కొంటానికి వచ్చావా?" పెదిమెలు తడుపుకుంటూ అడిగాడు మన్మధరావు.

"అరె నాది పెళ్ళాన్కి చీర ఎందుకు భాయ్. నీది పెళ్ళాంకి చీర కొంటాన్కి వచ్చావ్!

ముందు నాది వడ్డీ కట్వల-మాట తప్పి మారంచేస్తే మంచీ మాటకాదు!

మాది ముస్లికా భేట మాలుం!"

అన్నాడు హుంకరిస్తూ.

"అదికాదు సాయిబు, చీరెకొంటానికి రాలేదు! ఊరికే చూసిపోదామని..."

ఇంకా నేను జీతం తీసుకోలేదుగా"

ఎలాగో ఈ రోజు గండం గడవటానికి అబద్ధం ఆడాడు!

"హెమ్మి జీతం తీస్కోలేదు! అయితే మాది మాటఇను: అబద్ధం సెప్తే మాది ఊరుకుందేదిలేదు. రేపు జీతాంకి తీస్కుని ఇవ్వవల! హెమ్మి! అర్థము ఆయింది!

అని! కళ్ళెర్రబెట్టాడు కాబూలి.

"అలాగే రేపు తప్పకుండా ఇంటికి రా..."

ఆ! వద్దులే, రేపు నేనే తెచ్చిస్తా!"

మాట మారుస్తూ అన్నాడు!

"మర్చిపోతే మంచీమాట కాదు!"

కాబూలీ ఎగురుకుంటూ వెళ్ళిపోయాడు.

మన్మధరావు వంటిమీద బరువు తగ్గినట్టు.

తేలికయ్యాడు!

"అమ్మయ్య! గండం తప్పింది- ఇంకా నయం గొంతుమీద కూర్చున్నాడు కాదు!"

"చూడ్డానికి భయంకరంగా ఉంటాడు కాని పాపం మనిషి మంచివాడే!"

అప్రయత్నంగా సినిమా గుర్తొచ్చింది!

"అయ్యో సినిమా టైం మించి పోయిందే! ఇప్పుడేం చెయ్యటం. పాపం రాధ తనకున్న ఆ ఒక్క జరీ చీరె కట్టుకుని-

నేనొచ్చి సినిమాకు తీసుకుపోతానని ఎదురుచూస్తూ కూర్చుందేమో?

ఈ గొడవలో ఆ సంగతే మర్చి పోయాను.

"తొందరగా ఇంటికి పోదామంటే? మరి! చీరె, గొను! పోనీ ఈ రోజుకు మానేసి రేపు కొందామంటే,

అప్పటిదాకా అప్పులవాళ్ళు ఊరు కొంటారా?

ఏం చెయ్యాలి? ఆలోచనలో-రోడ్డు కడ్డంగా నిల్చుండిపోయాడు.

కారు హారన్లు-లారీ హారన్లు మిన్ను ముట్టాయి!

మన్మధరావుమాత్రం ఆలోచనల నుండి బయటపడలేకపోయాడు!

అంతలో నలుగురు పెద్దమనుష్యులు కంగారుగా వచ్చి మన్మధరావును-లాక్కుపోయి-

ఫుట్‌పాత్‌మీద నిల్చోపెట్టి,

"ఏమయ్యా బ్రతకాలని లేదూ-

కొద్దిలో తప్పిపోయింది — లేకపోతే, చచ్చివుండువు-కాస్త ఒళ్ళు దగ్గరపెట్టు కుని కొంపచేరు.

అని ఆ పెద్దమనుష్యులు వెళ్ళి పోయారు! మన్మధరావు - ఆలోచనల నుండి తేరుకునేసరికి,

అలవాటు ప్రకారం టైం తప్పకుండా సినిమా హాల్లో యింటర్‌వెల్ గంట మ్రోగింది, జనం గుంపులు బయట కొస్తున్నారు.

మన్మధరావు అర్జంటుగా హాలుదగ్గరికి పోయడు!

ఒక మీసాల పెద్దమనిషినిపిలిచాడు. అడ్డంగా చుట్ట నోట్లోపెట్టుకొని ముందు కొచ్చి.

"ఏం" అన్నాడు అతను!

"ఈ హాల్లో ఏం సినిమా ఆడు తుంది?"

పెదాలు తడుపుకుంటూ అడిగాడు.

"ఏం కళ్ళు కనిపించటంలేదా? ఆ బోర్డుమీద రాసుందిగా చదువుకో."

అని నోటనింపుకున్న పొగ మన్మధ రావు ముఖాన వదిలి కోపంగా వెళ్ళి పోయాడు వాడు.

మన్మధరావుకు వికారం పుట్టింది!

బోర్డు చూశాడు

నెగ్గొటి ఇస్పీడుగా పోనియమ్రను ఇప్పుడు టాపొగ్గొటి సులోగా పోనియ్యమంత్రను!

"డౌను బావు. సులోగా పోదు. ఈ కబ్బుకి పోవాలంతే అంతా డౌనే."

"ఔను! నేనీ ఊళ్ళో అందరికన్నా డౌనై పోతున్నాను! నే చెప్పినట్టు చెయ్! విసుక్కున్నాడు!

రిక్షా చెప్పినట్టు విని రతన్‌లాల్ క్లబ్ ప్రాంగణంలో టైరు మోపింది!

మన్మధరావు రిక్షాదిగాడు.

''ఎంతియ్యమంటావ్!"

"తమ దయ బావు. వినయంగా అన్నాడు!

పర్సులోంచి రెండుకాగితాలు లాగి వాడిచేతిలో పడేస్తూ,

"సరే ఈ రెండు రూపాయలు తీసుకో."

హడావిడిగా క్లబ్బులో దూరాడు!

ఈయనకి నిజంగా పిచ్చిపట్టిందని రిక్షా వెళ్ళిపోయింది.

అమెరికా రాయబారిలా క్లబ్బంతా కలియ తిరిగాడు మన్మరరావు! ఇంతలో అప్పారావు ఆంజనేయులు ఎదురొచ్చారు.

"నువ్వు రావటం క్లబ్బుకు అందం వచ్చింది" అని ఆప్యాయంగా తీసుకుపోయి పేకాటలో కూర్చోపెట్టారు!

మన్మథరావు ఆట మొదలైంది.

హేండు బాగా రేజులో ఉంది! ముట్టుకుంటే డీలవుతుంది!

అరగంట వరకు మన్మథరావును ఎవరూ అడ్డుకోలేకపోయారు.

బుర్రలో లెక్కలు బయలుదేరాయి! అనందం అంతకంటె ముందు నడిచింది! మరో పదినిమిషాల్లో ప్రపంచాన్నే మర్చిపోయాడు! ఆకలి అంతకన్నా వెయ్యటంలేదు! మనసులో చీరెలు, గొన్లు మెదులుతున్నాయి!

నా కష్టాలన్నీ పటాపంచలైపోతాయని పట్టుదలతో ఆడుతున్నాడు. రెండుగంటలు హోరాహోరి యుద్ధం చేశాడు.

దశమారింది! సమయం చూసి క్లబ్బు గడియారం పన్నెండు గంటలు కొట్టింది! పోయే ప్రాణమేకాని వచ్చే ప్రాణం, కనిపించదు!

అతి కష్టంమీద అయ్యగారు ఆఖరు డ్రాపుతో లేచారు! ముఖం ఆముదం త్రాగినట్టు, పీకేసిన తోటకూరకాడలా వాడిపోయింది.

మన్మథరావు ఆర్తనాదం ఆలకించే దిక్కు లేదు.

కడుపులో ఫైరింజన్ గంటల్లా, ఆకలి మంటలు ఘోష పెడుతున్నాయి.

ఏమయినా తినాలంటే జేబులు కాళీ.

"ఎంత పొరపాటుచేశాను!

ఆ నైజాం హోటల్లో కనీసం టీ త్రాగినా బాగుండేది! పోని రాధకు ఆ చుక్కల టెర్లిన్ చీరె, బేబీకి ఎంబ్రాయిడరీ గౌనుకొని, సర్వాసరి ఇంటికి

"నడమంత్రపుసిరి" చదివాడు!

"ఓస్ ఈ సినిమా ఇదివరకే చూశాను! అందులో హోటల్ వాడికి లాట్రీలో తొమ్మిదిలక్షలు వచ్చింది."

నేనూ ఉన్నాను ఏంలాభం. వందల టిక్కెట్లు కొన్నాను! ఏదైనా వచ్చిందా? చచ్చిందా?

"పోనీ మరోసారి ట్రై చేస్తే అదృష్టం బాగుంటే అన్ని సమస్యలు తీరి పోతాయి."

మళ్ళీ ఆలోచనలు ముసురుతాయి. నెమ్మదిగా గుంపును, తోసుకుంటూ మస్తాన్ సాయిబు కిల్లీ కొట్టు చేరుకున్నాడు!

జేబులో చెయ్యిపెట్టి,

"ఏమండీ సంక్రాంతిముందు 'డ్రా తీసే టిక్కెట్లు ఉన్నాయా?"

ఉన్నట్టు తల ఊపాడు, వచ్చిన జనానికి సమాధానం చెప్పుకుంటూ, వాడు!

"ఉంటే! రెండు 'యం' సీరియల్- ఒకటి 'వి' సీరియల్-ఇంకోటి 'ఆర్' సీరియల్ ఇవ్వండి.

మస్తాన్ సాయిబు దగ్గర నాలుగు టిక్కెట్లు తీసుకుని, నాల్గు రూపాయలు ఇచ్చి బయలుదేరాడు.

ఇంతలో మన్మధరావు మెదడులో ఇంకో చక్కని ఊహ మెరిసింది!

"చాలా రోజులైంది!

ఎప్పుడో నా భార్య పుట్టింటికి వెళ్ళినప్పుడు వెళ్ళాను.

అన్నివిధాలా నా అదృష్టాన్ని పరీక్షించుకుందాం - దశ బాగుంటె దరిద్రం తీరుతుంది-బయలుదేరాడు.

దారివెంట పోతున్న పాత రిక్షావాడు కళ్ళబడ్డాడు!

"ఏయ్ రిక్షా నిన్నే, రా ఇటు!"

రిక్షావాడికి వణుకు పట్టుకుంది, కొంపతీసి ఇందాకిచ్చిన రూపాయి లాక్కుంటాడేమోనని. రిక్షా ఆపి తల గోక్కునేంతలో-

మన్మధరావు దర్జాగా ఎక్కి కూర్చున్నాడు.

రిక్షావాడికి మతిపోయింది!

తడబడుతూ-

ఎక్కడికి పోనియ్య మంతారు బావ్ అన్నాడు.

"రతన్ లాల్ క్లబ్బుకి."

రిక్షావాడు ఆలోచనలో పడ్డాడు.

"ఇంతకుముందు పీచు బేరాలు ఆడాడు! ఇప్పుడింత తెగింపు ఎట్లా వచ్చిందాని" లాగటం ప్రారంభించాడు.

"ఏయ్ కాస్త నెమ్మదిగా పోనియ్! అంత స్పీడెంగుకు!

"ఇదుగో టాపు తీసిపారెయ్! బయట చల్లని గాలొస్తుంది! ఏయ్ నిన్నే."

గట్టిగా అన్నాడు మన్మధరావు.

రిక్షావాడు ఆయోమయంగా...

"ఆదేటి బావు, ఇంవనక టాపు

నెగ్గొటి ఇస్పీడుగా పోనియమ్మను ఇప్పుడు టాపొగ్గొటి సులోగా పోనియ్యమంత్రను!

"డౌను బావు. సులోగా పోదు. ఈ కబ్బుకి పోవాలంతే అంతా డౌనే."

"ఔను! నేనీ ఊళ్ళో అందరికన్నా డౌనై పోతున్నాను! నే చెప్పినట్టు చెయ్! విసుక్కున్నాడు!

రిక్షా చెప్పినట్టు విని రతన్‌లాల్ క్లబ్ ప్రాంగణంలో టైరు మోపింది!

మన్మథరావు రిక్షాదిగాడు.

''ఎంతియ్యమంటావ్ !"

"తమ దయ బావు. వినయంగా అన్నాడు!

పర్సులోంచి రెండుకాగితాలు లాగి వాడిచేతిలో పడేస్తూ,

"సరే ఈ రెండు రూపాయలు తీసుకో."

హడావిడిగా క్లబ్బులో దూరాడు!

ఈయనకి నిజంగా పిచ్చిపట్టిందని రిక్షా వెళ్ళిపోయింది.

అమెరికా రాయబారిలా క్లబ్బంతా కలియ తిరిగాడు మన్మరరావు! ఇంతలో అప్పారావు ఆంజనేయులు ఎదురొచ్చారు.

"నువ్వు రావటం క్లబ్బుకు అందం వచ్చింది" అని ఆప్యాయంగా తీసుకు పోయి పేకాటలో కూర్చోపెట్టారు!

మన్మథరావు ఆట మొదలైంది.

హేండు బాగా రేజులో ఉంది! ముట్టుకుంటే డీలవుతుంది!

అరగంట వరకు మన్మథరావును ఎవరూ అడ్డుకోలేకపోయారు.

బుర్రలో లెక్కలు బయలుదేరాయి! ఆనందం అంతకంటె ముందు నడిచింది! మరో పదినిమిషాల్లో ప్రపంచాన్నే మర్చిపోయాడు! ఆకలి అంతకన్నా వెయ్యటంలేదు! మనసులో చీరెలు, గౌన్లు మెదులుతున్నాయి!

నా కష్టాలన్నీ పటాపంచలైపోతాయని పట్టుదలతో ఆడుతున్నాడు. రెండుగంటలు హోరాహోరి యుద్ధం చేశాడు.

దశమారింది! సమయం చూసి క్లబ్బు గడియారం పన్నెండు గంటలు కొట్టింది! పోయే ప్రాణమేకాని వచ్చే ప్రాణం, కనిపించదు!

అతి కష్టంమీద అయ్యగారు ఆఖరు డ్రాపుతో లేచారు! ముఖం ఆముదం త్రాగినట్టు, పీకేసిన తోటకూరకాడలా వాడిపోయింది.

మన్మథరావు ఆర్తనాదం ఆలకించే దిక్కు లేదు.

కడుపులో ఫైరింజన్ గంటల్లా, ఆకలి మంటలు ఘోష పెడుతున్నాయి.

ఏమయినా తినాలంటే జేబులు కాళీ.

"ఎంత పొరపాటుచేశాను!

ఆ నైజాం హోటల్లో కనీసం టీ త్రాగినా బాగుండేది! పోని రాధకు ఆ చుక్కల పెట్లన్ చీరె, బేబీకి ఎంబ్రాయిడరీ గౌనుకొని, సరాసరి ఇంటికి




పోయినా పోయేది! పాపం రాధ, సినిమాకు తీసుకుపోతానని ఎంత ఎదురు చూసిందో!

పైగా మీరు వచ్చేటప్పుడు, పాల డబ్బా తీసుకురండి, తెల్లవారితే దానికి పాలులేవు- జీతం అందిన వెంటనే మర్చి పోకుండా కొనండి అని మరీ మరీ చెప్పింది.

అదికూడా కొన్లేదు. ఇంటికి ఏ ముఖంపెట్టుకుని వెళ్ళేది.

తెల్లవారితే అప్పులవాళ్ళు ఇంటి ముందు కూర్చుంటారు! వాళ్ళకు ఏం సమాధానం చెప్పేది. వీళ్ళ సంగతి ఎట్లా ఉన్నా ఆ కాబూలీ సాయిబు నన్నొదిలి పెట్టడు. ఏదో యింతవరకు కాస్త పరువు వుందనుకుంటే, ఆ కాస్తా నడివీధిలో పెట్టి తీస్తాడు!

ఆ వడ్డీ యాభై రూపాయిలు వాడి ముఖానకొట్టినా పోయేది! దరిద్రుడ్ని ఎవరూ బాగుచెయ్యలేరు! అప్పుడు బుద్ధిపుట్టి చావలేదు!

ఆడవాళ్ళతో పోటీ పెట్టుకుని బోరున ఏడవాలనిపించింది.

ముఖం తుడుచుకుంటూ జేబులో ఉన్న లాటరీ టిక్కెట్లు బయటికి తీశాడు.

"వెధవ టిక్కెట్లు నా జీవితాన్ని పాడుచేశాయి! ఎన్నో ఇక్కట్లుపడి ఈ టిక్కెట్లు కొన్నానే! ఏ ఒక్కటైనా తగిలిందా? ఛ! ఇవి నా దగ్గర ఉండ కూడదు!

చించబోయాడు, చిరాగ్గా!

మనసొప్పలేదు.

"పోనీలే! ఇవే ఆఖరు టిక్కెట్లు! బాగుపడితే, వీటితోనే, బాగు పడాలి!

చింపబోయిన టిక్కెట్లు మూడు మడతలు పెట్టి ముందుజేబులో పెట్టుకున్నాడు. ఏంచెయ్యటానికి తోచదు ! మనస్సు పరిపరి విధాల పోయింది ! తెగించి ఇంటికి పోవాలని బయలు దేరాడు.

కాళ్ళాడవు.

ఆకలి మండిపోతుంది.

ఆలోచన తలచుట్టూ పరిభ్రమిస్తుంది.

కుర్చీలో కూలబడ్డాడు.

తల టేబులుమీదికి వాలిపోయింది !

మగత నిద్రపట్టిందేమో ?

క్లబ్బు గడియారం రెండుగంటలు కొట్టింది ఆవులిస్తూ.

మరో పదినిమిషాల్లో క్లబ్బు కాళీ అయ్యింది ! మన్మధరావు మాత్రం మగత నిద్రనుండి ఇంకా కోలుకోలేదు!

క్లబ్బు మేనేజరు దగ్గరా వచ్చి "సార్" అంటూ తట్టిలేపాడు !

రాధా... "బేబీ"... అంటూ కలవరిస్తూ కళ్ళు విప్పాడు మన్మధరావు !

బుర్ర మీసాల మేనేజరు ఎదురుగా కనిపించాడు ! అదిరిపోయాడు.

"నేనెక్కడున్నాను !..."

"ఇది క్లబ్బు సార్ ! టైం అయింది, ఇంటికెళ్ళండి !"

అంటూ తూలుకుంటూ వెళ్ళాడు మేనేజర్ క్లబ్బులో కొన్ని లైట్లు ఆరిపోయాయి !

మన్మధరావు నీరసంగా బయట కొచ్చాడు.

గాఢాంధకారం, — ఊరంతా నిర్మానుష్యంగా - నిశ్శబ్దంగా - నిర్మలంగా ఉంది !

ఆ నిశ్శబ్దాన్ని మధ్య మధ్య భంగం చేస్తూ ఊరు బయట నక్కలు. ఊళ్ళో కుక్కలు అక్కడక్కడ అరిచిన శబ్దం వినిపిస్తుంది !

వాతావరణం చల్లగా ఉంది.

ఆకాశంలో ముగ్గుపెట్టినట్టు చుక్కలు వెక్కిరిస్తున్నాయి.

వారంరోజులు హంగర్ స్ట్రైయిక్ చేసినట్టు అడుగులు లెక్కపెట్టుకుంటూ, కారు చీకట్లో కలిసిపోయాడు మన్మధరావు.





(గత సంచిక తరువాయి)

ఈ విధంగా రెండు నెలల పాటు ప్రయాణంచేసి జయిర్ బాద్ రాజ్యపు పొలిమేర చేరుకున్నాం మాకు ఒక మహానగరం తగిలింది. అందులో జనసంఖ్య విస్తారంగానూ, వాతావరణం అహ్లాదకరంగానూ ఉన్నది. ఆ దేశపు రాజు న్యాయనిర్ణయంలో సమర్థుడట. రైతులను చక్కగా కాపాడతాడట. ఆ నగరంచూస్తే నాకు ప్రాణం లేచివచ్చినట్టు తోచి, అక్కడ ఒక ఇల్లుకొని, నివాసం ఏర్పాటుచేసుకున్నాను. కొద్ది రోజుల విశ్రాంతితో ప్రయాణపు బడలిక తీరిపోయినాక, నేను ఇంటికి కావలసినవన్నీ కొని, ఆ యువతిని ధర్మసమ్మతంగా పెళ్ళాడి, ఆమెతో కాపురం చేశాను.

మూడేళ్ళు గడిచేసరికి నాకు ఆ నగరంలోని చిన్నలతోనూ, పెద్దలతోనూ పరిచయం ఏర్పడింది; పరపతి పుట్టించుకుని, వర్తకం సాగించి, చిట్టచివరకు అక్కడి వర్తకులనందరినీ మించిపోయాను.

ఒకరోజు నేను పెద్ద వజీరును చూడబోయేసరికి, మైదానంమీద గుంపులు గుమికూడి కనిపించారు. కారణం ఏమంటే, ఇద్దరు మనుషులు దొంగతనమూ, రంకుతనమూచేసి దొరికిపోయారనీ, బహుశా హత్యకూడా చేసి

ఉంటారనీ, ఆ నేరస్థులను రాళ్లతో కొట్టి శిక్షించటానికి తెచ్చారనీ చెప్పారు. ఈ మాట వినగానే నాకు నా అనుభవమే జ్ఞాపకం వచ్చింది; ఒకప్పుడు నాకూ అలాటి శిక్షే విధించబడింది, కాని దేవుడు నన్ను కాచాడు. ఇప్పుడు ఇలాటి దుస్థితిలో చిక్కుకున్నవాళ్ళు ఎవరో, వాళ్ళు నిజంగా నేరస్థులవునో, లేక నా లాగే నిర్దోషులో నాకు తెలీదు. జనంలో నుంచి తోసుకుంటూ నేను నేరస్థులున్న చోటికి వెళ్ళాను. వాళ్ళు నా అన్నలే! వాళ్లను చేతులు వెనక్కుపెట్టి కట్టేసి, తీసుకు వచ్చారు. వాళ్ల నెత్తికీ, పాదాలకూ రక్షలులేవు.

వారి దుస్థితి చూడగానే నాలో భ్రాతృప్రేమ పొంగి పొర్లింది, కడుపులో కెలికినట్టయింది. నేను భటులకు పట్టెడు బంగారం ఇచ్చి వారి శిక్ష కొద్దిసేపు వాయిదా వెయ్యమన్నాను. తరవాత గుర్రంమీద అతివేగంగా పాలకుడి ఇంటికివెళ్ళి, ఆయనకు విలువైన మణి అర్పించుకుని, నా అన్నల నేరాన్ని క్షమించమన్నాను.

"వారిమీద ఆరోపణ జరిగింది. వాళ్ల నేరం రుజువయింది. రాజుగారు తీర్పు చెప్పేశారు ఇప్పుడు నేను చెయ్యగలది ఏమీలేదు," అన్నాడాయన.

కాని, నేను ఎంతో ప్రాధేయపడిన మీదట, ఆయన ఫిర్యాదీని పిలిపించి, అయిదువేల వెండినాణాలు తీసుకుని ఆయన తన ఫిర్యాదు ఉపసంహరించుకునేటట్టూ, నేరస్థులను క్షమించేటట్టూ మాట్లాడాడు. నేను ఆ ఫిర్యాదీకి డబ్బు చెల్లించి, మళ్ళీ ఫిర్యాదు తీసుకురానని ఆయనచేత రాయించి పుచ్చుకుని, నా అన్నలను విడిపించాను.

మహారాజా! నేను చెప్పినదానిలో అబద్ధం ఏమన్నా ఉన్నదేమో వీళ్ళిద్దరినీ అడగండి! సరే, విడుదలచేయించి వాళ్ళిద్దరినీ నా యింటికితెచ్చి, స్నానం చేయించి, బట్టలిచ్చి, వాళ్ళు ఉండటానికి దీవాన్‌ఖానా (దివాణం) లో ఒక భాగం ఇచ్చాను. నా భార్యను వారికి పరిచయం చెయ్యక, వాళ్లకు చెయ్యవలసినదంతా నేనేచూసి, వారితోబాటే తింటూ, తాగుతూ, పడుకోవటానికిమాత్రం నా భాగానికి వెళుతూ వచ్చాను.

వాళ్ళు నా వెంట మూడేళ్లు ఉన్నారు. ఆ సమయంలో వాళ్ల ప్రవర్తనలో తప్పు పట్టదగినదేమీ నాకు కనిపించలేదు; నాకు అసంతృప్తి కలిగించలేదు. నేను బయటికి వెళ్ళి ఉండేటప్పుడు వాళ్ళు ఇంటివద్దనే ఉండేవారు. ఒకనాడు నా భార్య స్నానశాలకు వెళ్ళి ఇంటికి తిరిగి వచ్చి, ఎవరూ లేకపోవటంచూసి, పైబట్ట తీసేసింది. నా అన్న కిందపడుకుని ఉన్నాడు కాబోలు, మేలుకుని నా భార్యనుచూసి, ఆమెమీద వ్యామోహం పుట్టి, ఆ సంగతి నా పెద్దన్నకు చెప్పాడు. నన్ను హత్యచెయ్యటానికి

ఇద్దరూ కలిసి ఆలోచనచేశారు. అప్పట్లో నాకిదంతా తెలియక, "దేవుడి దయవల్ల నా అన్నలు ఈసారి బుద్ధిగా ఉంటున్నారు. వాళ్ళ ప్రవర్తన నిర్దుష్టంగా ఉంటున్నది. వాళ్ళు సిగ్గుతెచ్చుకుని ఉంటారు," అనుకునేవాణ్ణి.

ఒకనాడు భోజనాలయాక మా పెద్దన్న కళ్లనీళ్లు పెట్టుకుంటూ, మా ఇరాను దేశాన్ని మెచ్చుకుంటూ మాట్లాడసాగాడు. ఆ మాటలు విని చిన్నన్న నిట్టూర్పులు విడిచాడు.

"మన దేశానికి వెళ్ళాలని ఉంటే పోదాం పదండి. మీ కోరిక తీర్చటం మాట అలా ఉండగా నా కోరిక కూడా అదే. దేవుడు అనుగ్రహిస్తే మీతో నేనూ వస్తాను," అన్నాను. నేను నా భార్యకు మా అన్నల మనఃక్లేషం గురించీ, నా నిర్ణయం గురించీ చెప్పాను.

వివేకంగల నా భార్య, "నీ యిష్టం! కాని వాళ్ళు మళ్ళీ నిన్ను మోసంచేస్తారు. వాళ్ళు నీ ప్రాణానికి శత్రువులు. తాచుపాములను చేరదీసి, వారి విశ్వాసంలో నమ్మకం ఉంచుతున్నావు. చెయ్యదలచినది చెయ్యి, కాని వాళ్ళు దుష్టులన్నది మరవకు,'' అన్నది.

సాధ్యమైనంత త్వరలో ప్రయాణ సన్నాహాలు పూర్తిచేసి, మైదానంలో గుడారాలు వేశాం. సార్థవాహులు చాలా మంది చేరారు. నన్ను బిడారుకు నాయకుడుగా ఎన్నుకున్నారు. మంచి ముహూర్తంచూసి బయలుదేరాం. నేను నా అన్నల కోరికలన్నీ నెరవేర్చుతూ, వారికి అన్ని సౌకర్యాలూ అమర్చుతూ కూడా వారిని గురించి హెచ్చరికగా ఉంటూ వచ్చాను.

ఒకరోజు మేం మజిలీచేసి ఉండగా నా చిన్నన్న నా దగ్గిరికివచ్చి, "ఇక్కడికి నాలుగు మైళ్ళదూరంలో నందన వనంలాంటి అందమైన ప్రదేశం ఉన్నది. రేపు అక్కడికివెళ్ళి నా ప్రయాణపు బడలిక అంతా తీర్చుకోవాలని ఉన్నది," అన్నాడు.

"నువు కోరితే లేనిదేమున్నది? కావాలంటే రేపు ప్రయాణం కట్టిపెట్టి, అక్కడికి పోయి వినోదింతాం," అన్నాను.

"అంతకంటె కావలసిందేమిటి?" అన్నాడతను.

మర్నాడు ప్రయాణంలేదని బిడారుకు తెలియజేసి, వినోద ప్రయాణంమీద పోతున్నాం కనక భోజనాదులు సిద్ధం చెయ్యమని నా సేవకులకు చెప్పాను. తెల్లవారుతూనే నా అన్నలు దుస్తులూ, ఆయుధాలూ ధరించి, ఎండ ఎక్కక ముందే చేరుకోవాలని నన్ను ప్రయాణం కమ్మని తొందర పెట్టారు. నేను గుర్రాన్ని సిద్ధంచెయ్యమని ఉత్తరువిచ్చాను. కాని వాళ్లు, "గుర్రంమీదపోయిన దానికన్న కాలినడకనపోతేనే ఆ ప్రదేశం సౌందర్యంమరింత బాగా చూడవచ్చు. కావ

"నారాయణ మినహా" అన్నది వ్యంగ్యంగా.

కోమలి, హరనాథ్ ప్రేమోదంతం ఇందిరకుతప్ప, హాస్టల్‌లో ఎవరికీ తెలియకపోయినా, కోమలి క్రుంగిపోవడం, మారిపోవడం అందరూ గుర్తించారు. మీనాక్షి వెళ్లి విశాలకు చెప్పింది జరిగిందంతా. విశాల వెంటనే కోమలి గదికి వచ్చింది. అక్కడ ఇందిర ఉన్నది. కోమలి ఆమెకు మాట్లాడే అవకాశం యివ్వలేదు.

"నేనే మీకోసం వద్దామనుకుంటున్నాను మేడం. పదండి పోదాం" అని వెంటనే విశాల గదికి వచ్చారు.

"నాకు ఒకరి వ్యక్తిగత విషయాలలో, జోక్యంకలిగించుకునే హక్కు లేదు కోమలీ. అయినా నీవు నా ఆత్మీయురాలివి, కనుక...".

'థాంక్స్' అన్నది కోమలి బాధగా నవ్వి.

"కోమలీ, నువ్వు జీనియస్‌వి అందుకే నువ్వంటే నాకు మొదటనే ప్రత్యేకమైన అభిమానం ఏర్పడ్డది. మనకు పుస్తకాలవల్ల వచ్చే విజ్ఞానంకన్న, జీవితంలో స్వానుభవంవల్ల నేర్చుకునేదే విలువైనది, నిజమైనది. కష్టాలను, ఎదుర్కొని సమస్యలను పరిష్కరించగలిగినపుడే బుద్ధి వికసిస్తుంది. బాధలవల్ల, మానవ హృదయపులోతులు తెలుస్తాయి. వ్యక్తిగతం సుఖపడకూడదని, తృప్తిపడరాదని నేననను కాని అది ఎక్కడోగానీ లభించదు, మనవంటి విద్యావంతులకు. అమృతపాత్ర నోటికి అందేసమయంలో చేజారిపోతుంది. అమృతం నేలపాలవుతుంది, కనుక మనం, మనఆత్మల్ని మరచిపోయి బ్రతకటం నేర్చుకోవాలి. అభిమానాలు, ఆత్మీయతలు పెద్దగా పెంచుకోకూడదు".

"నిజం మేడం, మీరు చెప్పింది అక్షరాలా నిజం. నేనూ కాబోయే డాక్టర్ని. రోగాలతో బాధపడేవారికి సేవచేయడం నా వృత్తిధర్మం.... మానవధర్మం. అందుకు నేను పూర్తిగా అంకితం అవుతాను. పోగొట్టుకున్నదానివిలువ కట్టరేం. అది తిరిగి లభించదు".

"నీవు అందరివంటిదానివి కావు కోమలీ."

"విశాలగారూ, కొన్ని బాధలకు మందులున్నాయి హృదయానికి తగిలిన దెబ్బకు, ఆ బాధకు మందులేదు."

"కానీ మనిషి ఆశాజీవి. ప్రేమలేని జీవితం లేదు."

"నాకు రెండూలేవుగా విశాలా! ఆశాలేదు, ప్రేమాలేదు."

"నువ్వు ఆ రెంటినీ పొందగలవు కోమలీ, వాటికి చావులేదు. ఎప్పటికప్పుడు అవి చిగుర్చుతుంటాయి. కొత్తకొమ్మలు, రెమ్మలు పుట్టుకొస్తాయి."

"చచ్చిపోయినచెట్టు చిగురుస్తుంటాయా."

"పైకి ఎండినట్లు కనిపించినా, జీవం వేళ్లలో ఉంటుంది. ఆ జీవశక్తిని సామాన్యులు గ్రహించలేరు. నీవు ఇంకా చిన్నదానివి. విశాలమైన జీవితం నీ ముందున్నది. కాలమే గాయాలను మాన్పుతుందని నాఅనుభవం,నమ్మకం."

"కాలమంటే నాకు మంట."

"అయినా, మనం కాలాతీతవ్యక్తులం కాలేంగదా."

విశాలమాటలవల్ల కోమలి మారిందీ, లేనిదీ చెప్పలేం. రోజులు మామూలుగా గడుస్తున్నాయి. ఆ విషయం ఇంటికి రాయలేదు, అనవసరం. ఒకసారి ఇంటికి వెళ్లివస్తే, వాతావరణం మార్పువల్ల మనస్సు కొంత కుదుటబడుతుందని అనుకున్నది వెంటనే బయలుదేరి వెళ్లింది.

*   *   *

## 26

అక్కడ శోభ అచ్చట్లు, ముచ్చట్లు, మరేం కనిపించలేదు. శోభ గర్భిణీ అట. మహాసంబరంగా వున్నారు. తనను గురించి ఎవరూ అంతగా పట్టించుకోలేదనలు. ఏంతోచక ఆలోచనలు ముసురుతుండగా, వెంటతెచ్చుకున్న పుస్తకాలు ముందువేసుకునేది.

శోభ ఇందిరగురించి అడిగిందిగానీ, కోమలి అంటీముట్టనట్లు సమాధానం చెప్పి తప్పించుకున్నది.

ఒకరోజున రజని నిలదీసి అడిగింది: "ఏమిటి కోమలీ, ఏమైంది? ఎప్పుడువచ్చినా నవ్వుతూ, పేలుతూ ఆనందంగా వుండేదానివి. ఈసారి ఇంతదిగులుగా ఉంటున్నావేం! ఎవరినైనా ప్రేమించావా! చెప్పమ్మా! వయస్సు అలాంటిదమ్మాయ్. అలాగ ప్రేమించడం తప్పని నేననను వయస్సులో ఉన్నావ్, యవ్వనంలో కోర్కెల్ని నిగ్రహించుకోవటం కష్టమే. నాలుగు రోజుల్లో డాక్టరవబోతున్నావ్. స్వేచ్ఛగా బ్రతకగలవు స్వేచ్ఛగా ప్రేమించనూ వచ్చు. కన్నతల్లిదగ్గర దాపరికం ఎందుకమ్మా.. ఈడొచ్చిన కూతురు, స్నేహితురాలితో సమానం నువ్వు సుఖపడటమే నాకు కావలసింది కోమలీ. కిరీటినిగురించి వార్తలు తెలుస్తూనే వున్నాయి. అయినా నీకు ఇష్టం వుండదని నీకు చెప్పటంలేదు. అతను మళ్లీ పెళ్లిచేసుకోలేదుట. అసలు ఆ ఆలోచనే లేదట పాపం. ఏమైనా నువ్వు అతని భార్యవు. అగ్నిసాక్షిగా పెళ్లిచేసుకున్న భర్త అతను. లోపల ఎవరున్నదీ తెలుసుకోకముందే ప్రేమమందిరం తలుపులు మూసుకుంటాయి కోమలీ! నీవు అత్తవారింటినుండి వచ్చినప్పుడు పెద్దగా బాధపడలేదు. కానీ ధైర్యంతో భవిష్యత్తులో ఒంటరిగా, ఏకాకిగా ప్రయాణం చేయడానికే సిద్ధమైనావంటేనే భయం పట్టుకున్నది. ఆడది జీవితనౌకను ఒంటరిగా నడపలేదమ్మా, కోమలీ. ఎవరికైనా మనసిచ్చావంటే, ప్రేమించగలిగా

వంటే మంచిదే. పాతగాయం వెంటనే మానిపోతుంది."

"ఏంలేదమ్మా! నాకే సమస్యలూ లేవు" అన్నది కోమలి.

తల్లి ఇచ్చిన దీర్ఘోపన్యాసంగురించి రాత్రి ఒంటరిగా కూర్చుని ఆలోచించుకున్నది. కన్నతల్లితోకూడా మనస్సు విప్పి చెప్పుకోలేని రహస్యం అయింది తనబ్రతుకు. నోరువిప్పి చెబితే అమ్మ హర్షిస్తుందా! ఏమో! ఒకవేళ హరి బ్రతికేవుంటే హర్షించునేమో! ఇప్పుడు తనబ్రతుకు ఇలా బండలైందంటే నవ్విపోదూ!

నిద్రలో హరనాధ్ కనిపించాడు. అతను తనను ప్రేమగా కావలించుకుని ముద్దుపెట్టుకున్నట్లు కల. కలతపడి లేచింది. ఏడుపు వచ్చింది. పెద్దగా, ఏడవడానికికూడా తనకు హక్కులేదు.

*   *   *

## 27

తర్వాత మూడేళ్లపాటు జీవితంలో ఒక నిర్లిప్తతను అలవరచుకున్నది. తాను నిమిత్తమాత్రురాలు. సాక్షి మాత్రంగా ఉండేది. హాస్పిటల్ గ్రేడ్స్ అన్నీ గడుస్తున్నాయి. డాక్టర్లు అవుట్ పేషెంట్సుని పరిశీలించడం కొత్త విద్యార్థులకు ఆసక్తికరంగా ఉండేది. కొందరు నిర్లక్ష్యంగా ప్రశ్నిస్తే, కొందరు గుచ్చి గుచ్చి అడిగేవారు. రోగులు బాధపడినా వీరికి పట్టదు రోగుల్ని తమవంటి మనుష్యులుగా భావించి మర్యాదయిచ్చి, వైద్యంచేసేడాక్టర్లు బహుస్వల్పం. ఏదైనా విచిత్రమైనకేసు, అచ్చుపుస్తకాలకు అందని కేసువస్తే డాక్టర్లంతా తల్లడిల్లేవారు. అప్పుడే వారికి అగ్నిపరీక్ష. పేదవారిపట్ల సహజంగా డాక్టర్లకు నిర్లక్ష్యం జాస్తి.

ఈ డాక్టర్లకు దయ, జాలి ఎందుకుండవో కోమలికి అర్థంకాలేదు. వచ్చే వారికి రోగాలంటే భయం. మందులంటే భయం, డాక్టర్లంటే భక్తి. వారు, వీరు మనుషులేనన్న భావం వారికి, వీరికి ఉండదు.

వార్డులలోని కేసులన్నీ తనకు సీరియస్ కేసులుగానే అవుపించేవి. అందరికీ ప్రత్యేకశ్రద్ధ చూపాలి. చాలమంది చావు దగ్గరకు వచ్చాకగాని, ఆస్పత్రికి రారు. వచ్చినా ఇన్‌పేషెంట్సుగా చేరరు. అలా మృత్యువును ప్రక్కన పెట్టుకుని చికిత్సచేయాలి. సర్జరీలో మరీ బాధవేసేది. అవతల రోగిని కోస్తూ, సర్జన్ తన ప్రతిభను వెల్లడి చేసేవాడు. విద్యార్థులు ఆ రోగి ప్రాణాలను లక్ష్యపెట్టకుండా అతని శరీర భాగాలతో విద్య నేర్చుకోవాలి. ఆ క్షణంలో వారికి, ఆ రోగి తమవంటి మనిషి అన్నజ్ఞానం ఉండకూడదు.

జనరల్ వార్డులకీ, స్పెషల్ వార్డులకీ తేడా వుంటుంది. స్పెషల్‌వార్డులలో గౌరవాలు, హోదాలు ఎక్కువ జనరల్

వార్డులలో పేదవారిపట్ల ఎంత నిర్దయగా అమర్యాదగా ప్రవర్తిస్తారో, స్పెషల్ వార్డులలోనివారికి అంత గౌరవం ఇస్తారు. రోగులనేకాదు, అతని బంధువుల్ని, స్నేహితుల్ని మర్యాదగా చూస్తారు అక్కడ రోగం చిన్నదైనా వందలు, వేలు ఖర్చుఅవుతుంది. పరామర్శకులు మిక్కిలిగానే వుంటారు.

స్త్రీలవార్డులు మరీ దుస్థితిలో ఉంటాయి. ఆడవారికి వైద్యంపట్ల శ్రద్ధ తక్కువ. చెప్పినా అర్థంచేసుకోరు. ఇచ్చిన మందులు వాడరు. మంచి తిండి తినరు. పస్తులుంటే ఉపవాసాలు చేసినంత పుణ్యం వస్తుందని భావిస్తారు. అక్కడ అన్నీ ప్రమాదకరమైన కేసులే. చావుబ్రతుకుల కేసులెక్కువ. పద్దాను గేళ్ల సరిగానిండని అమ్మాయిలు కడుపుతోఉండి ఆస్పత్రికి రావడం ఆశ్చర్యంగా వుంటుంది. కొందరు, చాటుగా, మాటుగా, కక్కుర్తిపడి కడుపు చేసుకుని, అబార్షన్‌కోసం వచ్చేవారిని చూస్తే జాలివేసేది కోమలికి.

కోమలికి ఆస్పత్రిజీవితం విచిత్రమనిపించేది. ప్రపంచంలోని దైన్యం, దరిద్రం, బాధలు, ఏడ్పులు ఇక్కడికే తరలివచ్చాయా అనిపించేది. ఎంతగా మనసు మార్చుకున్నా హరనాథ్ జ్ఞాపకాలు ఆమెను వదలడంలేదు. అది ఆమె జీవితంలో మరువలేని మధుర స్మృతి. అతన్నిగురించి ఎప్పుడూ, ఎవరితోనూ ముచ్చటించదు. చివరకు ఇందిరదగ్గిరకూడా ఆ ప్రస్తావనరాదు. కానీ నారాయణవిషయం ఇందిర ఏం చెప్పినా ఆసక్తిగా వినేది. అవసరమైన సలహాలు ఇచ్చేది.

అతనంటే ఇప్పుడు కోమలికి కోపం లేదు. ఇందిర అతన్ని తరుచు కలుస్తూనేవుంది. కానీ ఇందిరకు అతనంటే వెనకటి మోజుఉన్నట్లు కనిపించడంలేదు. ఆత్రుతలేదు. ఎప్పుడో వారానికి ఒకమారు కలుస్తుంది. అంతేనా ప్రేమంటే? తను హరనాథ్‌ని ప్రతిక్షణం కలుసుకోవాలని తహ తహలాడేది. అతనూ తనకోసం అనుక్షణం కలవరించేవాడు. గంటలకొలదీ, ఒకరి సమక్షంలో ఒకరు గడిపేవారు. కౌగిలిలో కరిగిపోవాలనిపించేది. ఆ ఆరాటం వీరిద్దరిలో కనిపించదు. నారాయణ కూడా ఇందిరతో అంతమాత్రంగానే వుంటున్నాడు. అతనిలో ఎంతవెతికినా ప్రేమికుని లక్షణాలు కనిపించవు.

నారాయణ తనకు బొంబాయిలో ఉద్యోగం వచ్చిందని వెళ్లిపోయాడు. ఇద్దరిమధ్య కొంతకాలం ఉత్తరాలు నడిచాయి. తర్వాత అవీ తగ్గాయి. ఒకనాడు, అనుకోనివిధంగా నారాయణ పెళ్లి శుభలేఖ వచ్చింది. ఇందిర ఆ శుభలేఖను తెచ్చి నవ్వుతూ కోమలికి చూపించింది. కోమలి షాక్ తిన్నది.

"నాకేగనక ఇలాజరిగితే తలతిరిగి

పడిపోయేదాన్ని ఇందిరా. నువ్వు ఎలా నవ్వగలుగుతున్నావో నాకర్థం కావటం లేదు. అతన్ని చూచాక నాకు జ్ఞానోదయం కలిగింది. ఇంతకుముందు ప్రేమకు చావు లేదనుకునేదాన్ని. ఇప్పుడు ప్రేమకూడ చచ్చిపోతుందని తెలుసుకున్నాను. శుభాకాంక్షలు పంపనా?" అడిగింది.

అంతటితో ముగిసిందనుకున్న అధ్యాయం, పెళ్లిఅయిన తర్వాత నారాయణ వ్రాసిన ఉత్తరంతో మళ్లీ ప్రారంభమైంది.

డియర్ ఇందిరా,

నీ శుభాకాంక్షలకు నా కృతజ్ఞతలు. శుభలేఖచూచి నీవు ఏమైపోతావోనని భయపడ్డాను. నన్ను శపిస్తావని అనుకున్నాను. అనుకోకుండా బొంబాయిలో ఉద్యోగం వచ్చింది. అనుకోకుండా పెళ్లి జరిగింది. ఏమిటి నాకు అన్నీ అలాగే జరుగుతున్నాయి. కోరుకున్నవి కావు. నీతో స్నేహము అంటే నీకు అన్యాయం జరిగిందేమో! కానీ కాదు!

హరనాథ్ చనిపోకముందు నేను నిజంగా ప్రేమించింది నిన్నుకాదు, కోమలిని. ఆమె హరనాథ్‌ని ప్రేమిస్తున్నదని తెలిసినప్పుడే, నేను ఆమెను గాఢంగా వాంఛించాను. అసూయా ద్వేషాలతో కోమలిని నానామాటలు అన్నాను. అయినా నేను కోమలిని మరచిపోలేను ఆమె ప్రేమను పొందే హక్కు లేకపోయినా మనసులో ఆరాధించవచ్చుగదా! కోమలిని కలుసుకోవడమే నా జీవితంలో ఒక మలుపు. అదే క్లైమాక్సు. ఆ తర్వాత నాలో పెరుగుదల లేదు.

ఇందిర ఆ ఉత్తరాన్ని కోమలికి చూపించింది.

"నారాయణ నిన్ను ప్రేమించిన విషయమే నాకు తెలీదు కోమలీ" అన్నది.

"ఇప్పుడేమనిపిస్తోంది.'' సూటిగా ప్రశ్నించింది కోమలి. "మనం సత్యం గ్రహించలేని అంధులం" ఇందిర జవాబు.

"అది బాహ్యదృష్టి ఇందూ. అందుకే అంతర్‌దృష్టి కావాలన్నారు. జ్ఞాననేత్రం విప్పిచూస్తే అంతా నిర్మలంగా నిశ్చలంగా కనిపిస్తుంది. నీకున్నదా ఆ మూడవ నేత్రం?"

కోమలిమనస్సులో ఇప్పుడు హరనాథ్ జ్ఞాపకాలు, కిరీటి జ్ఞాపకాలు సమంగా నిలిచిపోయాయి. ఇద్దరినీ మరచి పోవటానికి ప్రయత్నిస్తుందిగానీ, ఇద్దరినీ మరువలేకపోతున్నది.

*　*　*

## 28

శోభకు కూతురు పుట్టింది. వాసంతి పెళ్లి అయింది. పెళ్లికాగానే జబ్బు పడ్డది. రజని బెల్గ్రాం యిచ్చి కోమలిని పిలిపించింది. కోమలి తన వైద్యపరిజ్ఞానం అంతా ఉపయోగించి

వాసంతికి చికిత్సచేసింది. ఆ అమ్మాయి వెంటనే కోలుకున్నది.

ఒకరోజున రజని తీరికగా కోమలి దగ్గిరచేరి అన్నది, "ఇద్దరి పెళ్లిల్లు అయ్యాయి కోమలీ. కొంతభారం తీరింది."

కోమలి అక్కడ వుండగానే ఇందిర వచ్చింది. ఆమె రాకకు అందరూ సంతోషించారు. నాలుగు రోజులు సరదాగా గడిచాయి. అందరూ కలిసి సినిమాకు వెళ్ళారు. అదొక హిందీ పిక్చర్. మామూలు ప్రేమపురాణం. ఒక పల్లెటూరులో ప్రారంభం అవుతుంది కథ...బస్తీలో చదువుతున్న పల్లెటూరి యువకుడు తన క్లాస్‌మేట్ ఒకమ్మాయిని ప్రేమిస్తాడు. అతను డబ్బు గలవాడు. ఇద్దరూ జల్సాగా తిరుగుతారు. ఆ అమ్మాయి ఆధునాతన యువతి కారులో అబ్బాయిని తీసుకుని షికార్లు కొడుతుంది. అతనితోకలిసి తన ఊరు వెళుతుంది. అక్కడ హీరో, అమ్మాయి అక్కను చూస్తాడు. ఆ అమ్మాయి సంప్రదాయంగా పెరిగిన పిల్ల. ఇతనిని చూచి సిగ్గుపడుతుంది. ఇతను ఆమెను ప్రేమిస్తాడు. ఇద్దరు అమ్మాయిలకు పోటీ. ఇద్దరిలో ఒకరు త్యాగం చేస్తారు. ఒకరికి హీరోతో పెళ్లవుతుంది. ఆ మొదటి అమ్మాయిని చూడగానే ఇందిర కోమలి చెవిలో ఏదో రహస్యం చెప్పింది.

ఆ అమ్మాయి మీనాక్షి.

సినిమానుండి వచ్చాక రజనికి మీనాక్షినిగురించి చెప్పారు. మీనాక్షి మద్రాసువదలి రెండేళ్లయింది. కమ్మగా పాడుతుంది. ఇప్పుడు సినీమాలో చూచాం. మా రూంమేటు. అంతకన్న మంచిస్నేహితురాలు."

మీనాక్షికి ఉత్తరం రాయాలని అనుకున్నారు కోమలి, ఇందిర. మద్రాసు వచ్చాక పద్మిని విషయం ఆరాకీ తీశారు. పద్మిని అంటే అసలు మీనాక్షి. ఆమె సినిమాపేరు పద్మిని. ఇందిర పద్మినిపేర ఉత్తరం రాసింది, ఆ సినిమాకంపెనీ అడ్రసు సంపాదించింది. అసలు తమ ఉత్తరం ఆమెకు చేరుతుందన్న నమ్మకం లేదు. కానీ ఒకరోజు మీనాక్షినుండి జవాబు రానేవచ్చింది.

"ఇందిరా డియర్!

నీ ఉత్తరం చూచి మూర్ఛపోయినాను అనుకో. ఆలస్యం చేసినందుకు మన్నించు. వెరీ బిజీ. తీరికలేదు. చచ్చిపోదామన్నా తీరికఉండని ఉద్యోగం నాది. నా గురించి వ్రాయమన్నావు, ఏమని వ్రాయను. నేను ప్రేమను నమ్ముకుని, అమ్ముకుని బ్రతుకుతున్నాను. అదే నా ఉజ్వలస్థితికి కారణం. నన్ను తారాపథానికి తీసుకువెడుతున్నదీ అదే. మీకు ప్రేమించడం తెలియదు. దాని పవరు, పొగరు తెలియదు మీకు. కానీ నేను ప్రేమను ఎరవేసి, పైకి

పైపైకి ఎగబాకుతున్నాను. అదివరకు సుఖాన్ని జుర్రుకోవడమే నా లక్ష్యం. అవన్దా కోమలికి జ్ఞాపకం ఉంటే ఉత్తరం వ్రాయమను. ఐ లైక్ దట్ పూర్ గల్."

ఆ ఉత్తరం కోమలి చదివి నవ్వుకుంది.

"మీనాక్షి మారలేదు ఇందూ, నేను బొంబాయి ఎటుగూడీ వెళ్లలేను. పర్సనల్గా చూద్దామని వుంది. పోనీ ఓ ఉత్తరం రాస్తాను."

"మీనాక్షికి జీవితమే ఒక రొమాన్స్" అన్నది ఇందిర.

పరీక్షలైనాయి. ఇద్దరూ పాసైనట్లే... ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకున్నారు, కన్నీటితో.

"ఉత్తరాలు రాస్తుంటావు కదూ" కోమలి రుద్ధకంఠంతో అడిగింది. విడిపోవడం ఇద్దరికీ బాధగానే వుంది.

"ప్రేమ చావదు కోమలీ" అన్నది ఇందిర. కోమలి మాటలు తిరిగి ఆమెకే వప్పగిస్తున్నట్లు అవుపించినా, అందులో ఆత్మవేదన కనిపించింది. ఆ మాటతో కోమలి గతంలోకి జారుకున్నది. హరనాథ్ వచ్చి ఎదుట నిలిచినట్లే అయింది. తనను కౌగిలించుకున్నట్లే తోచింది. తాము స్వేచ్ఛగా పెళ్లిచేసుకోవాలనుకున్న ముహూర్తం వచ్చింది కానీ అతను లేడు. అతని స్మృతిమాత్రం బాధాకరంగా మిగిలిఉంది. కేవలం ఊహాలోకాల్లో విహరించడంవల్ల మానసిక తృప్తి లభించదు, శారీరక తృప్తి సాధ్యం కాదు. రెండూ అసంభవాలే. కోరికలు కలల్లో తీరటం, నిజంగా తీరటం కాదుగా.

"ఏడుస్తున్నావా కోమలీ, మనం ఆనందంగా విడిపోవలసిన సమయంలో కన్నీరా ?''

"ఏమిటో ఇందూ ! పసిపిల్లలు చందమామను అందుకోవాలని మారాంచేస్తారు. ఏడుస్తారు. చంద్రుడు అందంగా ఉంటాడు కానీ అందడు. మన స్వప్నాలు మధురంగా ఉంటాయిగానీ అనుభవానికి అందవు. మనం రెంటికీ దూరులం."

"ఐయామ్ సో...కోమలీ, నిన్ను... పెట్టాను."

"లేదు లేవోయ్. హరి జ్ఞాపకం వచ్చాడు. నేను అతన్ని ఎంతగా ప్రేమించానో నీకు తెలియదు ఇందూ. అతన్ని, అతని జ్ఞాపకాలను నాలోనే భద్రంగా దాచుకున్నాను.''

''అదొక కల అనుకుని మరచిపోలేవా కోమలీ".

"నాకు కలలు వద్దు. నా 'హరి' నాకు కావాలి."

''అతను చచ్చిపోయాడుగా."

"అదే ఇంకా నేను నమ్మలేకపోతున్నాను ఇందూ. నేనే అతన్ని దూరం చేసుకున్నానేమో ! పిరికితనంవల్ల, ఏమీ అనుభవించలేకపోయాను. అతనికి

ఆ అవకాశాన్ని యివ్వని పాపిని నేను. అలాగాక, మరొకలా జరిగి వుంటే, మాకే ఒక బిడ్డ కలిగి ఉన్నట్లయితే ఆ బిడ్డలో, హరిరూపాన్ని చూచుకుంటూ బ్రతికేదాన్ని. నేను మూర్ఖురాల్ని ఇందిరా! సుఖపడడం చాతగాని అవివేకిని."

"అసంభవం!"

ఆ రాత్రి అంతా అవే ఆలోచనలు, అవే కలవరింతలు. అతనే ప్రాణం పోసుకుని వచ్చాడు ఆమె కోసం, "నా చదువైంది. నేను స్వేచ్ఛాజీవిని. నీ కోరిక తీర్చుకో హరి. నేను నీ దాన్ని. నా అభ్యంతరం లేదు" అన్నది అతనితో.

అంతలో హైదరాబాదు, ఆ ఇల్లు, కిరీటి జ్ఞాపకం వచ్చారు ఉన్నది కొద్ది గంటలే అయినా, ఆ ఇల్లు, ఆ మనుషులు తనకు మరపుకు రావటంలేదు.

"నేను నీకు ఋణపడివున్నాను కిరీటీ! నీ మూలంగా, నీ కారణంగానే నాకిన్ని కష్టాలు, కన్నీళ్ల ప్రాప్తించాయి. కొంత సుఖానుభూతి నీ వల్లనే కలిగింది. ఆ రోజు నువ్వు నన్ను శాసించి ఉన్నట్లయితే, బలవంతంగా, నా అయిష్టాన్ని ఖాతరుచెయ్యకుండా నన్ను నీదాన్నిగా చేసుకుని వుంటే ఏమయ్యేది? నేను నీ భార్యగానే ఉండిపోయేదాన్ని. ఎన్నేళ్లు వ్యర్థమైనాయి. ఎన్ని వేల వెన్నెల రాత్రులు వృథా అయ్యాయి. నేను కాదు, నువ్వే పిరికివాడివి. ఆడది కాదంటే, అధైర్యపడి, ఊరుకునే పిరికివాడివి నీవు. నీకు చొరవలేదు, ధైర్యంలేదు."

అతని ఆలోచన ప్రక్కకు నెట్టగానే, ఆ స్థానం హరనాథ్ ఆక్రమించాడు. హరితో పరిచయం యావత్తూ ఒక కల. ఆ ఇద్దరూ ఆమెను ఉక్కిరిబిక్కిరి చేశారు. కల కరిగిపోయింది. మెలకువ వచ్చింది.

"కిరీటిని పెళ్లాడినప్పుడు ఇలా జరుగుతుందని అనుకున్నానా? హరనాథ్‌ను కలుసుకున్నప్పుడు ఇలాగ జరుగుతుందని కలగన్నానా? కిరీటి నా జీవితంనుండి నిష్క్రమించాడు. హరనాథ్ పూర్తిగా అస్తమించాడు. ఏమిటో జరుగుతోంది. నా ప్రమేయం, ప్రయత్నం లేకుండానే ఏవేవో జరుగుతున్నాయి. వీటికి అంతం లేదా? నా ఒంటరితనం తొలగిపోయేదెలా? శారీరకంగా తృప్తి కలిగితేగానీ, మానసిక శాంతి లభించదా?

ఏదీ నిర్ణయించుకో లేకపోయింది కోమలి.

* * *

## 29

ఇంటికి వెళ్లిన కొద్దిరోజులలోనే పరీక్షా ఫలితాలు వచ్చాయి. వెంటనే మెడికల్ సర్వీసెస్‌కు అప్లికేషన్ పెట్టింది. ఇంటర్వ్యూ నామమాత్రంగా జరిగింది. వెంటనే పోస్టింగ్ ఆర్డర్సు వచ్చాయి. తెలంగాణా ప్రాంతంలో అదొక వెనుక

బడ్డ ప్రాంతం. ఊరు పెద్దదే అయినా పట్టణం సౌకర్యాలు తక్కువ. తమ ఊరికి అట్టే దూరంకాదు. ఇరవైమైళ్లు. పోస్టింగ్ రాగానే ఇందిరకు ఉత్తరం రాసింది.

పెట్టెలు, బెడ్డింగ్ సర్దుకుని తల్లిని కూడా తోడుగా రమ్మన్నది. రజని తన ఒంట్లో బావుండటం లేదని, తర్వాత వస్తానని సాకుచెప్పి తప్పించుకున్నది. పని పాటులకు సాయంగా ఉంటుందని, శోభ ఇంట్లో పనిచేసే పిల్లను వెంట తీసుకువెళ్లింది.

ఊరు పెద్దదేగాని, ఆస్పత్రి బహు చిన్నది. పరమ అసహ్యంగా ఉన్నది. మద్రాసు నగరంలోని ఆస్పత్రులతోనే ఆమెకు పరిచయం. ఇక్కడ దీన్ని చూచాక ఇదీ ఆసుపత్రేనా అనిపించింది.

కోమలి కాక, ఆ ఆస్పత్రిలో మరో ఇద్దరు డాక్టర్లున్నారు. సుందరం, రావు. లేడీడాక్టరుకు కేటాయించిన బంగళా, పాడుబడ్డ కొంపలా వుంది. కొంత కాలంగా అక్కడ మనుష్య నివాసం ఉన్నట్లు లేదు డాక్టర్ సుందరం, రావు ఇద్దరూ పెళ్లయినవాళ్లే, కుటుంబాలతోనే వుంటున్నారు.

ఆస్పత్రిలో అడుగుపెట్టగానే అది అనారోగ్య కేంద్రం అనుకున్నది. ఇద్దరు, ముగ్గురు ఆయాలు అటు ఇటు తిరుగుతున్నారు. బోర్డుల్నిబట్టి ఒకటి మెటర్నిటీ వార్డు అనీ, ఒకటి ఉమెన్స్ వార్డు అనీ గుర్తించింది. ఆవరణలో పెంటకుప్పలు చెత్త, చెదారం పుష్కలంగా ఉన్నాయి.

కోమలి బంగ్లా చిన్నది. నాలుగు గదుల ఇల్లు. చుట్టూ వరండా వుంది. వంటగది వేరు. ఒక పడక మంచం, టేబుల్, రెండు కుర్చీలు తప్ప ఫర్నిచర్ లేదు. ''ఇది నా ఇల్లు" అన్న అభిప్రాయం రాగానే కోమలికి తృప్తి కలిగింది.

"ఇదే మీ అంతఃపురం. సామ్రాజ్యానికి మీరు రాణి. ఏం కావాలన్నా చెప్పండి. పంపే ఏర్పాటు చేస్తాను'' అని ఇంటిని పరిచయం చేశాడు డాక్టరు సుందరం.

వంట ఇల్లు, ఆ గదులు చూడగానే పనిపిల్లకు సంబరం కలిగింది. గబగబ గదులన్నీ కడిగి శుభ్రంచేసింది. ముగ్గులు పెట్టింది. "భోజనం హోటల్ నుండి తెప్పిస్తారా అమ్మా! లేక మీరే వండుకుంటారా?'' అని అడిగింది.

"ఈ బస్తీలో హోటళ్లు కూడా ఉన్నాయా? ఏం? నీకు వంట చాతకాదా?" ప్రశ్నించింది కోమలి.

"నా వంట మీరు తింటారా అమ్మగారూ, గొప్పోరు."

"పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యకు, నువ్వూ మనిషివే, నేనూ మనిషినే. నాకు అలాటి తేడాలు లేవు. ఈ ఇంట్లో వంటా




వార్పు అన్నీ నీవే. ఈ ఇల్లంతా నీదే! నువ్వు నా మనిషివి."

అమ్మగారి మాటలకు అది ఎంత సంతోషించిందో చెప్పలేం. ఆనందం చిక్కనై కూనిరాగాలు మొదలెట్టింది.

"ఈ రోజు మా ఇంట్లో భోజనం చేయండి. ఇంకా ఏర్పాట్లుచేసుకోవాలిగా'' ఆహ్వానించాడు డాక్టర్ సుందరం.

వెంటబెట్టుకుని వెళ్లి కోమలికి ఆస్పత్రి అంతా చూపించాడు. మొత్తం ఇరవై బెడ్స్ ఉన్నాయి ఉమెన్స్ వార్డులో అందులో సగంమంది కూడా పేషెంట్స్ లేరు. మెటర్నిటీ వార్డులో ఒకేఒక కేసున్నది.

"ఆయా చూస్తున్నది లెండి, ఫరవాలేదు. సీరియస్ కేసుకాదు" సుందరం భరోసా యిచ్చాడు. మిగతా వార్డులు మరీ అసహ్యంగా ఉన్నాయి.

''మన పని అవుట్ పేషెంట్లతోనే లెండి. ఇక మనం ఇంటికి వెళ్లి భోంచేద్దాం రండి."

డాక్టర్ సుందరం భార్య వనజ. మంచి అందగత్తె. స్నేహశీలి అనిపిస్తుంది చూడగానే. కోమలి ఊహించినదాని కన్న చిన్నదే. సరదాగా కాసేపు కబుర్లు చెప్పుకున్నారు కోమలి, వనజ. కోమలి తన స్నేహితురాళ్ల గురించి చెప్పింది. మీనాక్షి గురించి కూడా చెప్పింది. డాక్టర్ సుందరంకు పద్మిని అంటే వల్లమాలిన అభిమానం. అంత పెద్ద సినిమా నటి, కోమలి స్నేహితురాలు అంటే నమ్మలేకపోయాడు. కోమలి చెప్పే మాటలు వింటుంటే ఆ పద్మిని తన ప్రక్కనే ఉన్నంత సంబరపడ్డాడు.

కోమలి కుటుంబం గురించి అడిగాడు. ఇంకా ఆమెకు పెళ్లి కాలేదని చెప్పగానే అతని కళ్లు మెరిశాయి. అతనికి పెళ్లికాని

కన్యలతో స్నేహం అంటే మహా ఇష్టం.

"డాక్టర్ రావుగారికి పిల్లలా ?'' అడిగింది కోమలి.

"అఁ పిల్లలకేం లెండి. నలుగురు. అతను అదొకరకం మనిషిలెండి. తాగు తాడని, ముండల ముఠాకోరని చెబు తుంటారు" అన్నాడు ఈసడింపుగా.

భోజనం అయిన తర్వాత 'వెళ్లొస్తా డాక్టర్' అని చెప్పి బయలుదేరింది. సుందరం ఆమె వెంట బంగళావరకు వచ్చాడు. పనిపిల్ల బజారునుండి వెచ్చాలు తెచ్చి ఎదురుచూస్తున్నది. ఆ పిల్లకు ఊరు నచ్చింది. దానికి తోడు డాక్టరమ్మ గారు తనకు సౌతంత్రం యిచ్చింది.

కోమలికి తృప్తిగానే వుంది కొత్త వాతావరణం. జీవితమనే పరమపద సోపానపటంలో ఇది తొలి నిచ్చెన, అయినా ఇంత వేగం నిర్ణయాలు చేయ గూడదు. నాలుగురోజులు పోతేగాని పరిస్థితులు అర్థంకావు. తన పాలిట స్వర్గంలా భాసించవలసిన ఆస్పత్రి నరకంలాగా ఉన్నది. అదే దిగులు. కలత నిద్రలో వుండగా పనిపిల్ల వచ్చి లేపింది. 'ఆయా మీ కోసం వచ్చింది అమ్మగారూ' అని చెప్పింది.

ఎందుకో ఏమిటో అర్థంకాలేదు కొన్ని క్షణాలు. తర్వాత చెప్పింది, ఆస్పత్రిలో ఉన్న అమ్మాయికి కానుపు కష్టంగా వున్నదనీ, తనవల్లకావటం లేదని. కోమలి వెంటనే నిలుచున్న పళంగా బయలుదేరింది. పేషెంట్ దగ్గర మరొక మిడ్‌వైఫ్ ఉన్నది. ఆ అమ్మాయికి పదహారేళ్లు ఉంటాయేమో బాధతో మెలికలు తిరిగిపోతున్నది పాపం! తొలి కానుపు.

"ఆమెకు నొప్పులు ఆరంభమైనాయి డాక్టర్, బ్రీచ్ కేసని నా అనుమానం." ఆయా చెప్పింది.

"ఏర్పాట్లుచెయ్యి. నేనువస్తున్నాను."

ఆ అమ్మాయి కేకలుపెట్టి ఏడు స్తోంది. బిడ్డను బతికించడం కష్టమని తెలుస్తూనే వుంది. తాను చేయగలిగినంత చేసింది. మద్రాసులో ఉండగా ఇలాంటి పురుళ్లు చూచింది. ఒక ఇంజక్షన్ కోసం చీటి రాసి పంపింది. ఆ అమ్మాయిని చూస్తే కోమలికి భయంవేస్తున్నది. మరొక చీటి రాసి తనకు హెల్ప్ రమ్మని, డాక్టర్ సుందర్‌కు పంపింది. అప్పటికి తానువచ్చి మూడు గంటలైంది. ''ఇది నా ఫస్ట్ కేస్ భగవంతుడా, ఎలాగో రక్షించు" అని ప్రార్థించింది. కనీసం తల్లి ప్రాణం రక్షించగలిగితే అదృష్టమే. కొద్ది నిమిషాల తర్వాత డాక్టర్ సుందర్ వచ్చాడు. నిద్రమత్తులో తూలుతున్నాడు. కేసును వివరించింది కోమలి. డాక్టర్ సుందర్ ఆ అమ్మాయిని చూచి తల ఊపాడు.

''ఆపరేట్ చేసి బిడ్డను తీయవచ్చు. పేషెంట్ బ్రతకదు."

ఇద్దరూ కలిసి కృషిచేశారు. క్షణ క్షణానికి కోమలికి నీరసం వస్తోంది. ఏదీ సక్రమంగా జరగలేదు. రక్తం చూస్తే కళ్లు తిరుగుతున్నాయి. మొదటి సారిగా రక్తస్రావం చూచినంత భయ పడ్డది. ఇంజక్షన్లు ఇచ్చారు. నాడి బల హీనం అయింది. తెల్లవారుతుండగా పేషెంట్ చనిపోయింది!

"ఆల్‌రైట్. మీరు పూర్తిచేయ వలసిన ఫారమ్స్ చూపిస్తాను. డ్రెస్ మార్చుకునిరండి. కాఫీ అది త్రాగిరండి" అని సుందరం వెళ్లిపోయాడు.

కోమలి ఆ చనిపోయిన పేషెంట్‌ను ఆయాకు, ఆమె బంధువులకు అప్పగించి వెళ్లింది. బంగళాకు వెళ్లాక చూచింది తన చీర అంచులు రక్తంతో తడిసి పోయాయి. చాలా బాధగావుంది. మొదటి కేసులోనే అపజయం. తను ఇన్నేళ్లు కష్టపడి చదివింది పేషెంట్స్ చస్తుంటే చూడడానికా! అంతకన్న తనేం చేయగలదు? మనసు శూన్యం అయింది. ఆస్పత్రికి వెళ్లగానే డాక్టర్ సుందరం ఆమె మనోస్థితి కనిపెట్టాడు.

"నో, నో, డోంట్‌వర్రీ యువర్ సెల్ఫ్ డాక్టర్. మనమేం చేస్తాం చెప్పండి. ఇన్ని కోట్లమందిలో ఒక వ్యక్తి..." అన్నాడు.

"ఇది నా ఫస్ట్ కేస్ డాక్టర్" బాధగా అన్నది. ఆమెకు కన్నీరు తిరిగింది.

"ఇందులో మీ అశ్రద్ధగానీ, అసమర్థత గానీ ఏంలేవుడాక్టర్. మీరులేకుంటే అసలు నాకు కబురు వచ్చేదేకాదు. మనం వచ్చినా, రాకపోయినా ఫలితం ఒక్కటే. చూచారుగా." అతను నిర్లిప్తంగా అన్నాడు.

కోమలి తన వార్డులకు వెళ్లింది. ఆ రెండు వార్డులు శుభ్రంగా ఉంచడం తన కర్తవ్యం. జనరల్ వార్డులోని రోగుల్ని చూచింది. ఒకరికి చెయ్యివాపు, ఒకరికి కాలు విరిగింది. ఇద్దరు రోగులు డిస్ మెనోరియాతో బాధపడుతున్నారు. ఒకరికి బ్రెస్ట్ కాన్సర్. అందరినీ శ్రద్ధగా పరిశీలించింది. నిదానంగా కేసులు స్టడీ చేసేసరికి మధ్యాహ్నం అయింది.

అవుట్ పేషెంట్ల రూంలో ముగ్గురు వెయిట్‌చేస్తున్నారని ఆయా వచ్చి చెప్పింది. అక్కడకు వెళ్లింది. ప్రొద్దుటి నుండీ ఏమీ తినకపోవడంవల్ల నీరసంగా వుంది. ఆకలివేస్తున్నా, పనివల్ల కాస్త తృప్తి కలిగింది. ఆ రోజు ఇంటికి ఉత్తరం వ్రాసింది. తన మొదటి కేస్ సంగతి వదలివేసింది.

అంతలో ఊళ్లో ఏదో ప్రయివేట్ కేసొకటి వచ్చింది మెడికల్ చెస్ట్ తీసుకుని ఆయాతో, పనిపిల్లతో బయలు దేరింది. అదొక చాద స్తపు కొంప. రోగిని గాలి, వెలుతురు రాని కొష్టంలో ఉంచారు. గలీజుగావుంది రోగి తల్లి

చెల్లెళ్లు మంచంచుట్టూ ఈగల్లా ముసిరారు.

లోపలకు వెళ్లి ఏర్పాట్లుచేసింది. ప్రసవం సుఖంగానే జరిగింది. మగపిల్లవాడు. కావలసిన సలహాలిచ్చి వచ్చేసింది. బయటకురాగానే ఆ పేషెంట్ భర్త కామాలు, వెంటవచ్చి డబ్బు యిచ్చాడు. అది మొదటి సంపాదన. సంతోషంగా బంగళాకు వచ్చింది. పని పిల్లకుకూడా రెండు రూపాయలుగిట్టాయి. అదీ సంతోషంగా వుంది.

ఉద్యోగం, జీవితం క్రమంగా ఒక దోవన పడుతున్నాయి. పగలు ఉమెన్స్ వార్డులపని. మూడురోజుల కొకమారు నైట్‌డ్యూటి. రాత్రిపూట వుండేపనికూడా ఉమెన్స్ వార్డులోనే. అప్పుడు ఇంటికే కబురువస్తుంది. బయట పేషెంట్లను చూడడం ఎక్కువవుతోంది. ఫీజు ఇంత అనిలేదు. ఎవరికి తోచినంత, శక్తికొద్దీ వారు ఇస్తారు. కొందరు సంతోషంతో చీరలు, బట్టలు, ఇంటిసరుకులు పంపిస్తారు. ప్రయివేట్‌గా వచ్చిన ఆదాయం బ్యాంకులో వేస్తున్నది. ఆస్పత్రిజీతమే తనకు ఎక్కువ.

ఊరు క్రమంగా పరిచయం అయింది. డాక్టరుగా కోమలికి మంచి పేరు వచ్చింది. తన బంగళాను అందంగా తీర్చిదిద్దుకున్నది. గుమ్మాలకు, కిటికీలకు రంగుకర్టెన్లు, పుస్తకాలకు షెల్ఫ్, డ్రెస్సింగ్ టేబుల్ అన్నీ అమర్చుకున్నది. దగ్గర దగ్గర పొరుగూళ్ల నుండికూడా పిలుపు వస్తున్నది. తాను రాలేనని, వారినే అక్కడకు రప్పిస్తుంది.

అక్కడొక జమీందారులాంటి ఆసామీ ఉన్నాడు. అతని భార్యకు జబ్బుగా ఉందని కబురు వచ్చింది. ఆయన ఎదురుగా వచ్చి స్వాగతం చెప్పాడు. అతని ఆకారం, చూపులు భయంకరంగా, క్రూరంగా ఉన్నాయి

"నా భార్యకు జబ్బు, చూడండి డాక్టరమ్మా" అన్నాడు అతను ఠీవిగా, రాజసంగా.

ఒక చిన్నగదిలోకి తీసుకువెళ్లాడు. పట్టుపరుపుమీద తెల్లగా, సన్నగా ఉన్న ఒక అమ్మాయి నీరసంగా పడివుంది. ఆ రాక్షసుడికి ఈ పిల్ల పెళ్లామా! అనుకుంది. ఆ అమ్మాయిని చూస్తే ఇంకా పెళ్లి అయిందనిపించదు. అంత అర్భకంగా, అమాయకంగా వున్నది. మగతగా మూలుగుతున్నది.

"ఏమిటమ్మా బాధ?" కోమలి, ఆప్యాయంగా అడిగింది చేతిలోఉన్న స్టెతస్కోప్‌ను చూచి డాక్టర్ అని పోల్చుకుంది. ఆమె వెనకనే తనభర్త నిలబడి, తీక్షణంగా చూస్తూ ఉండడంతో భయపడి, కళ్లు మూసుకుంది. పసిదానిలా వణకిపోతున్నది.

జమీందారును బయటకుపంపి, తలుపు గడియ వేసివచ్చి, కోమలి మళ్లీ




అడిగింది. ఆ అమ్మాయి చీర ప్రక్కకు తొలగించి చూపింది. జాకెట్ విప్పదీసి చూపింది. ఒంటినిండా వాతలు, నెత్తుటి చారలు, స్తనాలకు పైగా పెద్దపుండు. కోమలి స్తంభించిపోయింది. ఆమెకు నోట మాటరాలేదు. అది మామూలు పుండు కాదు, గాయం. కంప బయటకు వచ్చి ఎండిపోయింది. వెంటనే మందులువాడి, ఇంజక్షన్ ఇచ్చి, డ్రెస్‌చేసి, బ్యాండేజీ చేసింది.

బయటకువచ్చి జమీందారుతో చెప్పింది. "ఆ గాయం సెప్టిక్‌కావచ్చు. ఆస్పత్రిలో చేర్చడం మంచిది."

"వీల్లేదు...అదే నయమవుతుంది. అవసరం అయితే కబురంపుతాను, నువ్వరా" కటువుగా అన్నాడు.

మందులు రాసిచ్చింది. తర్వాత ఆమె ఏమైనదీ అయిపు అజా లేదు.

ఊళ్లో బాగా డబ్బుగలవాళ్లు, ఫంక్షన్సుకు, పేరంటాళ్లకు పిలుస్తున్నారు. పిలున్నప్పుడు వెళ్లకతప్పడంలేదు. వారు తన పేషెంట్సు అయితే, అసలు తప్పించుకోడానికి వీలుండదు.

తల్లికి ఉత్తరం రాసింది, శకుంతలను తీసుకుని, ఒకసారి రమ్మని.

రజని వెంటనే వచ్చింది ఆమెకు తన కూతురు హోదా, స్థితిగతులు నచ్చాయి. ఇల్లు నచ్చింది. రాత్రికి తీరికగా కూర్చుని ఇంటిదగ్గర కబుర్లు చెప్పుకున్నారు. శోభ, వాసంతిగురించి వాళ్ల సంసారాలగురించి, పిల్లలగురించీ రజని ఆసక్తిగా చెప్పింది.

"ఇందిర సంగతులు తెలుస్తున్నాయా అమ్మాయీ" అని అడిగింది. ఆమెకు ఇందిర జ్ఞాపకం.

"అవునమ్మా, తను బొంబాయిలో ఒక పెద్ద డాక్టరుదగ్గర అసిస్టెంటుగా చేరింది. కానీ దానికి నేనంటే అసూయగా వుందిట. నేను ఈ పల్లెలో హాయిగా, స్వేచ్ఛగా ఉన్నానుట" నవ్వుతూ చెప్పింది కోమలి.

"నీకు ఈ జీవితమే నచ్చిందంటే అమ్మాయ్. ఈ పల్లెటూళ్లో ఎన్నాళ్లుం టావ్?"

"ఇష్టం ఉన్నన్ని రోజులు."

"అది సరేలేవే, మరి నీ సంసారం మాటేమిటని, ఎంతకాలం ఇలా వంటరిగా బ్రతుకుతావని... అమ్మ, నాన్న — ఇవాళ మేం వుంటాం, రేపు మేం పోయిం తర్వాత నీకు దిక్కెవరు. నా అన్న వాళ్లెవరుంటారు. ఎంత డబ్బు సంపా దించినా, ఆడదానికి తన మొగుడు, పిల్లలు అవసరంగదా, ఆ విషయం ఆలోచించావా అసలు."

"ఆలోచిస్తున్నానమ్మా."

ఆ మధ్య నువ్వు ఎవరినో ప్రేమిం చావని అనుమానించాను, నీ వాలకం చూచి. కానీ అది బెడిసిపోయింది. అవునా, నిజంచెప్పు. నువ్వు వచ్చినపుడు దిగులుగా, ఏదో విలువైనది పోగొట్టు కున్నట్లు ఉండేదానివి."

"అవునమ్మా, నీవు ఊహించింది కరెక్టే. అయితే భయంవల్లకాదు. కిరీటిని గురించి నాకేభయంలేదు. అతను మోసం చేశాడనీకాదు. హరనాథ్ అని ఒకతన్ని ప్రేమించాను కానీ అతను చనిపోయాడు" అంటూ హరినిగురించి యావత్తూ చెప్పింది. అలా చెప్పడంలో నిర్లిప్తంగా ఏ బాధ, అనుభూతి వ్యక్తంకాకుండా చెప్పింది. పిల్లలకు కథ చెప్పినట్లే చెప్పింది.

అంతా విన్నాక, రజనికి ఏంచెప్ప డానికీ తోచలేదు. అలా తనలో సమాధి అయిన బాధల్ని, బాధల గాధల్ని బయటకులాగి, తృప్తిపడ్డది. కోమలి హృదయం తేలికైంది. నిజాన్ని వినడంవల్ల మనస్సులో పేరుకున్న అను మానాలను కడిగివేసుకున్నట్లయింది రజనికి.

( సశేషం )

# మధుర మీనాక్షి



ఆర్.ఎస్.సుదర్శనం

దక్షిణాదికి వెళ్లాలనిపించింది. ముఖ్యంగా మధురకు. మధుర అనే పేరూ, మధురలో అమ్మవారు మీనాక్షి పేరూ అంటే నాకేదో యిష్టం. ఇరవై ఏళ్ల క్రితం నేను మద్రాసులో చదువుకునేటప్పుడు మధురనుంచీ వచ్చిన స్నేహితుడు ఒకడుండేవాడు. అతడు నాతో తెలుగులో మాట్లాడటానికి ప్రయత్నించేవాడు. వాళ్ళింట్లో తెలుగు మాట్లాడుతారట. కాని ఆ తెలుగు స్వరూపం వింతగా ఉండేది. ఆ తెలుగుని నా ముందుతప్ప అందరి ఎదుటా ప్రదర్శించేందుకు బిడియపడేవాడు నా స్నేహితుడు. మా మధ్య చదువు ఎక్కువయ్యాక అతని మాతృభాష అయిన ఆ తెలుగు—కాని—తెలుగులోనే నాతో మాట్లాడేవాడు. అందువల్ల మా స్నేహం ఎంతో ప్రియమైనదిగా ఉండేది. కాలేజి వదిలాక మామధ్య రెండేళ్లపాటు ఉత్తర ప్రత్యుత్తరాలు

జరిగినా, తర్వాత అతడెక్కడున్నాడో నాకు తెలీదు. భాషా ప్రయుక్త రాష్ట్రాలు వచ్చాక ఎవరి ప్రపంచం వారిదై పోతూ వచ్చింది. ఇప్పుడు దక్షిణాదికి వెళ్ళా లనిపించగానే ఆనాటి ఆ మధుర స్నేహితుడు—అతని పేరు గురుమూర్తి జ్ఞాపకంవచ్చి, స్నేహంకంటే తియ్యనిది జీవితంలో మరొకటిఉందా! అనిపించింది.

నేను వెళ్ళాలనుకున్నది యాత్రగాదు, పుణ్యం మూటకట్టుకుందామన్న ఉద్దేశం తోకాదు ఒక్కసారి నా పరిసరాల్ని, నాకు నిత్యమూ సంబంధంఉన్న మను ష్యుల్నీ, నేను నిత్యమూ వింటూన్న భాషనీ వదలిపెట్టి కాస్త స్వేచ్ఛగా క్రొత్త వూపిరి పీల్చుకునేందుకు వీలుగా, నా కెవ్వరూ తెలీని ప్రదేశానికివెళ్ళి దపాలనే కోరికే నన్ను ప్రయాణానికి పురికొల్పింది.

కాలేజీచదువు అయ్యేదాకా నా జీవి తంలో ఒక అధ్యాయం. అటుపైన గడ చిన ఇరవై ఏళ్లుగా మరొక అధ్యాయం. రెండేళ్ల క్రితం నా భార్యపోవటం, నా నలుగురు పిల్లలూ ప్రస్తుతానికి బోర్డింగు స్కూళ్ళల్లో నిక్షేపంగా చదువుకుంటూ ఉండటం, నాలో ఏర్పడిన ఒంటరితనం, క్రమంగా నాదృక్పథంలో ఒక పరివర్తన తీసుకుని వచ్చింది. వ్యాపారంలోనేమి, వ్యవహారాల్లోనేమి పూర్తిగా మునిగిపోయి ఉండటం, ఎప్పుడూ క్షణం తీరిక లేక పోవడంమూలాన ఈ నా 'ఒంటరితనాన్ని, సులువుగా నేను గుర్తింపలేదు. కాని మధ్య మధ్య ఒక్కొక్కసారి నాలో ఏదో పరధ్యానంలాంటి మనఃస్థితి కల్గి, నేను పరిసరాల్ని మరచిపోయి, కాస్సేప టికి మళ్లీ స్పృహ రావటంలాటి సన్ని వేశాలు కొన్ని కలిగాయి. ఒకసారి ఒక డాన్సు ప్రోగ్రాం చూడటానికి వెళ్లాను. స్నేహితుల్తో. నృత్యం మనస్సుకి పట్ట లేదు సరికదా. ఉన్నట్లుండి ఏదో దిగులు, శూన్యం, ప్రవేశించి సుమారు ఒక గంట కాలం నాకూ పరిసరాలకూ సంబంధం లేని స్థితి ఏర్పడ్డది. తర్వాత ఒకసారి స్నేహితుల్తో క్లబ్బుల్లో పేకాడుతూ ఉండగా ఉన్నట్లుండి విరక్తిలాంటిదేదో కల్గి ఆటలోంచి లేచి వెళ్లిపోయాను. అదృష్టవశాత్తు నేను అప్పటికి ఆటలో ప్లస్‌లోనే ఉన్నాను కాబట్టి మిత్రులు అపార్థం చేసుకోలేదు. అలావెళ్ళి బాతు రూమ్‌లో ముఖం కడుక్కునివచ్చి, వేరుగా కుర్చీ వేసుకుని కిటికీలోంచి ఆకాశాన్ని చూస్తూ కూర్చుండిపోయాను. అదెంతో హాయి అనిపించింది. ఇటువంటి 'మూడ్సు' తరచు వస్తూ వస్తూ, చివరకి నే నిందాకా చెప్పినట్లు, ఎక్కడికైనా సరే, ఎవరితోనూ చెప్పకుండా కొన్ని రోజులు వెళ్ళి తిరిగి రావాలన్న గాఢ మైనవాంఛ నాలో రూపొందింది.

కాని ఎవరితోనూ చెప్పకుండా వెళ్ల డంలో ఎన్నో చిక్కులున్నాయి. నిజంగా చూస్తే సన్యసించి వెళ్ళిపోదామనే ఉద్దేశం లాంటిది నాలో ఏ కోశానా లేదు పిల్లల

మీద ప్రేమా, వాళ్ల భవిష్యత్తుమీద ఆసక్తి నాలో అధికంగా ఉన్నాయి. వ్యాపార విషయాల్లో నా ప్రమేయం లేనిదీ, నా జాగ్రత్తలేనిదీ అన్నీ సవ్యంగా జరుగుతూ ఉంటాయనే నమ్మకమూ నాకులేదు. అందువల్ల ఏదో మామూలు కారణం లాంటిది చూపిస్తూ ఎవరెవరికి ఏమి చెప్పాలో చెప్పి వెళ్ళడమే మంచి దని తోచింది. కాని నా 'మూడ్స్' విషయం, నా అసలు రహస్యంమాత్రం ఎవరికీ చెప్పే పరిస్థితిలోలేను. మిత్రులు గాని బంధువులుగాని నన్ను పిచ్చివాడి నిగా జమకట్టుతారని భయం! అందువల్ల నేను దక్షిణాదికి యాత్ర వెడుతున్నాననీ. ముఖ్యంగా నా భార్య అస్థికల్ని రామే శ్వరం తీసుకువెళ్ళాలన్న కోర్కె నాలో ఉన్నదనీ, తీరికలేక ఇంతకాలం వెళ్ల లేకపోయాననీ, అందరితో లోకరీత్యా చెప్పవలసి వచ్చింది.

"అయితే పెద్దబ్బాయినైనా తీసుకు వెళ్ళరాదా" అని కొందరు సలహా యివ్వకపోలేదు. "వాడికి సెలవులు వచ్చేదాకా ఆగితే నాకు తీరిక చిక్కదు కదా! ఇప్పుడనుకున్నాను. ఇప్పుడేవెళ్ళి రావటమే మంచిది" అని సమాధానం చెప్పాను. ఆలస్యంచేస్తే వాళ్లూ వీళ్ళూ వెంట బయలుదేరుతారేమోనని అనుకున్న మూడోరోజే రైలెక్కాను, ఒక చిన్న సూట్ కేసుతో.

రైల్లో కూర్చోగానే నాకో ప్రశ్న ఎదురైంది. ఏమిటి నేను చేస్తున్న ఈ పిచ్చిపని? ఈ అర్థంలేనిపని? నేనెందుకు మధుర వెళ్తున్నానో నాకే తెలీదుకదా! అనిపించింది. మామూలు వ్యవహారాల్లో మునిగి ఉన్నంతసేపూ, అందులోనుంచీ బయటపడాలనే ఏదో వత్తిడివల్లా, 'మధుర' అనే పదం అంటే ఏదో యిష్టం ఉండటంవల్లా. బయలుదేరానేకాని అలా బయటపడి మధుర చేరుకున్న తర్వాత ఏమి చెయ్యాలి? అనే విషయం మాత్రం నాకు స్పష్టంగాలేదు. రైల్లో కూర్చుని ఆలోచిస్తే అంతా బోధపడుతుందని కాబోలు అభిప్రాయపడ్డాను. కాని తీరా చూస్తే ఎంత ఆలోచించినా, ఏం చెయ్యాలో యిదమిద్ధమని తేలటంలేదు. పోనీ, ఎప్పుడు చూడని మధురనుచూచి, మీనాక్షి దేవాలయాన్నీ తిరుమలనాయకుని మహల్నీచూచి రెండు మూడురోజుల్లో వచ్చేద్దామనుకున్నాను. అందుకోసమైతే మిత్రులతోకలిసి వెళితే బాగుండేదికదా అన్న కొరత మనసుకు తట్టింది. మళ్ళీ మిత్రులా? అసలు తెలుగుభాషేవద్దు, తెలిసిన జీవితమే వద్దు, అన్నీ మరచి పోయి స్వేచ్ఛగా ఉండాలనికదా నా ఉద్దేశం! పోనీ గురుమూర్తి ఎక్క డున్నాడో అన్వేషిద్దామా? మధురవంటి పెద్ద పట్టణంలో పాత అడ్రస్ అయినా గుర్తులేని ఒకానొక గురుమూర్తిని ఎలా పట్టుకోవడం? పైగా విచిత్రం, గురు మూర్తికోసం కష్టపడి వెదకడంలోకూడా

నాకు ఆసక్తిలేదని తెలిపోయింది! యాదృచ్ఛికంగా గురుమూర్తి కనిపిస్తే అది వేరే సంగతి. అప్పుడు సంతోషమే! కాని అతణ్ణి వెదకటానికికాదుగా నేను మధుర వెళ్తూండటం! పోతే, భక్తి, పుణ్యము, తీర్థసేవ అంటే అటువంటి వాటిమీద నాకు అసలు నమ్మకంలేదని మొదటే చెప్పాను.

ఇలా ఆలోచిస్తూ, ఏమీ పాలుపోక, వూరికే ఎక్కి దిగే మనుష్యుల్ని రైల్వే స్టేషన్లనీచూస్తూ కూర్చున్నాను. అలా చూడటంలో నాకు కొన్ని కొత్త సంగతులు తెలిసినవి. సాధారణంగా మనం మనుష్యుల్ని ఒక అర్థంతో చూస్తూ ఉంటాము. వీడు ఫలానా, వీడితో యీ పని, ఈమె ఫలానావారి తాలూకు, ఈమె గుణం యిలాంటిది అన్న దృష్టి వ్యక్తుల్ని గూర్చిన పరిచయంమూలాన, నిత్యమూ కొన్ని ప్రయోజనాల్ని అన్వేషిస్తూ వ్యవహారదృష్టితో చూస్తూండటం తప్ప, ఆయా వ్యక్తుల్లోఉన్న వింతలూ, చమత్కారాలు మనం గమనించము. అదీకాక మనిషి మామూలు మనిషి అన్న భావంతోగాక ఒక యంత్రము, ఒక బొమ్మ, ఒక వింత మృగము అనే దృష్టితో చూస్తే మరికొన్ని చమత్కారాలు కనిపిస్తాయి. రైల్లో నా ఎదురుగా ఒక కుటుంబం, అంటే భార్యాభర్తలూ వాళ్ల ఆరేళ్ళ కూతురూ కూర్చున్నారు. చూడగానే వాళ్ళ పరస్పర సంబంధం వ్యగ్రాలు అర్థమయినవి. కాని నా మనస్సు ప్రస్తుతం అనుభవిస్తున్న వింత స్థితిలో వాళ్ళకు ఒకరితో ఒకరికి సంబంధం లేదనుకుంటూ వాళ్ళను గమనించాను. ఆ అవగాహన అద్భుతంగా ఉంది. ఎవరికివాళ్ళు ఒంటరివాళ్ళే, నాలాగ. పైన ఏవో శబ్దాలూ, చేష్టలూ, వాటికి ఏవో అర్థాలూ, ఆ అర్థాల మూలంగా మనస్సులో ఒక ఎడతెగని భ్రమ! అంతే! భర్త కొన్ని నిముషాలు మరుగుదొడ్డిలోకి వెళ్లాడు. వెంటనే భార్య హావభావాల్లో మార్పు కనిపించింది. నావైపు సిగ్గువిడిచి ఆసక్తిగా సాహసంగా, పరిశీలనగా చూచింది. అటూ, ఇటూ కదిలింది, వస్తువుల్ని సవరిస్తూ కూతురితో ఏదో అన్నది. నాకూ ఏదో వ్యక్తంచేసింది. భర్త తిరిగివచ్చి కూర్చున్నాడు. ఆమె మళ్ళీ పూర్వం ధోరణిలో 'అణకువ' గా స్తబ్ధంగా మారింది. భర్త సాన్నిధ్యం ఆమె నిజస్వరూపాన్ని కప్పిపెడుతూ ఉన్నట్లు నాకు తోచింది. ఇందులో ఆమె భర్తను ఏదో మోసంచేస్తూ ఉన్నదనీ, కపటంగా ప్రవర్తిస్తున్నదనీ నా ఆరోపణకాదు! నైతిక వ్యతిక్రమణం ఏమీలేదు. ఆమె వ్యక్తిత్వంమాత్రం భర్త ఎదురుగుండా ఉండటంవల్ల ఒకానొక ధోరణిలోనూ, లేకపోయిన క్షణాలలో మరొక ధోరణిలో అంటే స్వేచ్ఛగానూ ఉంటుందనేది నాకు నిశ్చ

యంగా తెలిసింది. ఆమెలోని ఆ రెండవ ధోరణి, దాని సౌందర్యం ఆ భర్తకు ఎన్నడూ కనిపించదు. ఊహామాత్రంగా కూడా అంతు చిక్కదు. ఇదీ జీవితంలో వ్యక్తులమధ్య ఉండే సంబంధాల్లోని వైచిత్రి. కేవలం భార్యాభర్తల మధ్యేకాదు. ఒకానొక రామారావు నాకు చాల సౌమ్యుడుగా, ఓర్పు గలవాడుగా మాత్రమే తెలుసు. మరొకరికి రామారావు అంటే ముంగి, లోపలిమనిషి, నమ్మదగినవాడుకాడు. ఈ విభేదాలు ఎందువల్ల వస్తున్నాయి?

నా ఆలోచనలకు గమ్యంలేదు. నాకు తోచిన ప్రశ్నలకి నేను సమాధానం వెదకలేదు. చివరకు నిద్రపోయాను. తెల్లవారింది మధుర స్టేషనులో దిగాను. బండివాణ్ణి మంచి హోటలికి తీసుకువెళ్ళమన్నాను. 'రాయల్ లాడ్జి' ట. ఎందుకో కృష్ణదేవరాయలు జ్ఞాపకం వచ్చాడు. రాయలవారికి అతిథిని, 'పేయింగ్ గెస్ట్'ని అనుకున్నాను.

హోటలు మేడమీదికి మీనాక్షి దేవాలయ గోపురాలు కనిపిస్తున్నాయి. అక్కడికి దగ్గరే. సర్వరును అడిగాను. పూజ ప్రొద్దున ఎనిమిదింటికే ముగుస్తుందట, సాయంకాలం వెళ్ళమన్నాడు. దేవాలయ ప్రాకారానికి నాలుగు ద్వారాలు. ద్వారాల గోపురాలు అందంగా మెరుస్తూ కనిపిస్తున్నాయి. పునరుద్ధరణ యిటీవలే జరిగిందట. శివగంగరాజాగారు కాబోలు దబ్బిచ్చారట. తిరుమల నాయకుని మహల్ విషయం అడిగితేఅదిచాలదూరం, ఒక కొసను ఉందనీ, అక్కడికైతే యిప్పుడే వెళ్ళి రావచ్చుననీ సర్వరు సలహా యిచ్చాడు. బండిచేసుకుని అక్కడికి వెళ్ళాను. ఏవో గవర్నమెంటు ఆఫీసులు ఆక్రమింపచేశాయి ఆ మహల్ని. మేడమీదికివెళ్ళి తిరిగాను. మధురాపట్టణం చాలవరకు కనిపిస్తుంది. ఎందుకో నాకు తృప్తిగాలేదు. మధుర వచ్చింది యిందుకా? అనుకుంటూ హోటలికి తిరిగి వచ్చాను. భోజనంచేసి నిద్రపోయాను.

సాయంత్రం అయిదు గంటలకిగాని మెలకువ రాలేదు. కాఫీత్రాగి దేవాలయానికి బయలుదేరాను. ద్వారందగ్గర కొబ్బరికాయ, కుంకుమ వగైరా సామగ్రి కొని లోపలికి వెళ్ళాను. చక్కని సన్నాయి చెవినబడ్డది. లోపల పుష్కరిణి శిల్పాలుఎంతో అందంగా ఉన్నాయి. ఎవరో అమెరికను దంపతులు శిల్పాలని చూస్తున్నారు. ఒక పద్నాలుగేళ్ళ కుర్రవాడు వాళ్ళకి "గైడు" గా వ్యవహరిస్తున్నాడు. అటుపైన అమ్మవారి గుడి. 'హిందువులకు మాత్రమేప్రవేశము'అన్న బోర్డు. అమెరికనులు ఆ హద్దుదాటిపోరాదు.

లోపల మరొక హద్దు. అమ్మవారిని దగ్గరిగా చూడటానికి వెళ్లాలంటే మొలకు గుడ్డతప్ప ఒంటిమీద గుడ్డ ఉండరాదు. చాలమంది అంగవస్త్రంతో వచ్చి, ఆ

వస్త్రాన్ని నడుముకు చుట్టుకొని లోపలికి వెళ్తున్నారు. స్త్రీలకు ఈ విధిలేదు. నేను చొక్కా, బనీను విప్పటానికి సిద్ధంగా ఉన్నా, అవి ఎక్కడ పెట్టాలో తెలీక, లోపలికి వెళ్ళడం మానుకున్నాను.

అర్చన జరిగినంతసేపూ వెలుపలే నిల్చుండిపోయాను. అమ్మవారు లీలగా తప్ప స్పష్టంగాదృష్టికిఆనలేదు. ఆలయం యొక్క గంభీర వాతావరణం నన్ను ఆకట్టుకున్నది. కాలం ఘనీభవించినట్లు, కాలసముద్రం లోతుల్లోకి మునిగినట్లూ చరిత్రలో ఏదో వెనక్కి వెనక్కి వెళ్ళి నట్లు ఒక విశేషమైనభావం మనస్సును ఆవరించింది.

మెల్లగా అడుగులువేసుకుంటూ తిరిగి వస్తూ ఉన్నాను. ఎందుకో వెనక్కి తిరిగి చూడాలనిపించింది చూశాను. ఒకఅంద మైన యువతి నా వెనుకే వస్తోంది. నేను తిరిగి చూచిన క్షణంలో మా చూపులు కలిసికొన్నాయి. నేనుముందుకు సాగాను. నడకవేగం తగ్గించాను. కాని నే నుద్దే శించినట్లు ఆమె నన్నుదాటి ముందుకు వెళ్ళలేదు! ఆమెకూడా మెల్లగా నడుస్తూ మా యిద్దరిమధ్యా ఒకే దూరాన్ని అట్టే పెట్టుతున్న తెలిసింది. ద్వారం దగ్గర అంగళ్ళున్నాయి. అక్కడ పూజాసామగ్రి కొన్నప్పుడు వాళ్ళిచ్చిన వెదురుపళ్ళెం వాళ్ళకిచ్చివెయ్యాలి. అక్కడే వదలిన నాచెప్పుల్ని తొడుక్కోవాలి. అందుకోసం ఆగాను. ఆగి వెనుక వస్తున్న ఆమెకోసం చూశాను. ఆమె సూటిగా నా కళ్ళల్లోకి చూచింది. ఏదో నవ్వీ నవ్వనట్లుగా అందులో ఒక చిరునవ్వుకూడా నాక్కని పించింది. నేను పళ్లెం యిచ్చివేసి తొందరగా చెప్పులకోసం వెదుక్కొన్నాను.

నన్ను ఆకర్షించిన అందంగల ఆ యువతి నాతో మాట్లాడ్డానికి సుముఖంగా ఉన్నదన్ననమ్మకం నాలో కల్గినతర్వాత మరి నేను ఆగలేకపోయాను. చెప్పులు నావి నాకు కనిపించటంలో కొంతజాప్యం తప్పలేదు. పెద్దజాప్యం ఏమీకాదు. గబ గబా వీధిలోకి వచ్చాను. కాని ఆమె అంతలో ఎటు వెళ్ళిందో నాకు కనిపించ లేదు. ఇటూ అటూ వీధి తిన్నగా కని పిస్తూవుంది. ఆ కొద్ది నిముషాల్లో కను చూపుమేర దాటి మలుపు తిరిగి ఉండటం సాధ్యంకాదు! అయితే మరి ఆమె ఏమైనట్లు?

ఆ వీధి పొడవునా, పరిసరాలూ చీకటిపడేదాకా వెదుకుతూ తిరుగుతూనే ఉన్నాను ఆమె, నన్ను ఆకర్షించటమే కాదు, నాపట్లసుముఖంగాకూడా ఉన్నది. ఆ సౌందర్యమూర్తి మళ్ళీ నాకు కని పించదేమో అనిపించింది! వెధవ చెప్పుల కోసం ఆలస్యం చెయ్యకుండా అలానే ఆమెను వెంబడించిఉంటే, తర్వాత చెప్పుల సంగతి చూచి ఉండవచ్చుకదా! అవెక్కడికి పోతాయి? అంగడివాని పూచీ ఉండనే ఉంది వాటికి! కాని బుద్ధి

అలవాటు ప్రకారం దానికి తెలిసిన విలువని అది అన్వేషించింది! ఉవ్వెత్తుగా నాలో అసంతృప్తి, ఏదో పోగొట్టుకున్నట్లు ఆవేదనా కలిగాయి. రాత్రి చాలసేపు ఆమె జ్ఞాపకం వస్తూనే వున్నది. ఆ అపరిచిత వ్యక్తికి నామీద ఆసక్తిఏమిటి? నాలో ఏ ప్రత్యేకతాలేదే! కాని ఆమె నా వెనుకనే నడవటంలో, నన్ను చూపులతో పలకరించడంలో తప్పకుండా ఆసక్తి ఉన్నది! ఏమైతేనేం, అవకాశం చేజారిపోయింది!

రెండవరోజు ప్రొద్దున మళ్ళీ ఆలయానికి వెళ్ళాను. ఈసారి చొక్కా బనీను ఏమీ వేసుకోకుండా పట్టు అంగవస్త్రం పైన కప్పుకుని, పంచె గోచీపోసి కాకుండా తమిళులలాగాఅడ్డపంచగా కట్టుకుని వెళ్ళాను. ప్రొద్దుటి అర్చనకు ఎంతో మంది ఆడవాళ్ళూ, మగవాళ్ళూ వచ్చారు. అర్చకునితో బాటు స్తోత్ర పాఠాలు, నామావళి అందరు బిగ్గరగా గొంతు కలిపి చదివారు. ఇది క్రొత్తగా ఉంది. కాని ఎంతో బాగా ఉన్నట్లనిపించింది. నాకూ శ్లోకాలూ, నామాలురాకపోవటం కొరతగా ఉంది. వాళ్ళతో గొంతు కలపలేక పోయాననే అనుకున్నాను. అర్చన ముగియగానే జనమంతా ఎక్కడి వాళ్ళక్కడ గబ గబ వెళ్ళిపోయారు. నాకు అర్థమైంది. వీళ్ళు రోజూ ఇలా ఒక్క అరగంట ఆలయంలోకి వచ్చి అర్చించి వెళ్ళిపోతూ ఉంటారు. దేవాలయానికి చుట్టూ ఉన్నవారికి ఇంతగా దైనిక సాన్నిహిత్యం ఏర్పడి ఉన్నదా అని ఆశ్చర్యపడ్డాను. దూరంనుంచీ వెళ్ళే మనకు ఎక్కడో ఉన్నట్లు అపురూపమేకాని, ఇక్కడివాళ్ళకు మీనాక్షి ప్రత్యక్ష దేవతేకదా! అనుకున్నాను.

క్రిందటి సాయంత్రం చూచినయువతి కనిపిస్తుందేమోనని ఆశించి వెదికాను, కనిపించలేదు.

ఆలయంనుంచీ హోటలు గదికి తిరిగివచ్చి మామూలు దుస్తులు వేసుకుని బజారువైపు వెళ్ళాను. నేను చదువుకునేందుకు ఉపయోగించే కళ్ళద్దాల ఫ్రేము విరిగింది. క్రొత్త ఫ్రేము వేయించాలని వెళ్ళాను.

ఒక కళ్ళద్దాల అంగడిలో ప్రవేశించాను. అంగడియజమానిఒకయువతికి కళ్ళద్దాల ఫ్రేములు చూపిస్తూ మాట్లాడుతున్నాడు. ఆమె అతనికి ఎదురుగుండా కుర్చీలో కూర్చుని టేబిల్‌మీద ఉన్న అద్దాల ఫ్రేములుచూస్తున్నది. నేను వెళ్ళి యజమానికి కుడివైపున ఉన్న కుర్చీలో కూర్చున్నాను తలవంచుకుని ఫ్రేముల్ని పరీక్షిస్తున్న ఆ యువతి నా వైపు చూచింది. నేను చకితుణ్ణయ్యాను. ఆమే ఈమె! జారిపోయిందనుకున్న అవకాశం మళ్ళీ లభించింది!

ఇప్పుడు ఆమెనుగూర్చి మరికొన్ని సంగతులు నాకు తెలిశాయి. ఆమె యింగ్లీషు చదువుకున్నది. బహుశా

ఉద్యోగిని. ఆమె రెండు ఫ్రేములనుఎన్ను కొని, ఆ రెండింటిలో చివరకు ఏది తీసుకోవడం? అన్న మీమాంసలో పడ్డది. అంగడి యజమానిని సలహా అడిగింది. అతను రెండింటిని గూర్చి ధారాళంగా చెబుతున్నాడు గోడమీద పిల్లివాటంగా దేనికదే చక్కగా సరిపోతుందని అంటూ నిర్ణయాన్ని ఆమెకే వదిలే ప్రయత్నంలో ఉన్నాడు. నేను కల్పించుకుని అందులో ఒకదాన్ని గూర్చి, అదేబాగుందిఅన్నాను. ఆమె నా వైపు చూచి, అంగడివానితో, "అయితే దీనికే ఫిక్స్ చెయ్యండి. నాకు ఇవ్వాదేకావాలి. తలనొప్పిగాస్ట్రెయిన్‌గా ఉంది" అన్నది 'కనీసం రెండుగంటలు వ్యవధి కావాలి. చూడండి మా అసిస్టెంటు ఇంత దాకా రాలేదు!' అన్నాడు అంగడివాడు.

నేను నా ఫ్రేముకోసం చూస్తున్నాను. అంగడివాడు నా పాత ఫ్రేము తీసుకుని సైజునుబట్టి ఏవో రకాలు చూపిస్తున్నాడు.

'ఎట్లాగైనా చేసి ఒక గంటలో యివ్వండి. లేకపోతే నేను ఈ పూట కాలేజీ మానేసుకోవాల్సి వస్తుంది' అన్నదామె.

'సరే' నన్నాడు అంగడివాడు.

ఆమె వెళ్లడానికి లేచింది.

నేను కూడా చప్పున లేచి 'అయాం సారీ, నేను యిప్పుడే మళ్లీ వస్తాను. నా పాత ఫ్రేము మీ దగ్గరే ఉంచండి. ఒక అరగంటలో వచ్చి సెలక్ట్ చేసుకుంటాను' అన్నాను అంగడివానితో. అతను ఆశ్చర్యంగా చూస్తూ 'సరే' అన్నాడు.

ఆమె వెనకాలే నేను బయటికి వచ్చాను.

ఆమె కొంతదూరం నడిచి ఒక అంగడిలోకి ప్రవేశించి రెండు పెన్సిళ్లు కొన్నది. నేను వెంబడి వెళ్లి బ్లేడ్లు ఒక ప్యాకెట్ కొన్నాను. అక్కడినుంచీ మళ్లీ బయటికి వచ్చాము ఒక్కసారే. వస్తూండగా నా వైపు చూచి ఆమె అన్నది ఇంగ్లీషులో-

'మీ రిక్కడివారు కారు?'

'అవును. నెల్లూరు.'

'ఏం పనిమీద వచ్చారు?'

'ఊ రి క నే...అనాలోచితంగా... ఒంటరిగా'

'నా వెంట వస్తున్నా రెందుకూ?

'నిన్న ఆలయంలో చూచాను మిమ్మల్ని.'

'చూస్తే?'

'మిమ్మల్ని ప ల క రి ం చా ల ని పించింది.'

ఆమె మౌనంగా నడుస్తూ ఉంది.

'మీరు కాలేజిలో లెక్చరరా?' అని ప్రశ్నించాను. సమాధానం లేదు.

'క్షమించండి. మీ కభ్యంతరం లేకపోతే, ఇక్కడ ఆగి నాతో కాఫీ త్రాగి వెళ్లండి' అంటూ కనిపించిన రెస్టొరెంట్



వైపు దారితీశాను. ఆమె అభ్యంతరం చెప్పకుండా నాతో వచ్చింది. నా హృదయం ఉత్సాహంతో గంతులువేసింది.

కాఫీలు తెమ్మని సర్వరుతో చెప్పాను. ఆమె నిమ్మళంగా గంభీరంగా నా వైపు చూస్తూ ఎదురుగుండా కూర్చున్నది. చిరునవ్వులేదు, మాటలేదు. ఎటువంటి తొట్రుపాటు లేదు. నా కేదో క్రొత్తగా వింతగా ఉన్నది. ఆమె గాంభీర్యం ముందు నేను అల్పుణిగా తోచింది. ఏమీ మాట్లాడలేకపోయాను. కాఫీలు వచ్చాయి. కాఫీ త్రాగటం అయిపోతే ఆమె వెళ్లిపోతుంది. ఆమెతో ఏదో మాట్లాడాలి. ఏం మాట్లాడాలి?

ఆమె కాఫీవైపు దృష్టి మళ్లించింది. ఆమె వ్యక్తిత్వాన్ని పరివేష్టించి ఉన్న ప్రశాంతత నన్ను అధీరుణ్ణి చేస్తోంది.

పరస్త్రీల నెరుగని అమాయకుణ్ణి కాను. నా వయస్సు నలభై. నాకు కొన్ని అనుభవాలున్నాయి. కాని నా భార్య పోయిన తర్వాత, ఈ రెండేళ్లలో, స్త్రీని గూర్చి ఆలోచించలేదు. ఇప్పుడు ఎదురుగా ఉన్న ఈ యువతి నన్నాకర్షిస్తున్న తీరు విశిష్టంగా ఉన్నది. కేవలం స్త్రీ వాంఛగా పోల్చుకోడానికి వీల్లేదు.

"మీరు కాలేజీలో ఏ సబ్జెక్ట్ చెబుతారు?" అన్నాను.

'ఫిలాసఫీ.'

"మీకు సొంత ఫిలాసఫీ అంటూ ఏమైనా ఉన్నదా? మీది మెటీరియలిజమా, డైలెక్టికల్ మెటీరియలిజమా,

ఎగ్జిస్టెన్షలిజమా, వేదాంతమా, అద్వైతమా, ద్వైతమా ?'

'అద్వైతం'.

'నేనూ ఫిలాసఫీ గ్రాడ్యుయేటునే. ఇరవై ఏళ్ల క్రితం. ఈ మధ్య ఎప్పుడూ అనుకోలేదు దానిమాట. అన్నీ మరచి పోయి, కేవలం ఒంటరితనంలో గడపాలని యిక్కడికి వచ్చిన తర్వాత యిప్పుడు మళ్లీ ఆ ఫిలాసఫీ జ్ఞాపకం వస్తున్నది. ఏంతోచటంలేదు కాబట్టి ! నాకు ఏ ఫిలాసఫీలోనూ, వేదాంతంలోనూ నమ్మకం లేదు...మీరు నమ్మకం కల్గించ గలరా ?'

సమాధానంలేదు. ఆమె కాఫీ పూర్తి చేసి, వాచీ చూచుకొన్నది. నా కాఫీ కూడా పూర్తయింది. ఇద్దరమూ బయటికి వచ్చాము.

'థాంక్స్' అంటూ ఆమె అటువచ్చిన రిక్షాలో ఎక్కింది.

నాలో ఆతురత. ఆమె వెళ్లిపోతూ వుంది.

'మీ పేరు ?' అన్నాను.

'మీనాక్షి'.

రిక్షా వెళ్లిపోయింది.

నేను వూరుకోలేదు. మళ్లీ ఆమెను వెంటనే కలుసుకోవాలన్న కాంక్ష ప్రబలంగా వుంది. కళ్లద్దాల షాపుకేసి నడిచాను.

నాకు కావలసిన ఫ్రేము సెలెక్ట్ చేసి, వెంటనే ఫిక్స్ చెయ్యమనీ, ఎంతసేపైనా అక్కడే వేచి ఉంటాననీ చెప్పాను. ఒక గంట కూర్చున్నాను. అద్దాలులేవు కాబట్టి న్యూస్ పేపరు చదవటానికి వీలు లేదు. ఆలోచనలు, ఊహలు. మీనాక్షిని గూర్చి తలపోతలు. ఆమె ఏ క్షణమైనా తన కళ్లజోడుకోసం అక్కడికి వస్తుందని ఆశతో కూర్చున్నాను.

నా జోడు తయారైంది. గంట 11-30 అయింది.. మీనాక్షి రాలేదు ! ఇక అక్కడ ఉండటానికి నాకు కారణమూలేదు !

"ఆ లెక్చెరరుగారి జోడు తయారైందా ?" అని అడిగాను.

"ఆ...ఏదీ ఆమె రాలేదే ! ఈ ఆడవాళ్లింతేనండీ ! ఏదో ముంచుకు పోయిన అర్జంటు అంటారు. తీరా రెడీ చేస్తే మూడురోజులకిగాని వచ్చి తీసుకోరు !" అన్నాడు అంగడి యజమాని.

నేను కాళ్లీడ్చుకుంటూ లాడ్జికి జయలుదేరాను.

సాయంకాలము దేవాలయానికి వెళ్లాను, అంగవస్త్రము, అడ్డపంచ ధరించి. అంగవస్త్రాన్ని నడుముకి చుట్టుకుని అర్ధనగ్నంగా లోపలికి వెళ్లాను. మీనాక్షీదేవి సౌందర్యమూర్తి. ఆమె నిలుచున్నతీరే విలాసంగా ఉంది. ముంజేతి చిలుక ఏ క్షణాన్నో ఎరిగి పోయేలా ఉన్నది. ఇంతటి శృంగార మూర్తి అయిన దేవీవిగ్రహాన్ని నేనెక్కడా చూడలేదు. స్త్రీ సౌందర్యానికే

ప్రతీక అనిపించింది. జన సమ్మర్ధంవల్ల చాలసేపు చూస్తూ ఉండిపోవడానికి వీల్లేక పోవడం ఒక దురదృష్టం. ఆమె సాన్నిధ్యంనుంచీ బయటికివచ్చి ఏమీ తోచక ఇట్టట్టు తిరిగి పుష్కరిణి దగ్గరకు వచ్చి కూర్చున్నాను.

పరధ్యానంగా కాస్సేపు నీళ్లనూ, కాస్సేపు దేవాలయాన్నీ చూస్తూ కూర్చున్న నాకు కుడివైపు ఎదురుగా మెట్లమీద, దూరాన మీనాక్షి కనిపించింది. ఎప్పుడు వచ్చిందో, ఏమో ! అద్దాలు పెట్టుకున్నది? కూర్చుని తదేకంగా ఏమిటో ఆలోచిస్తూ ఎటో చూస్తున్నది. నాలో ఆవేగం హెచ్చింది. లేచి ఆమె దగ్గరకు వెళ్లాను. ఒకవైపు "ఏమిటీ కుర్రతనపు వేషాలూ ? ఆమె ఏమనుకుంటుందీ ?" అన్న హెచ్చరిక విమర్శ నాలో తలెత్తినా, దాన్ని గమనించే స్థితిలో లేను.

వెళ్లి చొరవగా ఆమెకు కొంత ఎడంగానే అయినా, దగ్గరగానే కూర్చున్నాను. ఆమె నా వైపు చూచి, గుర్తింపుగా చిరునవ్వు నవ్వింది. చిరాకుపడ లేదుకదా అని సంతోషించాను.

"ఎలా ఉంది ఆలయం ?" అని ఆమే పలకరించింది ఇంగ్లీషులో.

"బాగుంది. ఎంతో బాగుంది. ఈ పుష్కరిణి కూడా చక్కగా, ఎంతో నిర్మలంగా ఉంది."

''ఆలయానికి పుష్కరిణే ప్రాణం, మనిషికి హృదయంలాగ."

"మీరు మేధస్సుకంటె హృదయానికే, ఆలోచనకంటె ఆవేశానికే ప్రాధాన్యం ఇస్తారా ?"

ఏదో ఒక విషయం ఎత్తుకుని మాటలు పెంచి తీరాలన్న కోరిక నాలో ప్రబలంగా ఉంది.

"అవును, లేకపోతేఇక్కడికిరావటం ఎందుకు ?"

ఆ మాట నాలో ఆలోచనని పురికొల్పింది. ప్రొద్దున్న ఆమె తాను స్వయంగా 'అద్వైతి' నన్న విషయం గుర్తువచ్చింది. చదువుకున్నది. తెలివి గలది. చక్కని సంస్కారం. ఎటువంటి తొట్రుపాటూలేని నిండైన హావభావాలు, అన్నింటినీ మించిన-నన్ను ఆకట్టుకొన్న-సౌందర్యం. నాలో ఎన్నడూ కలుగని ఒక పరిపూర్ణమైన సంతృప్తి కలుగుతున్నది ఆమెను చూస్తే. ఇంతటి పరిపూర్ణమైన స్త్రీమూర్తి కనిపించడం నిజంగా అరుదే !

"అద్వైతంలో ఆవేశాని (Feeling) కంటె ఆలోచనకే ప్రాముఖ్యం అనుకుంటానే ! భక్తి ప్రపత్తులకంటే జ్ఞానందే పై చేయికాదా ?" అన్నాను.

''కాదు ! మీనాక్షీదేవి ఎలా ఉంది?''

ఇక్కడ నేను కొంత చనవు తీసుకోదలిచాను.

"ఏ మీనాక్షీదేవి ?" అన్నాను కొంటెగా

"ఏదైనా ఫరవాలేదు. రెండూ ఒకటే!" అని సమాధానం వచ్చింది.

ఆ గరువపు మాటకు క్షణంసేపు చకితుడనై మళ్లీ ముగ్ధుణ్ణయ్యాను. ఇక్కడ గరువమేగాదు, అద్వైతపరం గానూ సముచితంగానే ఉన్న దామాట అనుకున్నాను

"ఏమిటాలోచిస్తున్నారు ? రూపం లేనిది భావమూ, భావం లేనిది రూపమూ లేవు. నామంకూడా రూపంతోపాటే! నామం, రూపం మీలో కలిగించే భావమే ప్రధానం. అయినప్పుడు మీనాక్షి ఒకటే, రెండు కాదు!"

ఈ తర్కానికి నా బుర్ర తిరిగి పోయింది.

"అదెట్లాగంటారు ? అక్కడ విగ్రహం, ఇక్కడ మనిషి. సౌంద ర్యంలో సాదృశ్యం ఉందనుకున్నా, నాకు విగ్రహంకంటె మనిషే ప్రిఫెరెన్స్."

"అదే భ్రమ, మాయ, అజ్ఞానం. రెండు లేవు ఒకటే ఉంది. ప్రిఫెరెన్స్ లేకపోవడమే సమదృష్టి. అంటే సౌంద ర్యమూ, సౌందర్యరాహిత్యమూ అనే అనుభూతి విచక్షణ లేకపోవడంకాదు, అనుభూతిలో ఏకత్వాన్ని చూస్తూ భిన్నంగా కనిపించేసృష్టి మాయకు లోను గాకపోవడం."

"సృష్టి, జగత్తు, మాయ, వట్టిది అంటారు కదా! అలా అనుకుంటే అది కలిగించే భావాలూ, కల్పించే ఆశలూ, మాయేఅయి, వాటిని దాటి ఏదో అవా జ్మానసగోచరమైన ఆత్మ స్వరూపాన్ని పొందడం అద్వైతం అంటారు. మరి అద్వైతం లోకనిరాసం చెయ్యటంలేదా?"

"నామరూపాలూ, అవి కల్పించే భావాలూ, ఆశలూ వేరు వేరుగా లేవు. అవి అన్నీ ఒక్కటే, అదే సత్యం. వైవిధ్యమే మాయ. 'సృష్టిని మాయ' అంటే సృష్టి లేదనికాదు. సృష్టి అంటే ప్రకృతి, అనాదీ, అనంతరమే. పుట్టుక, చావు అనేవి ప్రతి జీవికీ ఉన్నా, సృష్టి మొత్తానికి మాత్రం ఒక్కసారి పుట్టుక, ఒక్కసారి చావు అనేవిలేవు! సృష్టి లక్షణం మార్పు. ఈ మార్పునుకాదని అనుభూతి ఏకత్వాన్ని పొందటమే 'అద్వైతం' చెబుతుంది. ఈ లోకం వట్టి దనీ, గట్టిది వేరే ఎక్కడో ఉంది వెదక మనీ చెప్పదు. ఈ సంగతి సరిగా అర్థం చేసుకోవడంలోనే కీలకం ఉన్నది. వైవిధ్యం వట్టిది, ఏకత్వం గట్టిది అంతే."

"అయితే వైరాగ్యం మాటేమిటి! జీవితానుభూతిపట్ల వైముఖ్యంకాదా వైరాగ్యం అంటే ?"

"కాదు. వైరాగ్యం అంటే ఇందాకా చెప్పినట్లు ప్రిఫెరెన్స్ లేకపోవడం. అదే సమదృష్టి."

"అయితే నాకు వైరాగ్యంలేదు! నేను విగ్రహానికంటె మనిషినే ప్రిఫెర్ చేస్తాను!" అన్నాను నవ్వుతూ. అంతటితో ఆగకుండా, "ఇలాంటి దేవాలయాలు కట్టేదానికంటె డాములూ, ప్రాజెక్ట్‌లూ కట్టితే ఎంత ప్రజోపయోగం! అదే ప్రాచీనులకూ మనకూ దృక్పథంలోగల భేదం! నెహ్రూ, ప్రాజెక్ట్‌లనే నేటి దేవాలయాలు, అన్నాడు. ఎంత గొప్ప మాట! నాకు ఆధ్యాత్మికతకంటె జీవితంమీదే ఎక్కువ అభిమానం!" అన్నాను.

"రెండింటికీ భేదంలేదు. ఆనాడు విగ్రహమూ మనిషీ ఒక్కటి. ఈనాడు యంత్రమూ మనిషీ ఒక్కటి. ఇది మనిషిలోకాదు మనుష్యుల ఊహలో నేడు వచ్చిన మార్పు. ప్రిఫెరెన్స్. ఇప్పటికీ వైయక్తికంగా మనిషి తనవంటి విగ్రహాన్నే ప్రిఫెర్ చేస్తాడు! గాంధీకి నెహ్రూకి ఊరూరా ఇన్ని విగ్రహాలెందుకూ? ఆ డబ్బుతో ప్రాజెక్ట్‌లు కట్టరేం? మీరు మధుర ఎందుకు వచ్చినట్లు?"

నేను సమాధానం చెప్పలేదు. ఆమె బుద్ధి నైశిత్యాన్ని మెచ్చుకుంటూ ఆమె మాటల్ని అవగాహన చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాను

అవును. నేను మధుర ఎందుకు వచ్చినట్లు? నన్ను నేనే ప్రశ్నించుకుంటున్నాను. సహేతుకంగా చెప్పదగిన సమాధానమేమీలేదు!

"నేను మధుర వచ్చింది మిమ్మల్ని కలుసుకోవటానికే" అన్నాను రొమాంటిక్‌గా.

"కావచ్చు" అన్నదామె గంభీరంగా, నాతో ఏకీభవిస్తూ. అలా అనడంలో నవ్వులేదు. హాస్యధోరణి అన్న సూచనే లేదు. ఆమె 'సీరియస్‌నెస్' నాలో కించిత్ భయాన్ని కూడా కలిగించింది. ఆమె మామూలు వ్యక్తికాదని తోచింది.

ఇంతలో ఎవరో ఒక అరవై ఏళ్ల ముత్తైదువ అక్కడికి రావటంచూచి మీనాక్షి లేచి ఆమె దగ్గరకు వెళ్ళింది. "వెళ్తా" నని నాకు చెప్పనైనాలేదు. ఇద్దరూ వెళ్లిపోతున్నారు. మీనాక్షి నావైపు తిరిగైనా చూడలేదు! అలా నా మానాన నన్ను వదలి వెళ్లిపోవటం, అంతసేపూ మాట్లాడిన గుర్తైనా లేకుండా ప్రవర్తించడం నాకు బాధ కలిగించింది. నేను వాళ్ల వెనుకే నడిచాను.

ఎలాగైనా మీనాక్షి వెంబడేవెళ్లి ఆమె యిల్లు కనుక్కోవాలనుకున్నాను కాని నిన్నటి అనుభవం గుర్తుకు వచ్చింది. తీరా నా చెప్పుల్ని నేను వెదుక్కునేంతలో ఆమె మళ్లీ అంతర్ధానం కావచ్చు! అప్పుడు గతేమిటి? నాకు వెంటనే ఒక ఊహ తట్టింది. నేను గబగబా ముందుకు నడిచాను. మీనాక్షినీ

